

జననం తే. 2-8-1924; బి. ఏ. దాకా చదువు

కుటుంబ నియంత్రణలో శిక్షణ; వక్త, గ్రంథకర్త,
స్వచ్ఛంద సమాజ సేవకురాలు

| | |
|---|---|
| మల్లాది సుబ్బమ్మ ట్రస్టు | వ్యవస్థాపకురాలు |
| మహిళాభ్యుదయ సంస్థ | అధ్యక్షురాలు |
| ప్రజాస్వామ్య ప్రచురణలు | మేనేజింగు డైరెక్టరు |
| వైవాహిక, కుటుంబ సలహాసంఘం | కార్యదర్శి |
| మహిళాభ్యుదయ గ్రంథాలయం | ప్రెసిడెంటు |

ఆం. ప్ర. అభ్యుదయ వివాహవేదిక డైరెక్టరు

ఆం. ప్ర. హేతువాద సంఘం ఉపాధ్యక్షురాలు

అ. భా. రాడికల్ హ్యూమనిస్టు సంఘ జాతీయ సమితి సభ్యురాలు

భారత హేతువాద సంఘ కార్యనిర్వాహక సమితి సభ్యురాలు

# కాంతి కిరణాలు

## మల్లాది సుబ్బమ్మ




ప్రజాస్వామ్య ప్రచురణలు [ప్రై] లిమిటెడ్

9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం,

హైదరాబాద్ - 500 028

# కాంతి కిరణాలు

ఆ రోజు పౌర్ణమి. పుష్పవృష్టిలాంటి వెన్నెల, చల్లని పిల్ల గాలులు ఎంతో ఆహ్లాదాన్నిస్తున్నాయి. శరచ్చంద్రుని ధవళ కాంతులు ఎక్కడలా వెల్లివిరుస్తున్నాయి. ఆ కాంతుల ప్రసరణతో నక్షత్రాలు సైతం చిన్నబోయి మసకబారుతున్నాయి. కవుల మనోగతాలు క్రొంగొత్త ఊహలను సృష్టిస్తున్నాయి. ఆ వినీల ఆకాశసౌందర్యాన్ని తిలకిస్తూ తన్మయులై పోతున్నారు నవదంపతులు. మధురానుభూతులననుభవిస్తున్నారు ప్రేయసీ ప్రియులు. పులకిత హృదయులై సర్వాన్ని మైమరచి పోతున్నారు నవోఢలు. ఆనందంతో ఉక్కిరిబిక్కిరై పోతున్నారు బాలబాలికలు. ఆ శరత్కాలపు పున్నమి వెన్నెలలో సర్వులూ అవ్యాజానుభూతిని అనుభవిస్తున్న ఆ తరుణంలో దుర్గ మాత్రం వేడివేడి నిట్టూర్పులను విడుస్తోంది. ఆ చల్లని, తెల్లని వెన్నెల ఆమెకు మాత్రం తపన కలిగిస్తోంది; శరీరమంతా కంపరంగావుంది.

డాబామీద పడుకున్న దుర్గకు ఎంత ప్రయత్నించినా కునుకు రాలేదు. దీర్ఘంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విడుస్తోంది. పుట్టెడాలోచనలతో మథనపడుతోంది. శరవేగంతో భావపరంపరలు దొర్లి పోతున్నాయి. క్రితం రాత్రి తల్లి దండ్రుల సంభాషణ ఆమె మనస్సులో సినిమా రీలులా తిరిగిపోతుంది. శరీరం గగుర్పాటు చెంది చకితురాలయింది. పోనీ అమ్మ మాట వింటే ఏం? అని

తోచింది. తనను ఎంతో ఆప్యాయంగా కని పెంచిన అమ్మ కదా! తన తల్లి అమాయకురాలు; గడపదాటి ఎరుగదు. ఆ ఊరి పొలిమేర ఆమె ఒక సారే దాటింది. అదయినా ఆమె కాపురానికి వచ్చినప్పుడు. అలాంటి అమ్మకు ఏం ప్రపంచజ్ఞానం ఉంటుందని ఆమె మాటలను అంతగా తను జ్ఞాపకం చేసుకోవాలి? ఇలా మధన పడుతున్న దుర్గకు ఎందుకో ఆ సంభాషణ అంతా మళ్ళీ ఒక్కసారి స్ఫురణకు వచ్చింది.

"దుర్గా! ఇంకా ఇలా ఎన్నాళ్ళే? ఈపాటికి నీ స్నేహితురాళ్ళందరికీ ... ... ..." అంటున్న తల్లికి మాట మధ్యలో అడ్డు పడింది దుర్గ.

"అయితే అమ్మా! నీ కూతురూ అందరి లాంటిదేనా? చిన్నప్పుడు మా అమ్మాయి అందరికన్న గొప్పది అని చెప్పేదానివి కదా!" చిన్నబోయిన ముఖంతో అన్నది దుర్గ.

"కాదనను కానీ! అమ్మాయీ! ఏ కాలానికి జరగాల్సిన అచ్చటా ముచ్చటా ఆ కాలానికి జరగాలా? వద్దా!" బాధపడుతూ ప్రశ్నించింది తల్లి.

"వీటి కోసం ఎవడినో ఒకడిని కట్టుకొని ఊరేగమంటావా?" రోషంగా అడిగింది దుర్గ.

"కాదమ్మా! ఏదో ఆడపిల్లవు! గంపెడు సంతానంతో మహాలక్ష్మిలా ఇంటికివస్తావని తల్లిదండ్రులకు ఆశ వుంటుందమ్మా."

"ఆడపిల్లనై నేను మీకు అంత బరువయినా నా అమ్మా!" జాలిగాచూస్తూ అన్నది దుర్గ.

"ఏమిటే ఆ మాటలు? నీ బరువు మేము మోస్తున్నామా ఇలా అనటానికి. కాకపోతే ఊరంతా సుగుణమ్మ కూతురుకు పాతికేళ్ళు నిండినా ఇంకా పెళ్ళి కాలేదని అదేపనిగా అంటుంటే వినలేక అన్నానమ్మా! అంతే; నీ మనసు కలత పెట్టుకోకు మాకు ఒక్కగా నొక్క బిడ్డవు. మా ఘటాలు రాలిపోతే నీ ఆలనా పాలనా ఎవరు చూస్తారు తల్లీ!" సుగుణమ్మ గొంతు జీరపోయింది. ఖిన్నురాలయి తలవొంచుకుని నేలచూపులు చూస్తోంది దుర్గ.

"అసలు తోడూనీడా లేని ఆడదాని జీవితం ఎడారిలాంటిదమ్మా! ఆడదానికి ఆజన్మాంతం అండదండలుండాలమ్మా! ఆదరించి లాలించి పాలించే మగడువుంటేనే స్త్రీజీవితానికి ఒకగమ్యం, సార్థకతా వుంటుందమ్మా! అయినా దేశం తిరిగినదానవు; నేనంటావా! గడపదాటని దాన్ని. అయినా నా మాటను ఎవరు ఖాతరు చేస్తారు? కట్టుకున్న ఆయన నా మాటవిన్నారు కనుకనా నీవు వినటానికి" గద్గద కంఠంతో బాధపడుతూ అన్నది తల్లి.

"అమ్మా! నీ మాటను ఏనాడు కాదన్నామమ్మా! నాన్నగారికి నీ మాట వేదవాక్యం కాదా?"

"అదేనమ్మా నా అదృష్టం. అందరూ అలాగే అంటారు" 'నీకు పెద్ద చదువులువద్దు. పెండ్లి చేయండి మొర్రో' అంటే విన్నారూ ఆయన? పోనీలే అమ్మా ఈ వాదన ఎందుకు? నీ ఇష్టం ప్రకారమే జరుపుకో. ఎక్కడో అక్కడ ఎలాగోలాగు సుఖంగావుంటే అంతేచాలు."

"ఏమిటో! తల్లీ కూతుళ్ళు అదేపనిగా మాట్లాడుకుంటున్నారు" పై కండువా వొంకెకేస్తూ అడిగాడు. అప్పుడే పొలంనుండి వచ్చిన తన తండ్రి ఈ సంభాషణ అంతా విని.

"నాన్నా! నేనిక చదవదలుచుకోలేదు, చదివింది చాలు. జన్మ సార్థకం చేసుకోదలిచాను."

"అయితే ఉద్యోగంలో చేరతావన్నమాట. నీకు ఉద్యోగం చేయాలంటే అలాగే కానియ్యి అమ్మా! కాకపోతే నా కొకటే సందేహం." అన్నాడు తండ్రి.

"ఎందుకండీ నసుగుతారు? సూటిగా మీ అభిప్రాయం ఏమిటో చెప్పెయ్యరాదూ. ఇంతకూ, పెండ్లి అయితే అల్లుడు అమ్మాయిని ఉద్యోగం చెయ్యవద్దంటే అపుడు మానుకోవడం కష్టమనిపిస్తుందేమో అనేగా మీ సందేహం" కుండ బద్దలు కొట్టినట్లు చెప్పింది తల్లి.

"నేను మీరనుకున్నట్లు ఉద్యోగం చేయదలచుకోలేదు. ఎం. ఏ. సోషల్ వర్క్ విద్యార్థిని అయిన నేను చదివినవిద్యను సమాజ పరంగా వినియోగించదలచుకున్నాను" అన్నది దుర్గ.

దిగ్భ్రాంతి చెందాడు తండ్రి.

"అలాగయితే నీకు పెండ్లి కావటం కష్టమమ్మా! నీవు బ్రహ్మచారిణిగా ఇంట్లో తిరుగుతూ ఉంటే మేము సహించలేము" అన్నాడు తండ్రి.

"అదేమిటి! మన ఇంటా వంటా లేనిమాటలు. ఇంతకూ నిన్ను అని ఏం లాభం. అంతంత పెద్ద చదువులు వద్దయ్యా అంటే ఈయన వింటేగా. ఈ చదువు మా కొంపతీస్తున్నది." అని భర్తను సాధించింది తల్లి.

"నన్ను సాధిస్తావేం? కరణంగారి అమ్మాయి పి. హెచ్. డి చేసింది ఎంచక్కా తన తల్లిదండ్రులు కుదిర్చిన పెండ్లి చేసుకో లేదా? చదువుకు - నీ కూతురు నిర్ణయానికి ఏం సంబంధం" అని సమాధానం చెప్పాడు తండ్రి.

ఇన్ని మాటలువిన్న దుర్గ ప్రశాంతంగా పలికింది.

"నా నిర్ణయాన్ని కాదనవద్దు. మీకు బాధగా వున్నా నా నిర్ణయం మారదు. వ్యక్తిత్వం వున్న మనిషికి ఆలోచనలు, అభిరుచులు, కోరికలు, ఆశయాలు, లక్ష్యాలు వుంటాయి. వాటి కోసం ఆ మనిషి అహరహం తపించటం చూస్తున్నాం. నా జీవితం అందరు ఆడపిల్లలలాగా గడపాలనిలేదు. ఆడపిల్లలకు పెండ్లితప్ప మరేమీ ధ్యేయం వుండరాదని మీరంటే నేను అంగీకరించను. నాకు జీవితంలో వున్నతమయిన లక్ష్యాలు సాధించాలని వుంది. వాటి కోసం నేను ఎంతైనా శ్రమపడతాను; కష్టనష్టాలు ఎదురైనా భయపడను. చివరకు అవసరమయితే ఆత్మార్పణ చేయటానికయినా సిద్ధమే."

నిరుత్తరులు అయ్యారు తల్లిదండ్రులు. ఆ రోజు సాయంత్రం ప్రయాణం కట్టింది దుర్గ.

## 2

ఎం. ఏ సోషియాలజీ పూర్తిచేసిన తరువాత దుర్గ హాస్టలులో వుండటం మానేసింది. తోటి విద్యార్థినుల కేరింతలు ఆమెకు నచ్చలేదు. వారికి జీవితం యెడల అవగాహన లేదనిపించింది ఆమెకు. చాలమందికి కష్టసుఖాలు తెలియవు. ధనవంతుల పిల్లలకు అసలే తెలియవు. పేద కుటుంబాల పిల్లలుకూడా ధనవంతుల పిల్లల అలవాట్లను అనుకరిస్తున్నారు. ఇదంతా ఏదో కృత్రిమ వాతావరణంగా తోచింది ఆమెకు. అందుకనే పట్టణ సరిహద్దులలో చవకగా ఒక చిన్న భాగం అద్దెకు తీసుకున్నది. చిన్న వరండా, ఒక పెద్ద గది, చిన్న వంటఇల్లు ఆమె భాగంలో వున్నాయి. వంటచేసుకొని

ఫోంచేసి కాలేజీకి వెళ్ళేది. మిగతా సమయం ఎక్కువగా లైబ్రరీలో గడిపేది. ఎంత చదివినా ఇంకా చదవాలనిపించేది. రాత్రి ఏ పది గంటలకో ఇంటికిచేరేది. ఇదీ ఆమె దినచర్య.

ఆమె హైదరాబాదు వచ్చిన సాయంత్రం మోహన్ ఆమె ఇంటికి వచ్చాడు.

"హల్లో దుర్గగారూ! తిరిగి హైదరాబాద్ వచ్చేశారే? మూడుముళ్ళూ వేయించుకొని మళ్ళీ హైదరాబాద్ ముఖం చూడ రేమోనని అనుకున్నాను" అంటూ మోహన్ ఆమెను పలకరించాడు.

"మిస్టర్ మోహన్! ఎన్ని ఏళ్ళు మీదపడ్డా నీ వేళాకోళపు పద్ధతులు పోలేదుకదా! అయినా నన్ను తక్కువగా అంచనా వేశావు." అని దుర్గ సమాధానం చెప్పింది.

"అదికాదండి! మాములుగా ఎంత చదివిన యువతి అయినా తల్లి దండ్రులు చెప్పినట్లు పెండ్లి చేసుకుంటుంది గనుక అలా అన్నాను. అంతేకాని దురుద్దేశ్యం లేదు. మీ మనస్సుకు కష్టం కలిగితే మన్నించండి."

"మోహన్! నీవన్నది నిజమే. సాధారణంగా స్త్రీకి వివాహమే ముఖ్యమని అందరూ అనుకుంటారు. కాని అసాధారణ మనస్తత్వం కల స్త్రీలూ ఉంటారు. వారిలో నేనొకతెను. ఏదో సంఘసేవ చేయాలని నా ఆరాటం. ఏ రంగంలో ప్రారంభించాలో ఇంకా నిర్ణయించుకోలేదు. నీవేమైనా సలహాచెప్తావా?"

"మీకు నేను సలహా చెప్పగలవాడినా? మీరు డబుల్ ఎం. ఏ నేను సింగిల్ ఎం. ఏ మాత్రమే. నేను చదివింది ఒక సబ్జక్టు

మాత్రమే. మీకు నాకన్నా ఎక్కువ ప్రపంచానుభవం ఉన్నది కదా!"

"సరే! హాస్యోక్తి మాటలకేంగాని. నా సంగతి అలా ఉంచు. నీవు ఏం చేయదల్చుకున్నావు?"

"మెడికల్ కాలేజీలో పోస్టు డాక్టరేటు రిసెర్చి చేయదలచాను. సీటు వస్తుందని స్వయం చెప్పారు మా డిపార్టుమెంటు హెడ్. స్కాలర్‌షిప్ కూడా ఉంటుంది. ఏదో ఇలాగు జీవితం గడిపేస్తాను."

"మరి అంటే మీరు పెండ్లి మార్కెటులో లేరన్నమాట"

"నేను పరిశోధనకు, మానవ సంక్షేమానికి నా కాలాన్ని జీవితాన్ని అంకితం చేయదల్చుకున్నాను."

"మిస్టర్ మోహన్! నీకేమో బ్రహ్మచారిగా ఉండి జ్ఞానాభి వృద్ధికి పాటుపడాలి. నన్నేమో పెళ్ళి చేసుకోమని హెచ్చరిస్తావు. బాగుందయ్యా నీ వరస" అని చెప్పి ఉడికించింది దుర్గ.

మోహన్ త్రుళ్ళిపడ్డాడు.

"అదికాదండీ నా భావం. మాటవరసకి అన్నాను. అదే సరే కానీయండి మరి మీరు సంఘసేవకు పూనుకుంటే మీకు మీ తల్లి దండ్రులు డబ్బు పంపిస్తారా? మరి ఎలా గడుస్తుంది సంసారం?"

"మళ్ళీ అదేమాట. సంసారం లేదుబాబూ నాకు. వద్దు కూడాను. నా జీవితం వెళ్ళదీయటానికి నాకు చాలా తక్కువ డబ్బు చాలు. మా నాన్నగారు చాలా మంచివారు. ఆయన నాకు పైకం పంపుతారనే అనుకుంటాను. ఒకవేళ పంపకపోయినా ఏ ధర్మ సంస్థ తరఫునో పనిచేస్తాను. వారిచ్చే కొద్దిపాటి జీతంతో నా ఖర్చు

వెళ్ళిపోతుంది" అని వివరించింది దుర్గ. మోహన్ చకితు డయ్యాడు. ఆమె ధృఢనిశ్చయానికి తన మనస్సులో జోహారు అర్పించాడు.

"వెళ్ళివస్తాను దుర్గగారూ! మీ కృతనిశ్చయానికి నా అభినందనలు అందుకోండి. మీ బోటివారి పరిచయంవల్ల మా బోటి సామాన్యులకు ఇతోధికంగా ఉత్తేజం కలుగుతుంది" అంటూ లేచాడు మోహన్.

"అదిగో అదిగో! మళ్ళీ మొదటికి వచ్చారు - నన్ను మునగ చెట్టు ఎక్కించేస్తున్నారు" అని నవ్వుతూ సాగనంపింది దుర్గ.

లోపలికి వెళ్ళి మంచం మీద మేనువాల్చింది. బుర్రలో ఎన్నో ఆలోచనలు క్యూలో నించున్నాయి. ఎన్నో ప్రశ్నలు. తన నిర్ణయం మంచిదేనా! లక్ష్యసిద్ధిని తను పొందగలదా? ముందు ముందు ఎన్ని కష్టాలువస్తాయో? వాటిని ఎదుర్కొనగల ధైర్యం తనకు ఉంటుందా? తనకు తోడుఎవరు! పెండ్లిచేసుకుంటే తోడు ఉంటుందనే మాటవాస్తవమే. కాని ఆ తోడుకోసం ఎంతకాలం వ్యయంచెయ్యాలి? భర్త మంచివాడు కాకపోతే జీవితం నరకమేకదా! ఒకవేళ అతడు మంచివాడైనా అతని లాలనా పాలనా చెయ్యటంలో భార్య శక్తి యుక్తులు నశించిపోవా? ఈ ఆలోచనలతో ఆమెకు తలనొప్పి వచ్చింది. ఆస్ప్రిన్ మాత్ర వేసుకొని నిద్రపోయింది దుర్గ.

# 3

తెల్లవారుఝామున దుర్గ నిద్రలేచింది. కాలకృత్యాలు తీర్చు కొని త్వరత్వరగా వంట చేసుకున్నది. పత్రికవాటాలో ఏదో

పెద్దగా మాటలు వినపడుతున్నాయి. ఒక స్త్రీ గొంతు ఒక పురుష కంఠస్వరం. ఇవి రాత్రుళ్ళు సహజం కనుక తను విన సాగింది.

మధ్య అద్దెకుంటున్న ఇంటిలో ఇంటివారుకాక మూడు కుటుంబాలు అద్దెకున్నాయి. మొదటి వాటాలో ఇంటివారు, రెండవ వాటాలో వెంకటలక్ష్మి, మూడవ వాటాలో దుర్గ, నాల్గవ వాటాలో కుటుంబరావు కాపురం ఉంటున్నారు. ఇప్పుడు ఆమెకు వినబడే మాటలు కుటుంబరావు వాటా వైపునుండి వస్తున్నాయి.

కుటుంబరావుగారికి [illegible] సంవత్సరాల వయస్సు. ఆయన భార్యపేరు లలిత. ఆమె ఎమ్. ఎస్. సి. చదివిందట. ఆమెను కుటుంబరావుగారు ప్రేమించి వివాహమాడారట. ప్రేమికులు మరి అంత పెద్దగా ఎందుకు మాట్లాడుకుంటున్నారో!

ఎంత వద్దనుకున్నా అవతలివారి మాటలు దుర్గకు విన వస్తున్నాయి. ఆమె వినక తప్పలేదు.

"ఏమే! ఇంకా వంటకాలేదా! ఏరోజు నీవు సకాలానికి అందించావు కనుక ఈరోజు వేళకు భోజనం పెట్టడానికి?"

"వంట కాలేదండీ! గ్యాసు అయిపోయిందని 15 రోజుల నుండి మొత్తుకుంటున్నా మీరు పట్టించుకుంటే కదా!" స్త్రీకంఠం పలికింది.

"అవునే! నాదే తప్పు. ఎప్పుడూ నాదే తప్పు. గ్యాసు తేలేదని నెపం. ఎప్పుడూ ఏదోసాకు చెప్పడం తప్ప ఏనాడు నీవు సర్దుకుపోయావు కనుక." కుటుంబరావు ఉక్రోషంతో జవాబిచ్చాడు.

"తప్పుచేసింది కాక ఇంకా సాధిస్తారా? బొగ్గులపొయ్యి మీద వంటచెయ్యాలి కదా! కిరసనాయిలులేక స్టౌ వెలగటంలేదు. అంతగా అలస్యమైపోతుందనుకుంటే హోటలులో తినండి ఈవాళికి." కోపమూ, దుఃఖమూ పెనుగొన్నాయి ఆమెకంఠంలో.

"తింటానే తింటాను. హోటలులో తింటాను. లేకపోతే పస్తుపడి ఉంటాను. నీకుతృప్తి అవుతుందా? నీవుమాత్రం తీరికగా వండుకొని హాయిగా కడుపునిండా భోంచెయ్యి. నీకు నావల్ల బాధ ఉండదులే. ఇక వెళ్తున్నాను."

"చూశారా! చూశారా! ఎ న్ని మా ట లు అంటున్నారో. మిమ్మల్ని పస్తుపడుకోబెట్టటం నాకు ఇష్టమా? ఎంత మారిపోయ్యా రండీ మీరు. ఆ రోజుల్లో లలితా నీవు లేకపోతే నేను బ్రతకలేను" అని నన్ను తీయని మాటల్తో ముంచేసి పెళ్ళాడారే? ఇపుడు ఇలా నానామాటలూ అంటారా? అనండి, అనండి. ఇదంతా నా కర్మ. కర్మఫలం అనుభవించక తప్పుతుందా? చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ." అంటూ సాగదీసింది లలిత.

"అవునే! నిజమేనే! చేశాను జీవితాంతంలో పెద్దతప్పు; అదే నిన్ను పెండ్లి చేసుకోవటం. ప్రేమించే పెండ్లి చేసుకున్నాను! కాదని నేను అనలేదే? పెండ్లాము అంటే వంటచెయ్యనక్కరలెదా? ఇల్లు సర్దుకోనక్కరలేదా? సంపాదించలేకపోతేమానె ఇంటి యజమాని సౌకర్యాలు చూడనక్కరలేదా? ఇవన్నీ చెయ్యలేకపోతే ఇల్లాలు ఎందుకు భర్త నెత్తిన ఎక్కటానికా? ఛీ! ఛీ! ఎంతవరకు వచ్చింది నీ వ్యవహారం;" అంటూ విసుక్కున్నాడు కుటుంబరావు.

"అయితే వంటలక్కను పెండ్లి చేసుకోలేక పోయారూ? ప్రేమ ప్రేమ అని నావెంటపడ్డప్పుడు "నీకు వంటవచ్చా" అని మీరు

“భగవాన్! అనుకోమరి. పొగరెక్కితే సరి. నీతోటి వాళ్ళకు పక్ష ప్రాయశ్చిత్తం, మాన ప్రాయశ్చిత్తం చేస్తేకాని లాభంలేదు.”

“మనిషికో మాట గొడ్డుకో దెబ్బ అన్నారు. నీవు వట్టి పశువువు. నీకు అర్థమయ్యే భాష వీపు తాషా మారఫా మోగించడమే” పెద్దగా గట్టిగా హూంకరించాడు కుటుంబరావు.

ఇంతలో వాకిలి చప్పుడు అతనికి వినిపించింది. అది పై స్త్రీ కంఠధ్వని. ప్రక్కవాటా దుర్గ గొంతులాగుంది. చదువుకున్న ఆడ పిల్ల ఎదుట తను అభాసు పాలవటం మంచిదికాదనుకొని చొక్కా, కోటు వేసుకొని బజారు వాకిలి తలుపుతీసి తలవంచుకొని ఎంచక్కా పోయాడు.

దుర్గ లోపలికి పోయింది. లలిత భుజంమీద చెయ్యివేసింది. ఆమెకన్నా తను ఐదేండ్లు చిన్న. ఆమెను ఏమని ఓదార్చగలదు? పుస్తకాల్లో చదివిందేతప్ప భార్యాభర్తల అనుబంధం విషయం తనకు అనుభవరీత్యా తెలియకపోయెను. ఏదైనా తను సమయానికి వచ్చి ఒక దుస్సంఘటనను తప్పించానని తనను అభినందించుకున్నది.

లలిత పరిస్థితి మరీ సంక్లిష్టంగా ఉన్నది. భర్త చేసిన అవమానానికి ఒకవైపు దుఃఖం, దుర్గకు ఈ విషయం తెలిసిందే అని మరియొకవైపు లజ్జ. ఈ రెండుభావాలు ఆమె మనస్సులో ముప్పిరిగొన్నాయి. నోటమాట పెగలలేదు. ఆకాశంలోకి చూస్తూ నిలబడిపోయింది. ఇంక అక్కడ ఎక్కువసేపు ఉండటం కష్టమని పించింది దుర్గకు. వెంటనే తిరిగి తన వాటాలోకి వెళ్ళిపోయింది. ‘ఇదా పెండ్లి అంటే?.........’ ఈ ప్రశ్నతప్ప మరేదీ ఆమె మనస్సులో చోటుచేసుకోలేక పోయింది.

# 4

ఆ రోజు సాయంత్రం వెంకటరావుగారి ఇంట్లో టీ పార్టీ. వాళ్ళ అబ్బాయి పుట్టినరోజు. చుట్టుపక్కల వాళ్ళను తప్ప ఎక్కువ మందిని ఆహ్వానించలేదు. వాళ్ళ ఇంటిలోని నాలుగు వాటాల వారిని పక్క ఇంటిలోని వాటాలవారిని పిలిచారు. స్త్రీ పురుషులందరికీ ఆహ్వానం వెళ్ళింది. పక్కఇంటిలో ఒక వాటాలో మోహన్, ఇంకోవాటాలో రామకృష్ణ కాపురముంటున్నారు. రామకృష్ణ, శ్యామలాదేవి మోహన్ వచ్చారు. దుర్గకు ఇలాంటి వినోదాలు ఇష్టం లేదు, కాని రావలసి వచ్చింది. వెంకట్రావు అతని సతీమణి లలిత కూడా వచ్చారు.

పిల్లవాళ్ళకి కూల్ డ్రింకు పెట్టి హారతి ఇచ్చింది వెంకట్రావు భార్య. ఆడవారికి పసుపు తాంబూలాలు ఇచ్చింది. మగవాళ్ళంతా ఒక గదిలో కూర్చొని మాట్లాడుకుంటున్నారు.

స్త్రీలు కూర్చున్నచోట సంభాషణ ఇలా సాగింది. "మన దుర్గకు ఇలాంటి వంటింటి పిల్లాడు ఎపుడు పుడతాడో!" అన్నది లలిత.

లలితకు తెలుసు దుర్గ అవివాహిత అని. పెండ్లి అయితేకదా పిల్లలు కలిగేది! ఈ విషయమూ తెలుసు లలితకు. కాగా మొన్న తన ఇంట్లో జరిగిన సంఘటన ఆమెకు తెలిసిందని ఉక్రోషం.

"ఏమిటండీ వేళాకోళం! దుర్గకు ఇంకా పెండ్లి కాలేదని మీకు తెలియదా?" అన్నది వెంకట్రావు భార్య విమల.

"పెండ్లి కాకపోతేమాత్రం పిల్లలు కలుగకూడదా?" అని ప్రశ్నించింది లలిత.

"వారు అన్నది నిజమే! పెండ్లికీ పిల్లలు కలుగటానికి సంబంధం లేదు" అని అంగీకరించింది శ్యామలదేవి.

విమల విస్తుపోయింది. ఆమె పెద్దగా చదువుకోలేదు. సైన్సు ఎంతగా పెరిగిందో ఆమెకు తెలియదు. పెండ్లిలేని మాతృత్వం నింద్యమని ఆమె అమ్మమ్మ చిన్ననాడు చెప్పిన మాట ఆమెకు గుర్తున్నది.

"పెండ్లి లేకుండా పిల్లలను కనటం పాపం కదూ!" అని ప్రశ్నించింది విమల.

"పెండ్లాడి భార్యాభర్తలు కుక్కలలాగా కాట్లాడుకునే దానికన్న ఇదేమంత నింద్యంకాదు" గట్టిగాచెప్పింది శ్యామలాదేవి. గతుక్కుమన్నది లలిత. మొన్న జరిగిన సంగతి దుర్గ శ్యామలా దేవికి చెప్పి ఉంటుందని ఆమెకు తోచింది. కోపంతో తుకతుక ఉడికిపోయింది.

"పెండ్లి పెటాకులు లేనివాండ్లకు, అక్కరలేని వాండ్లకు అన్నీ అలాంటి ఆలోచనలే వస్తాయి" అని ఈసడించుకుంటూ చకచకా వెళ్ళిపోయింది లలిత.

ఆమె అలా అసభ్యంగా వెళ్ళిపోయినందుకు విమల మనస్సుకు కష్టం వేసింది; కాని ఊరుకున్నది.

"పాపం! అమాయకురాలు! అందుకనే అలా ప్రవర్తించింది. జనం ప్రేమ, ప్రేమ అని కూనిరాగాలుతీస్తూ పెండ్లాడుతారు. తీరా గృహిణీజీవితం ఎంత కష్టనిష్ఠూరాలతో కూడుకొని ఉందో తెలిశాక ఉలిక్కిపడతారు." అంది శ్యామలదేవి. సంభాషణ నడుస్తున్న తీరు

పెంక్షి లేకుండా కాపురము చేయడం అనేది చట్టరీత్యా సమ్మతం కాదే! పైగా మరో ప్రశ్న. నైతికంగా అలాంటి ప్రవర్తన సమర్థ నీయమా? ఇలాంటి అనుమానాలు, సందేహాలు ఆమె మనస్సులో ముప్పిరిగొన్నాయి. ఇలా ఆలోచించి, ఆలోచించి అలసిపోయి నిద్రపోవడానికి ప్రయత్నం చేస్తోంది దుర్గ. ఇంతలో వెంకట్రావు వాళ్లలో నుండి మాటలు వినపడినై. వారు పెద్దగా మాట్లాడుకోక పోయినా మధ్యగోడ పల్చనిదైనందున స్పష్టంగా వినపడున్నాయి దుర్గకు ఆమె ఏ ప్రయత్నమూ చేయకపోయినా.

" ఏమోయి పిల్లవాని పుట్టిన రోజు సంబరంబాగా జరిగినట్టేనా నీవు పిల్చినవారంత వచ్చారుగా" అంటున్నాడు వెంకట్రావు.

"అందరు ఆహ్వానితులు వచ్చారండీ. కాని అంతాఅయి పోయిన తరువాత కొన్ని అసందర్భపు మాటలు నడిచాయండి" అని చెప్పింది విమల. జరిగినకథ అంత ఆమెభర్తకుచెప్పి ఉంటుంది కాబోలు. వెంకట్రావు ఇలా అన్నాడు.

"చూడు విమలా! కుటుంబరావు వాలకంచూస్తే అతగాడు భార్యను బాధపెట్టే స్వభావం కలవాడని తోస్తుంది నాకు."

" ఎలా తెలిసిందండీ మీకు? అతని మాటలో ఏమైనా మీకు స్ఫురించిందా?"

"నీవుచెప్పిన కథనుబట్టి అలా భావిస్తున్నాను. లేకపోతే వయస్సులో ఉన్న దంపతులలో ఆమెకు అంత చిరాకు, ఇతరులను బాధపెట్టే మనస్తత్వమూ ఉండవు." ప్రపంచానుభవం కల వెంకట్రావు సమాధానమిచ్చాడు.

చేసుకున్నారు ఇద్దరూ. వారిని సాదరంగా ఆహ్వానించింది దుర్గ. వారిని ఆసీనులను చేసిన తరువాత దుర్గ అన్నది. "నేను క్రొత్తగా వచ్చాను ఈ ఉద్యోగంలోకి. ఉద్యోగం స్వీకరించి పదిహేను రోజులే అయింది. అందువల్ల మీ పరిచయ భాగ్యం అంతకు ముందు నాకు కలుగలేదు." మర్యాదగా మాట్లాడింది దుర్గ.

"అవునండీ! మేము శరణాలయానికి వచ్చి సుమారు నెలరోజులయింది. మేము నెలకొకసారి ఇచ్చటికి వస్తాము. పిల్లలందరికీ ఏదో ఒకటి ఇచ్చి వెళ్ళడం మాకు ఆనవాయితీ." అన్నది కమల.

"అలాగా! సంతోషము. మీ పరిచయంకావడం నా అదృష్టము. మీలాంటి వదాన్యులు ఉండబట్టే ఇలాంటి సంస్థలు బాగా నడుస్తున్నాయి." మనస్ఫూర్తిగా మాట్లాడింది దుర్గ.

"అలా పొగడకండి మమ్మల్ని. మనం సమాజానికి చేసే సేవ సముద్రంలో కాకిరెట్టలాంటిది. సమాజానికి మనందరం ఎంతో ఋణపడి ఉన్నాము." అని నమ్రతతో పలికాడు రవి.

"ఇంతకూ మీరేమి తెచ్చారు పిల్లలకు ఈసారి" కుతూహలంతో అడిగింది దుర్గ. ఇద్దరూ చెరో సంచీ అందించారు ఆమెకు. తీసి చూసింది దుర్గ. అన్నీ దుస్తులు పిల్లలకు వాడేవే. అందులో నలుబది జతలున్నాయి. శరణాలయంలో శిశువుల సంఖ్య నలుబది మాత్రమే. అంతేకాదు అన్నీ రకరకాల సైజులలో ఉన్నాయి. ఆ దంపతుల జాగ్రత్తకూ, ఓపికకూ దుర్గ విస్తుపోయింది. వీటిని మీరే సరాసరి పిల్లలకు ఇస్తే బాగుంటుందని దుర్గ చెప్పింది. దానికి వారు సుతరామూ అంగీకరించలేదు మొదట్లో. గుప్తదానం చేయుటం మంచిదని వారి ఆలోచన. కాని

దుర్గ వారికి నచ్చచెప్పింది పలువిధాలు. పిల్లలు వస్తువులకన్నా మనుష్యులకన్నా ప్రేమనూ ఆప్యాయతను కోరతారని ఆమె సిద్ధాంతం. వారు దానిని కాదనలేకపోయారు. ఆమె అనుమతితో లోపలికివెళ్ళారు. పేరుపేరునా పిలిచి పిల్లలకు దుస్తులు ఇచ్చారు. పిల్లలందరికీ మీ బాబాయి పిన్ని ఇచ్చారని దుర్గచెప్పింది. పిల్లలు రవి, కరుణల చుట్టూ చేరారు. పిన్నికీ, బాబాయికీ జేజేలు చెప్పారు. వాళ్ళిద్దరి చేతులు పట్టుకొని ఆడారు పాడారు పిల్లలు. ఇంతలో భోజనపుగంట కొట్టారు. పిల్లలంతా ఓలిఓలా హాలులోకి వెళ్ళారు. ఆరోజు నిజంగా రవి కరుణలకు పండగ. రెండు సంవత్సరాల నుంచీ ఆ శరణాలయానికి వస్తూ ఏవో దుస్తులు, వస్తువులు, ఆట బొమ్మలూ, చాక్లెట్లూ తెస్తున్నా తాముగా ఇస్తే పిల్లల మనస్సు చిన్నబుచ్చుకుంటుందేమోననే భయంతోను, చేసిన పనిని ఆడంబరంగా చూపించటం ఇష్టంలేకనూ ఇన్నాళ్ళు వార్డెనుకు ఇచ్చి వెళ్ళిపోతూ ఉండేవారు. తమ విద్యుక్తధర్మం తాము నెరవేర్చామనే తృప్తితో తిరిగి వెళ్ళిపోయేవారు. కాని ఈరోజు దుర్గ ధర్మమా అని వారికి నూతనానుభవం సంప్రాప్తించింది. వలుబడి మంది పిల్లలు వారికి దొరికారు; వారి పిల్లలైనారు. ఇంతమందికి తాము పిన్నీ బాబాయి కాగలిగారు. పిల్లల నిర్మలమైన అనురాగాన్ని చూరగొనగల్గారు. ఆశిశువుల ముఖాలలో ఎంత ప్రసన్నతో! మహదానందం పొందారు దంపతులిరువురూ.

దుర్గ ఆఫీసుగదిలోకి తిరిగివచ్చారు రవి కరుణలు. వారిని గురించి తెలుసుకోవాలని దుర్గ మనస్సు తహతహలాడుతోంది. కాని అదేపనిగా ప్రశ్నలువేస్తే వారేమనుకుంటారో అని భయం. "మీరు........" సాభిప్రాయంగా చూచింది దుర్గ కరుణవైపు.

"నేను వ్యవసాయ కళాశాలలో వ్యవసాయ శాస్త్రజ్ఞురాలిగా పనిచేస్తున్నాను. వీరు మా కాలేజీలోనే భూసార రసాయన శాస్త్రజ్ఞులు. ఇక్కడే హైదరాబాదులో ఉంటున్నాము." బదులు పలికింది కరుణ. ACC NO 2869

"అయితే మీపేరూ మీవారి పేరూ జత కుదరటంలేదే?" అని తన సందేహాన్ని వ్యక్తపరిచింది దుర్గ.

SAU-S133
SUB

పకపకా నవ్వింది కరుణ.

"అదా మీ సందేహం! సూటిగా అడగవచ్చుకదా! మొగమాటం ఎందుకు? నేను క్రైస్తవ కుటుంబంలో జన్మించాను. మావారు హిందూ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టారు. మాది ప్రత్యేక వివాహ శాసనం క్రింది పెళ్ళి." నిండు మనస్సుతో, తృప్తిగా పలికింది కరుణ. OU 12-CC

ఇప్పటికే వారిని చాల విషయాలు అడిగానని భావించింది దుర్గ. ఇంకా ఒక ప్రశ్న మిగిలివుంది ఆమెకు. వారికి పిల్లలు వున్నారా? ఉంటే ఈ అనాధశిశువులపై వీరికి ఇంతశ్రద్ధ ఎందుకు? లేక వారికి పిల్లలు కలుగలేదా? కాక వారు తమకు పిల్లలు వద్దనుకున్నారా? ఏదైనా ఈ విషయాన్ని వారిని అడగటానికి ఆమెకు ధైర్యం చాలలేదు. మరొక సమయంలో ఇంకా కొంత పరిచయం పెరిగినతరువాత అడగవచ్చు లెమ్మని సమాధానపరుచుకుంది తన మనస్సును. 'మీ ఔదార్యానికి నా అభినందనలు' అంటూ దుర్గ వారికి నమస్కారం చేసింది.

"మేము రాజేంద్రనగరులో కాలేజీ కాంపసులో ఉన్నాము. మరెప్పుడైనా సాయంత్రం ఫోనుచేసి మా ఇంటికివస్తే మేము

వాడు కలపేస్తాం." అని కమల దుర్గచేతిని తన చేతిలోకి తీసుకొని చెప్పింది.

దుర్గ పులకితురాలయింది. ఈ నూతన వ్యక్తులు తన మనస్సుకు బాగా ఆకర్షించారని తెలిసికొన్నది. వారి ఆహ్వానం తన దుర్భాగ్యాన్ని తిప్పగలదని తోచింది.

"తప్పకుండా వస్తానండీ. మీ ఆహ్వానానికి నా కృతజ్ఞతలు" అంటూ చేతులు జోడించింది దుర్గ.

ప్రతినమస్కారాలు చేసి వారు వెళ్ళిపోయారు.

తరువాత చాలాసేపటివరకు ఆ దంపతులను గురించే ఆలోచిస్తూ అలానే కుర్చీలో కూర్చొని వుండిపోయింది దుర్గ.

## 6

అంబేద్కరు జయంతినాడు విద్యార్థుల, యువకుల ఊరేగింపు నాంపల్లి స్టేషను ప్రాంతం నుండి సాగిపోతుంది. పోలీసులు ఊరేగింపుకు అంబేద్కరు విగ్రహంవద్ద మీటింగుకు ముందుగా అనుమతి ఇచ్చారు. రెండు వరసల బారులుదీరి నడుస్తున్నది జనత. 'కులతత్వం నశించాలి', 'అంటరానితనం అమానుషం', 'షెడ్యూలు జాతులపై దౌర్జన్యాలు నశించాలి', 'అందరికీ సమానావకాశాలు ఉండాలి', ఇలాంటి నినాదాలు అట్టలపై వ్రాయబడి ఉన్నాయి. ఇలాంటి ప్లే కార్డులను చాలమంది చేత పట్టుకొని నడుస్తున్నారు. ఈ మాటలతోనే క్లాత్ బ్యానర్లు పట్టుకొని ఉన్నారు కొందరు. జన ప్రవాహం పెరగడం సాగింది.

క్రొత్త వారు వచ్చి ప్రతి పదినిమిషాలకు ఊరేగింపులో చేరుతున్నారు. యువకుల ఉత్సాహం మిన్నుముట్టుతున్నది. వందలమంది యువ తీబాలికలు ఊరేగింపు అగ్రభాగాన నిలిచి సాగిపోతున్నారు. నినాదాల ధ్వని దూరప్రాంతాల వారికికూడా అస్పష్టంగా వినవడు తున్నది. ఊరేగింపు లిబర్టీ వరకు చేరుకున్నది బషీర్‌బాగ్ నుంచి వచ్చి.

లిబర్టీ దగ్గర బస్సుకోసం వేచి వున్నాడు మోహన్. అతనికి రాజకీయాలలో ఆసక్తి వున్నా చురుకుగా పాల్గొనేవాడు కాదు తన చదువుకు భంగం కల్గుతుందని. కాని అధ్యయనం చేసేవాడు రాజ కీయ సిద్ధాంతాలను. కార్యక్రమాలను, ఊరేగింపును శ్రద్ధగా చూస్తున్నాడు. యువక ప్రపంచంలోని అకుంఠిత దీక్షకు ఆశ్చర్యపు చెందుతున్నాడు.

ఇంతలో హఠాత్తుగా పోలీసువారి ఈలలచప్పుళ్ళు. 'పొండి 'వెళ్ళిపొండి' అని మెగాఫోనులలో వారి కేకలు. వెన్వెంటనే శాంతి యుతంగా ఊరేగే వారిపై లాఠీచార్జి. ప్రజలను, ఊరేగింపులో పాల్గొనేవారిని అడ్డదిడ్డంగా కొట్టటం, పోలీసుల బూతుకూతలు. అట్టహాసాలు వాతావరణాన్ని కలుషితం చేయుటం జరిగింది. తుపా కులు పేల్చిన ధ్వని వినవడింది. బాష్పవాయువుతో నిండివుంది వాతావరణం.

పదిహేను నిమిషాల తర్వాత ఆ ప్రదేశాన్ని చూస్తే నేలపై రక్తపు మరకలు, కదలలేక పడివున్న యువతీ యువకుల శరీ రాలు, మూడు పోలీసు వ్యానులు, రెండువందల స్పెషల్ పోలీసు బలగం, అనేకమంది ఆఫీసర్లు ఒక దళంగా కనవడ్డాయి. చిందర వందరగా విరిగిపోయిన ప్లె కార్డులు, చినిగిపోయిన బ్యానర్లు పడి

పడ్డాయి. క్షతగాత్రులను పోలీసువారు వ్యానులో ఎక్కించి తీసుకొని వెళ్ళారు. ఎక్కడికి తీసుకొని వెళ్ళారో ఎవరికీ తెలియదు. ఆ సంఘటన తర్వాత ఆ ప్రదేశం నిర్మానుష్యం అయి పోయింది.

ఈ వార్త పట్టణమంతా పాకింది. తమ తమ కుమారుల కోసం, కుమార్తెల కోసం, భర్తల కోసం, భార్యల కోసం పట్టణ ప్రజలు ఆసుపత్రుల చుట్టూ, పోలీసు స్టేషనుల చుట్టూ, జైళ్ళచుట్టూ తిర గడం ప్రారంభించారు.

దుర్గ అనాథ శరణాలయంలో తన ఆఫీసులో పనిచేసు కుంటున్నది. ఇంతలో టెలిఫోను మోగింది. రిసీవరు ఎత్తిన దుర్గ ఫోనులో మాటలకి దిగ్భ్రాంతి చెందింది. తను వింటున్నది నిజమా, కలా అనే మీమాంసలో పడ్డది. "మోహన్‌కు అంబేద్కరు జయంతి ఊరేగింపు సందర్భంగా జరిగిన కాల్పులలో గుండుదెబ్బ తగిలింది. పోలీసులు చూడకుండా మేము అతనిని తీసుకొని వెళ్ళాము. హిమాయత్‌నగర్‌లోని ప్రజావైద్యశాలలో చికిత్స జరు గుతూ ఉన్నది. ఆపరేషను చేసి గుండు తీసేశారు. స్పృహ వచ్చింది. మీకు కబురు చెయ్యమన్నాడు మోహన్, వెంటనే వస్తారు కదూ?" అని ఒక స్త్రీ కంఠం పల్కింది ఫోనులో.

ఫోను పెట్టేసిన దుర్గ అయిదు నిమిషాల వరకు కుర్చీలో అలాగే కూర్చుని ఉండిపోయింది. ఆ వార్త ఆమెకు పెద్ద షాకు కల్గించింది. తనకు తెలిసినంతవరకు మోహన్ రాజకీయాలలో ఏనాడూ ప్రత్యక్షంగా పాల్గొనలేదు. తనచదువేమో, తన పరిశోధన దేమో తప్ప ఏనాడూ ఊరేగింపులకు పోలేదు. అలాంటి మోహన్ ఈరోజు ఊరేగింపులో పాల్గొని ఉంటాడా? అసంభవం. ఇందులో

ఏదో పొరపాటు ఉండివుంటుంది. మరొక మోహన్ అయి ఉండవచ్చును. దెబ్బతిన్న మనిషి మరొక మోహన్ అయితే తనకు ఎందుకు ఫోను వస్తుంది? అయినా తన చిరునామా మరొక మోహన్ వద్ద ఎందుకు వుంటుంది? ఇలా తర్క వితర్కాలు చేసుకున్న దుర్గ లేచి ఆసుపత్రికి ప్రయాణం కట్టింది. దారి పొడవునా భయాందోళనలు ఆమె మనస్సును కలవరపెడుతూనే వున్నాయి. అస్థిమిత మనస్కురాలైన దుర్గ ఆసుపత్రికి వచ్చేటప్పటికి మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. మోహన్ పేరుచెప్పి వాకబుచేస్తే ఒక విద్యార్థిని ఆమెను అతడు వున్న గదిలోకి తీసుకొని పోయింది. అతని ఎడమచేతికి కట్టుకట్టి వున్నది. అతడు స్పృహలోలేడు. "మీరిక్కడ ఉంటారుకదా! నేను ఇంటికి వెళతాను. మా తల్లిదండ్రులు నన్నుగురించి ఆదుర్దాపడుతూ వుంటారు'అని చెప్పి ఆ విద్యార్థిని వెళ్ళిపోయింది.

మోహన్‌ను ఆ స్థితిలో చూచిన దుర్గకు దుఃఖం పొర్లుకొని వచ్చింది. ఇటీవలనేకదా తామిరువురు తమ, తమ భవిష్యత్తును గురించి చర్చించుకున్నది. ఇంతలో ఇలాంటి సంఘటన ముంచుకొస్తుందని ఆమె ఊహించలేదు. ఊరేగింపులో మోహన్ పాల్గొన్నాడా? అలా పాల్గొనడే! ఊరేగింపులోని వాళ్ళపై పోలీసులు ఎందుకు దౌర్జన్యం చేస్తారు. పైగా దూరాన వున్న మనుష్యులపై పోలీసులు ఎందుకు కాల్పులు సాగిస్తారు? ఒకవేళ ఏదోరకంగా కాలిస్తే మోహన్‌కు గుండు తగిలిందా? ఒక్కొక్కపుడు డెక్కమీదనుంచి గలభాను చూస్తున్నవారికి, ఎక్కడో దూరాన టీ బడ్డీలో కూర్చొని టీ తాగే వారికికూడా తుపాకీగుండ్ల దెబ్బలు తగిలాయని తను పత్రికలలో చదివింది. అలా జరిగిందా? ఏమో!

ఆమె మనస్సు పరిపరి విధాల పోతున్నది. అతడు తేరుకునేనా, రాకపోతే తను ఏం చేయాలి? అతని తల్లిదండ్రుల చిరునామా తనక్కూ తెలీదే! ఇటువంటి పరిస్థితులలో ఉన్న రాధాకృష్ణ దంపతుల వద్ద గాని ఉంచుతుందేమో! 'ఛీ! నా మనస్సు ఇంతగా కీడుశంకిస్తున్నదే! ఏం చెడు జరగదు కదా! అలా జరగడానికి వీల్లేదు' అనుకుంటూ మోహన్ వంక దృష్టి నిలిపి చూస్తూ కూర్చున్నది.

ఇంతలో మోహన్ కదిలాడు. కనులు విప్పి చూశాడు తన చుట్టూ. దుర్గ కనపడింది. హఠాత్తుగా మోహన్ నిట్టూరుస్తూ కను రెప్పలతోనే ఆమెకు తన కృతజ్ఞతను తెలియజేస్తూ "దుర్గగారూ! వచ్చారా. మీరు రాలేరేమో అని భయపడ్డాను" అని చాల బల హీనంగా పలికాడు మోహన్.

"మోహన్! ఏమిటయ్యా నీ అసందర్భపు మాటలు. సంగతి తెలిస్తే నేను రాకుండా ఉంటానా?" అని తనను గురించి చెప్పు కున్నది దుర్గ.

"కాదు దుర్గగారూ! ఈ స్థితిలో ఉన్న నా యోగక్షేమాలు మీరు చూస్తుంటే అవివాహితగా ఉన్న మిమ్మల్ని సంఘం ఏమంటుందో అని మీరు సంకోచిస్తారేమోనని సందేహించాను. క్షమించండి మిమ్మల్ని అర్థం చేసుకోనందుకు" అని సంజాయిషీ చెప్పుకున్నాడు మోహన్.

"మీకు విశ్రాంతి అవసరం. ఈ హార్లిక్సు త్రాగి కాసేపు పడుకోండి. తరువాత మాట్లాడుకుందాం" అని హార్లిక్సు త్రాగించింది దుర్గ. తిరిగి అతడు మళ్ళీ నిద్రలోకి జారుకున్నాడు.

మధ్యాహ్నం మూడు గంటలకు మోహన్ అటు ఇటూ కదిలాడు. చెయ్యి నొప్పిపెట్టింది కాబోలు బాధపడుతూ "అమ్మా" అని మూలిగాడు.

"మోహన్! బాధగా వుందా?" అడిగింది దుర్గ.

"అట్టే లేదు." జవాబిచ్చాడు మోహన్.

"విశ్రాంతి తీసుకో. కళ్ళు మూసుకొని పడుకో" అని అనునయించింది దుర్గ.

"నాకు నిద్రరావటంలేదు. నేను నీతో మాట్లాడాలి." అని గట్టిగా చెప్పాడు మోహన్.

"నాకూ నిన్ను ఎన్నో ప్రశ్నలు అడగాలని ఉంది" అని తన ఉత్కంఠతను వెలిబుచ్చింది దుర్గ.

"చూడండి దుర్గగారూ! మీరు నాకొక సాయం చేయాలి. నా తల్లిదండ్రులకు ఈ విషయం తెలియనీయరాదు. వారు పాపం చాల అమాయకులు; బాధపడి పోతారు. వారికి తెలియకుండానే నేను ఆస్పత్రి నుంచి ఆరోగ్యవంతునిగా బయటపడాలి. ఈమాత్రం సహాయం మీరు నాకు చేస్తే నేను ఆజన్మాంతం మీకు ఋణపడి వుంటాను. ఏమంటారు?" అంటూ దుర్గను అభ్యర్థించాడు మోహన్.

దుర్గ ఆ మాటలు వింటూ కళ్ళ నీళ్ళ పర్యంతం అయింది. ప్రక్కకి తిరిగి అతడు చూడకుండా కళ్ళ నీళ్ళు తుడుచుకుంది. "ఇది వినవయ్యా నీవు. దుర్గగారూ దుర్గగారూ అని మాటమాటకు నీవు నన్ను పిలవకుండా దుర్గా అని అంటానంటే అలానే సాయం చేస్తాను నీవు కోరినట్లు" అని షరతు పెట్టింది దుర్గ.

సంతోషంగా అంగీకరించాడు మోహన్ తల ఆడించి. సంతుష్టాంతరంగ అయింది దుర్గ.

"మోహన్! నీవు ఈ ఉపాయంలో ఎలా చిక్కుకున్నావు?" అని అతనిని ప్రశ్నించింది ఈ విషయమంతా తెలుసుకోవాలనే కుతూహలంతో.

"నేను లిబర్టీ బస్టాండు వద్ద ఉన్నాను. ఊరేగింపు వచ్చింది. ఇంతలో అంబేద్కరు విగ్రహం వైపునుండి పోలీసుల ఈలలు, కేకలు, మెగాఫోన్లలో అరుపులు నాకు ఆశ్చర్యం కలిగించాయి. పోలీసు ఆఫీసరు అనుమతి ఇచ్చిన ఊరేగింపును వారే నిషేధించడం అన్యాయమనిపించింది. ముందుకు చూసుకొని వెళ్ళాను 'అన్యాయం, అక్రమం' అని అరుస్తూ. అప్పటికే లాఠీ చార్జి మొదలయింది. ప్రజానీకం చెల్లాచెదరు అవుతోంది. నేల కొరిగిన ఒక యువకుని చేతిలో ఉన్న ప్లే కార్డును తీసుకొన్నాను. 'పోలీసు జులుం నశించాలి' అని కేకవేస్తూ 'పదండి ముందుకు' అని ప్రజలకు హెచ్చరిక చేశాను. ఇంతలో గుండుదెబ్బతో నేల కొరిగాను. స్పృహ వచ్చి చూసేటప్పటికి ఈ ఆస్పత్రిలో ఇలా ఉన్నాను. ఇదీ జరిగిన కథ." అని వివరించాడు మోహన్.

"మోహన్! నీవు రాజకీయాల జోలికి పోవుకదా! ఇది అంతా ఎలా జరిగింది" అని తన సందేహాన్ని వెలిబుచ్చింది దుర్గ.

"దుర్గా! నీవన్నది నిజమే. నేను రాజకీయ కార్యక్రమాల్లో పాల్గొనేవాడిని కాదు; కాని నేను అన్యాయాన్ని సహించలేను. మొదటినుంచీ నాది అదే ధోరణి. ఒకసారి మా నాన్నగారు నా తమ్ముణ్ణి అక్రమంగా కొట్టుంటే నేను ఆయన్ని ఎదిరించాను. ఆ వైఖరే ఇప్పటికీ కొనసాగుతున్నది నా జీవితంలో" అని తన స్వభావాన్ని విశదీకరించాడు మోహన్.

ఇంతలో మోహన్‌కు జరిగిన ఈ ప్రమాద విషయం తెలిసి ప్రక్క వాటాలో వున్న రాధాకృష్ణ, శ్యామలాదేవి వచ్చారు. అతని మోహనకై మాల సహాయం చేశారు. అతని చికిత్సకు అవసరమవుతుందేమోనని ధన సహాయం చేయబోయారు. తన దగ్గర డబ్బు వున్నదనీ, మోహన్ తన వూరివాడేననీ, తను అతని విషయం చూసుకుంటాననీ, అవసరమయితే వారి సహాయాన్ని తప్పక అపేక్షిస్తానని దుర్గ వారికి నచ్చజెప్పింది. వారు ఎంతో వైమనస్యంతో వెళ్ళిపోయారు.

సాయంత్రం రవి కరుణలు అనాథశరణాలయానికి వెళ్ళారు పిల్లలను చూడటానికి. దుర్గ వారికి కనుపించకపోతే వాకబుచేస్తే ఆమె హిమాయత్ నగరులోని ప్రజా వైద్యశాలకు వెళ్ళిందనీ, ఆమె స్నేహితుడు అపాయ స్థితిలో వున్నాడని వారికితెలిసింది. వెంటనే ఆస్పత్రికి వచ్చారు. మోహన్ స్థితిచూచి చాల విచారించారు. ఏ సహాయం కావాలన్నా తమను నిస్సంకోచంగా కోరమని దుర్గకు చెప్పి వారు తమ ఇంటికి వెళ్ళిపోయారు.

రెండు కుటుంబాల అండ తనకు వుందని తెలిసికున్న దుర్గకు ఆత్మవిశ్వాసం పెరిగింది. మోహన్‌కు మామూలు ఆరోగ్యం కుదుట పడే వరకు తను వుద్యోగానికి సెలవు పెట్టాలని నిశ్చయించుకొంది. ఒక నెలరోజులు సెలవు పెట్టి అతనికి శ్రద్ధగా సపర్య చేసింది. మోహన్ క్రమేపి కోలుకున్నాడు.

## 7

దుర్గ మళ్ళీ ఉద్యోగంలో చేరింది. ఆమెకు పని ఇప్పుడు మరీ ఎక్కువగా వుంటోంది. క్రితపు నెలలో పేరుకున్న పనంతా

ఆమే స్వయంగా చూసుకుంటోంది. ఆ రోజు మరీ ఎక్కువగా పని చేయాల్సివచ్చింది. తల దిమ్మెత్తింది ఆమెకు. కాస్త సరదాగా కబుర్లు చెప్పుకుందామని మోహన్ ఇంటికి వెళ్ళింది.

మోహన్ లైబ్రరీనుంచి ఇంకా ఇంటికిరాలేదు. వాకిలి తలుపు తాళం వేసి ఉంది. ప్రక్కవాటాలో ఉన్న శ్యామలాదేవిగారిని చూసి వెళ్దామనుకున్నది. వారి తలుపు తట్టింది. శ్యామలాదేవి తలుపుతీసి లోనికి ఆహ్వానించింది సాదరంగా. రాధాకృష్ణగారూ ఇంట్లోనే ఉన్నారు. ముగ్గురూ పిచ్చాపాటీలోకి దిగారు.

"ఏమమ్మా! నీవు బ్రహ్మచారిణిగా ఉంటూ సమాజసేవ చేయాలని సంకల్పించావట కదా! మోహన్ చెప్పాడు నిన్ను గురించి" అని రాధాకృష్ణగారు దుర్గను సాదరంగా ప్రశ్నించారు.

"అవునండీ! వివాహం, సంతానం సమాజసేవకు అడ్డు వస్తాయని నా భావం. అందువల్ల ఆ నిశ్చయానికి వచ్చాను" అని దుర్గ సమాధానం చెప్పింది. ఇంతలో చెంగుచెంగున గెంతుతూ అయిదేళ్ళ వయస్సు ఉన్న ఒక చక్కని అమ్మాయివచ్చి 'ఆంటీ' అంటూ దుర్గ ఒళ్ళో వ్రాలింది.

అనాథశిశుబాలయపు చీఫ్ వార్డెనుగా పిల్లల మనస్తత్వాల పరిశీలన చేసిన దుర్గ ఆ అమ్మాయిని ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నది. తలనిమిరింది. తన బ్యాగులోనుండి తీసి నాల్గు చాకెలెట్లు ఆమె చేతిలో పెట్టింది. ఆ అమ్మాయిని పేరేమిటని అడిగింది 'క్రాంతి' అని జవాబు చెప్పింది ఆ పిల్ల. ఆ పిల్ల ముద్దుముద్దు మాటలువిన్న దుర్గకు తలనొప్పి మటుమాయం అయింది. ఇంతలో పక్కింటి అమ్మాయి పిలుపువిని క్రాంతి వాకిట్లోకి వెళ్ళిపోయింది.

"మా అమ్మాయి. వట్టి అల్లరిపిల్ల" అని క్రాంతిని గురించి శ్యామలాదేవి చెప్పింది.

"ఎంచక్కని అమ్మాయి! ఇలాంటి అమ్మాయిని కలిగిన మీరు అభినందనీయులు" అని దుర్గ వారికి తన అభిప్రాయం చెప్పింది. వారు సంతృప్త మనస్కులయినారు.

వారిని గురించి తెలుసుకోవాలని, వారి జీవిత సిద్ధాంతంతో పరిచయం చేసుకోవాలని దుర్గకు చాల కుతూహలంగా ఉంది. కాని పెద్దగా వారితో తనకు పరిచయంలేదు. పైగా వారు తనకన్న వయస్సులో పెద్దవారు. వారుగాచెప్తే సరిపోయింది కాని వారి నడగటం తొందరపాటవుతుందేమోనని భయం ఆమెనుఆవరించింది. సంభాషణ ఎలా మొదలు పెట్టాలో తెలియటంలేదు. దుర్గకు లోపల ఆరాటంవున్నా బైటికి హుందాగా కూర్చుంది. రాధాకృష్ణ గారికి నలభైఏండ్ల వయస్సు ఉంటుంది. శ్యామలాదేవిగారు ముప్పైఏళ్ళ తరుణి. రాధాకృష్ణగారు స్ఫురద్రూపి. పచ్చని పండువంటి ఛాయ, ముఖంలో కొట్టవచ్చే తేజస్సు. ఆమె పేరుకు తగ్గట్టు ఆమె దేహచ్ఛాయ కొంత నలుపు. కాని ఆకర్ష ణీయమైన కను ముక్కు తీరుగల ఆమెను మళ్ళీమళ్ళీ చూడాలని పించే ముఖవర్చస్సు ఆమెది. అతనిది తీక్షణమైన దృక్కు. ఆమెది ప్రశాంత దృష్టి. అతడు నిరంతర చింతా మగ్నుడుగా కన్పడుతాడు. ఆమె ఎల్లవేళలా చిరునవ్వులతో ప్రశాంత వాతావర ణాన్ని సృష్టిస్తుంది. వీరిరువురినిచూచి చకితురాలయింది దుర్గ. వీరి వృత్తిలేమిటి? వీరి వ్యాపార వృత్తులేమిటి? వీరిరువురికి ఒకే జీవిత సిద్ధాంతమా లేక విభిన్న దృక్పథాలు, జీవితమార్గాలు వారికి ఉన్నాయా? అయినా ఇలాంటి వీరు భార్యాభర్తలుగా ఎలా ఒకచో

కూడదూ? ఇలా ఎన్నో భావాలు ఆమెను ఉక్కిరి బిక్కిరిచేశాయి. ఏమయినాసరే వారి విషయం తెలుసుకోకుండా ఇంటికిపోరాదని నిశ్చయించుకుందామె.

"శ్యామలాదేవిగారూ! నేను అమీరుపేట అనాథ శరణాలయంలో చీఫ్ వార్డెనుగా వుంటున్నాను. ఆ సంగతి మీకు మోహన్ చెప్పే వుంటాడు" అని నెమ్మదిగా సంభాషణకుపక్రమించింది దుర్గ.

"నిన్ను ఆ రోజు విమలగారింట్లో మొదటిసారి చూడటమూ, రెండవసారి ఆస్పత్రిలో చూడటమూ జరిగింది. కాని నిన్ను గురించి మా మోహన్ ఎంతో గొప్పగాచెప్పాడు. మోహన్ నాకు తమ్ముడితో సమానం" అని శ్యామలాదేవి తమ కుటుంబానికీ మోహన్‌కూ వున్న సన్నిహిత సంబంధాన్ని తెలియపరిచింది ఉద్దేశపూర్వకంగా.

మోహన్‌కు ఆ దంపతులు అంత సన్నిహిత మిత్రులని తెలిసి దుర్గ చాలా ఆనందించింది కొండంత ఆశతో.

"చూడమ్మాదుర్గా! మేము ఏ వృత్తులు చేస్తున్నామో తెలిసికోవాలని నీకు కుతూహలంగావుందికదూ! అందులోతప్పులేదు. చెప్తా విను. నేనువిదేశాలలో ఇంజనీరింగులో ఉన్నతవిద్య నభ్యసించాను. అక్కడ పెద్దపెద్ద ఉద్యోగాలు చేశాను. కాని నా జ్ఞానాన్ని, నా పాండిత్యాన్ని, నా శ్రమను నా దేశప్రజలకు అందివ్వాలని మన దేశం వచ్చాను. కాని ఇక్కడ ప్రజల దుర్భర దారిద్ర్యాన్ని చూచిన తరువాత మళ్ళీ ఉద్యోగం చేయలేకపోయాను. ఏదో ఉడతా భక్తిగా నాకు తోచినరీతి సమాజసేవ చేస్తున్నాను" అని వివరించాడు రాధాకృష్ణ.

"అది ఆయన సంగతి. నా విషయం చెప్పనీ దుర్గా. నేను స్పెషల్ ఎం.ఏ. చేశాను. మన తర్కశాస్త్రం, తత్వశాస్త్రం, ఇంగ్లీషు సారస్వతం నా అభిమాన విషయాలు. తరువాత సారస్వతంలో పి. హెచ్. డి డిగ్రీ సంపాదించాను. విదేశాలలో ఉద్యోగం చేసి, కృష్ణుడు పుట్టిన ఆలోచనలే నాకూ వచ్చి మనదేశం తిరిగి వచ్చాను." అని తన విషయం చెప్పింది శ్యామలాదేవి.

"మిమ్మల్ని 'ఆంటీ' అని పిలవాలని ఉంది" అని దుర్గ తన అభీష్టాన్ని వ్యక్తం చేసింది.

"అంతకన్నానా అమ్మా! నీవు మరోలా నన్ను పిలుస్తుంటే నాకు ఎబ్బెట్టుగా ఉంటోంది" శ్యామలాదేవి తన మనోభిప్రాయాన్ని తెలియజెప్పింది అవ్యాజానురాగంతో.

"ఆంటీ! మీకు ఎలా ప్రొద్దుపోతుంది" అని అడిగింది దుర్గ.

"వారానికి అయిదు రోజులు మేము ఒక గ్రామంలో వయోజన విద్యా కేంద్రాన్ని నడుపుతున్నాం. దానితో మాకు తలమునకలయ్యేపని" అని శ్యామలాదేవి దుర్గ సందేహాన్ని తీర్చింది.

ఇంత ప్రతిభావంతులైన వీరు కుగ్రామంలో వయోజన విద్యాకేంద్రం నడపటమేమిటి? వీరి చదువుకీ, శక్తియుక్తులకూ, ఈ పనికీ సమన్వయం ఎలా? ఎందుకు వీరు ఇలాంటి చిన్న పనికి పూనుకున్నారు? అయినా ఈ పనిచేస్తే వీరికివచ్చే వరుమానం వీరి జీవితావసరాలను వెళ్ళదీయడానికి చాలుతుందా? ఇలా కోరికోరి జీవన వ్యయాన్ని తగ్గించుకొని బ్రతకవలసిన అవసరం వీరికి ఎందుకు కల్గింది? సరే, వీరిసంగతి ఎలాఉన్నా వీరి చిన్నారి పొన్నారి క్రాంతి సంగతి ఏమిటి? ఆ అమ్మాయి భవిష్యత్తుకు వీరు ఏమి ఆధా

చేయిస్తారు? ఇలాంటి భావాలు దుర్గ మనస్సును ఉక్కిరిబిక్కిరి చేశాయి. ఇదంతా గ్రహించినట్లున్నాడు రాధాకృష్ణ.

"శ్యామల చెప్పిన విషయానికి నీవు విస్తుపోయినట్లున్నావు. నేను ఈ దేశంలో ఇంజనీరు చేయవచ్చు. అలాగే ఆమె ఏదో ఒక విశ్వవిద్యాలయంలో అధ్యాపక వృత్తి చేపట్టవచ్చు. మాకిద్దరికీ వచ్చే జీతాలతో మధ్యతరగతి వారిలో పైస్థాయికి చెందిన వారంగా జీవించవచ్చు. క్రాంతి చదువుకూ, పెండ్లికీ చాల డబ్బుసంతన చేయవచ్చు. కాని అదంతా వ్యక్తికి మనశ్శాంతిని ఇవ్వని వ్యవహారం. అందుకే మేము మరోరకంగా జీవయాత్ర సాగిస్తున్నాం."

రాధాకృష్ణ మాటలు దుర్గకు చాలవరకు నచ్చినాయి. తను సమాజసేవకు పూనుకున్నట్లే వారూ కృషి చేస్తున్నారని తోచింది. అయితే తనకూ వారికీ తేడా కన్పిస్తున్నది. తనకు సంసారంలేదు; వారికి ఉంది. తనకు సంతాన బాధ్యతలేదు; వారికి సంతాన పోషణాబాధ్యత ఉంది. అంతేకాదు ఇంకా ఏదో తేడా ఉన్నట్లు తనకు తోస్తున్నది. తను చేసేది సమాజ దుష్కృత ఫలితాలను సరిదిద్దటం. వారు చేసేది మరో రకంగా కన్పడుతోంది. వారి పిల్ల పేరు క్రాంతి. అంటే క్రాంతి వారికి ఇష్టమున్న మాట. క్రాంతి అంటే విప్లవం అనికదా అర్థం. అంటే సమాజాన్ని సమూలంగా, బ్రహ్మాండంగా మారిస్తే విప్లవం వస్తుంది. అలాకాక సమాజంలో ఎక్కడయితే లొసుగులు దొసగులు ఉంటాయో వాటిని మార్చిపూడ్చడం సంస్కరణ. అంటే తను చేసేది సంస్కరణ. వారు చేసేది విప్లవ కృషి. తన అభిప్రాయాలు సరియైనవేనా? ఒక నిశ్చయాని కొచ్చిన దుర్గ సాభిప్రాయంగా చూసింది శ్యామలాదేవివైపు.

"దుర్గా! నీకు కృష్ణవైఖరి తెలిసింది కదా! నా దృక్పథమూ అదే. మనదేశంలో సహజ వనరులున్నాయి. మనుష్యబలం ఉంది.

సాంకేతిక జ్ఞానంగల కేశవశక్తులు అశేషంగా ఉన్నారు. కాని ఈ సమాజాన్ని ఎలామార్చాలో తెలియక మనం ఈ అధోగతిలో ఉన్నాం. అమాయకులవల్లే, అసలు మార్చాలనే భావం ప్రజానీకంలో లోపించింది. అందుకే ఈ ప్రయోజన విద్యను ఎత్తుకున్నాం” శ్యామలాదేవి వివరణ చక్కగా నచ్చింది దుర్గకు.

“ తగినంతమంది ప్రజానీకంలో ఈ వ్యవస్థయెడ వైముఖ్యత పెరగాలి. కేవలం అసంతృప్తి చాలదు. ఈ దేశస్థితిని మార్చాలనేభావం కలగాలి. ఆ భావంవల్ల ప్రభావితులైన స్త్రీ పురుషులు కార్యాచరణకు పూనుకుంటారు. ఆందోళన ప్రారంభిస్తారు. ప్రజలను సంఘటిత పరుస్తారు; ప్రజలు తమంతటతాము సంఘటితమవటానికి ప్రోత్సాహంచేస్తారు. ఆ సంఘటన శక్తితో సాగించే కృషివల్ల విప్లవం సాధ్యమవుతుంది. భావ విప్లవానికి ముందుగా నాందిపలికే కార్యకర్తల సృష్టి మా పని” కృష్ణ గంభీరంగా ఉపన్యాస ధోరణిలో చెప్పాడు. ఆయన మాటలువింటూ తన్మయురాలవుతున్న శ్యామలా దేవి ఇలా పలికింది.

“ దుర్గా! మన ప్రజలకు నాయకత్వం వహించాలని కోర కూడదు. వారికి మనం స్నేహితులం, మార్గదర్శకులం, తత్వ వేత్తలం. అంతే. అధికారం ప్రజలకు లభిస్తేనే అది నిజమైన విప్లవం అవుతుంది. ఎంత సదుద్దేశ్యంవున్నా ప్రజలపై పెత్తనం చేసే పద్ధతి పనికిరాదు. మనం కోరేది ప్రజారాజ్యంకాని రామరాజ్యం కాదు.” ఆవేశంతో, ఆర్తితో చెప్తున్న శ్యామలాదేవిని చూస్తున్న దుర్గకు కనువిప్పయింది. సమాజసేవ లక్ష్యనిర్దేశనం జరిగింది తన మనస్సులో ఆ రోజున.

"మోహన్ ఇంకా రాలేదు. ఇక వెళ్ళివస్తాను" అని చెప్పి ఆ దంపతులకు నమస్కరించేసి దుర్గ తన ఇంటిమార్గం పట్టింది.

# 8

ఒక రోజు సాయంత్రం మోహన్ దుర్గ ఇంటికి వచ్చాడు. ఆమె అతన్ని సాదరంగా ఆహ్వానించి లోనికి తీసుకొనివెళ్ళింది. కాఫీ ఫలహారాలు సేవించిన తరువాత ఇద్దరూ పిచ్చాపాటిలోకి దిగారు.

"దుర్గా? మొన్న నీవు నా ఇంటికి వచ్చినప్పుడు నేనులేను. నీకు నిరాశ కల్పించాను సారీ" అన్నాడు మోహన్.

"నిజమే! నీవు లేకపోయేటప్పటికి కొంత చికాకు కలిగింది, కాని ప్రక్క వాడలోని అపూర్వ దంపతుల పరిచయం, వారితో వార్తాలాపాలు నా శ్రమను మరచిపోయేటట్లు చేశాయి" అని తృప్తిగా పలికింది దుర్గ.

"రాధాకృష్ణ, శ్యామలాదేవిగారలు అసాధారణ వ్యక్తులు. వారిలాంటివారు జిల్లాకొకరు వుంటే ఈపాటికి మనదేశం ఆరు పువ్వులూ మూడు కాయలతో వర్ధిల్లుతుండేది." వారియెడల తనకు వున్న గౌరవభావాన్ని వెల్లడించాడు మోహన్.

"ఈ సమాజం యెడల వారి అభిప్రాయాలు చాల స్పష్టంగాను, నూతనంగాను వున్నాయి. అవి మరొకరికి నచ్చినా నచ్చకపోయినా వాటిని ప్రతివారు తప్పక ఖాతరు చెయ్యాల్సిందే. అది వారి ప్రత్యేకత ...." అంది దుర్గ.

"నీకు వారి భావాలపట్ల ఆసక్తి కలగటం సంతోషదాయకం, వారితో అనేక పర్యాయాలు ఈ విషయాలపై ముచ్చటించటంవల్ల నాకు వారి భావాలు చిరపరిచయాలే" అని మోహన్ తనకూ వారికీ ఉన్న సంబంధాన్ని వ్యక్తీకరించాడు. ఈనాటి మోహన్ ఆలోచనలేమిటో తెలుసుకోవాలని దుర్గకు ఉబలాటంగా ఉంది. అందుకనే సంభాషణలోని విషయాన్ని మార్చాలని ఆమె అభిప్రాయపడింది. తుపాకీ దెబ్బకు పూర్వపు మోహన్ ఈనాటి మోహన్ ఒకడేనా? లేక అతనిలో మార్పు వచ్చిందా? వస్తే ఎలాంటి మార్పుకు అతడు లోనయినాడు. ఇపుడు అతడు ఏంచేయడానికి పూనుకుంటున్నాడు? ఇలాంటి ప్రశ్నలు ఆమెను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి.

"మోహన్! నీవు సంపూర్ణంగా ఆరోగ్యాన్ని పొందావు. మరి, మరి ఇపుడు ఏం చేద్దామనుకుంటున్నావు? పి. హెచ్. డి. కోర్సులో సీటు వచ్చిందా? మీ డిపార్టుమెంటు హెడ్ ఏమన్నాడు" అని వెంటవెంట ప్రశ్నలవర్షం కురిపించింది దుర్గ.

మోహన్ ముఖంలో గంభీరముద్ర ఏర్పడింది. అతని కళ్ళు దేనికో అన్వేషిస్తున్నట్లు కన్పడుతున్నాయి. అతడు నిదానంగా మాట్లాడాడు.

"దుర్గా! జీవితాలు ఎలా మారిపోతాయో గమనిస్తే చాలా విచిత్రంగా ఉంటుంది. ఊరేగింపుకు క్రితం రోజువరకూ పరిశోధనకు జీవితం అంకితం చేయాలనుకున్నానని నీతో చెప్పినవిషయం నీకుగుర్తుందా? మరి ఈరోజో ఆమాట చెప్పలేను. ఎంతలో ఎంతగా మారిపోతాయి నిర్ణయాలు! నీ కిదంతా విడ్డూరంగా ఉందికదూ?" ప్రశ్నించాడు మోహన్.

“ఏమిటి నీ క్రొత్త నిర్ణయం? చెప్పెయ్యిబాబు సస్పెన్స్‌లో ఉంచక!” అని దుర్గ అతనిని తొందరపెట్టింది.

“ఏమీ లేదు! పరిశోధన మానివేద్దామనే నిర్ణయానికి వచ్చాను.”

“సరే; మానివేస్తావు. బాగానేవుంది. అయితే నీవు ఏం చేస్తావు? ఉద్యోగంలో చేరతావా? లేక ఇంటికివెళ్ళి మీనాన్నగారికి వ్యవసాయంలో తోడుపడతావా? మనిషన్న తరువాత ఏదో ప్రయోజనాత్మకమైన పని చేయాలికదా!” రెట్టించి అడిగింది దుర్గ.

“నీవు చెప్పింది సమంజసమే; కాదనను. నేను సమసమాజ ఉద్యమంలో పూర్తికాలాన్ని వినియోగించదలచాను. మనిషికీ, మనిషికీ; స్త్రీకి పురుషునికి తేడాలు హెచ్చుతగ్గులు వుండరాదనేదే నా ధ్యేయం. దానికై అహరహం కాయశక్తులా పోరాడుతా.” ఈ మాటలువిన్న దుర్గకు ఎవరో చెన్నాకోలతో తనని కొట్టినట్లుగా తోచింది.

మోహన్ ఇలాంటి కఠిన నిర్ణయానికి ఎందుకు వచ్చినట్లు? తనకు అర్థంకావడంలేదు. తను సంఘసేవకు పూనుకున్నదికనుక, తనకు సన్నిహితంకావాలని మోహన్‌కూడా సంఘసేవకు పూనుకుంటున్నాడా? ఇంతకూ తనపై ప్రేమానురాగాలు ఉన్నట్లుగా సూచనలు ఏమీ ఇంతవరకులేవే. బహుశః తను అవివాహితగానే ఉంటానని నిర్ణయించుకున్నందున అతడు తన మనోభావాలను వ్యక్తం చేయడంలేదా? లేక తనపై అతనికి సోదరప్రేమ తప్ప మరేమీలేదేమో? అతని ఆప్యాయతకు అర్థం అదేనేమో! మరి తనకు అతనిపై ఎలాంటి అభిప్రాయం ఉంది? అతనిని తరచుగా చూడాలని తన మనస్సు ఎందుకు ఉబలాట పడుతోంది? తనని

దుర్గా అనిపిలవమని తను అతనిని ఎందుకుకోరింది? తన మనస్సులో స్నేహభావం తనకు తెలియకుండానే మొలకెత్తిందా? తను నెల రోజులు సెలవుపెట్టి అతనికి ఎందుకు సపర్యచేసింది. అచ్చంగా తన ఊరి వాడనేనా? తను అవివాహితగా ఉండి అలా అతనికి - అందులో మరో అవివాహితునకు-అన్నాళ్ళు ఉపచారాలు చేస్తుంటే లోకం ఏమనుకుంటుంది? ఆ భయం తనను ఏనాడూ ఆవరించ లేదు ఎందుచేతా? ఈ ప్రశ్నలకు తను ఇప్పుడు సమాధానం చెప్పగల స్థితిలోలేదు. కనుక వాటికి జవాబులు ఎప్పుడైనా తీరికగా ఆలోచించవచ్చని ఆమె భావించింది.

"అయితే మోహన్! సమసమాజం అన్నావుకదా అందులో పౌరహక్కుల ఉద్యమం, స్వేచ్ఛా సమానత్వాల పోరాటం వుండాయి. అప్పుడది రాజకీయోద్యమం కదూ! నీవు రాజకీయ ఆచరణకు దూరంగా ఉండేవాడివికదా? మరి ఇంతలో ఈ మార్పేమిటి?" నిక్కచ్చిగా అడిగింది దుర్గ.

"అవును దుర్గా! అది రాజకీయాలకు అతీతమైనదికాదు. కాగా అధికార పిపాసతోకూడిన రాజకీయం కాదది. ప్రజలు ప్రబోధితు లవటానికి, ప్రజలు సంఘటితం కావటానికి పనికివచ్చే ఉద్యమం అది. అన్ని ఉద్యమాలకు అది ప్రాతిపదిక. నేను పరిశోధన చేసి ఫలితాలను సాధించినా ఆ ఫలితాలను ప్రజలకు అందించాలంటే అదీ కష్టతరమే. మనం చెప్పేది ప్రభుత్వానికి నష్టదాయకమయితే ప్రభుత్వం మన భావాల వ్యాప్తికి నిరోధం కలిగిస్తుంది. కనుక అందులో పౌరహక్కుల ఉద్యమం చాల ముఖ్యమయిందిగా నాకు తోస్తున్నది" మోహన్ తన నిర్ణయం వెనుకనున్న కారణాలను వివరించాడు.

"మోహన్! అయితే విశ్వవిద్యాలయంతో నీ సంబంధాన్ని తెంపేసుకుంటున్నావన్నమాట. అంతేనా? పోనీ అటు పరిశోధనను, ఇటు పౌరహక్కుల ఉద్యమాన్ని రెంటినీ సాధించుకోవచ్చును కదా!" అని మధ్యేమార్గం సూచించింది దుర్గ.

"ఆ మార్గం మంచిది కాదు. అపుడు రెంటికిచెడ్డ రేవడ అవుతాను; దేనిమీదా శ్రద్ధవహించలేను. అపుడు అసంతృప్తితో కుమిలిపోవడం తప్ప నాకు ఇంకేమీ మిగలదు; కనుక ఏదో ఒక దాన్నే ఎంచుకొని జీవయాత్ర సాగించడం మంచిది. ఇంతకూ నా నిర్ణయం నీకు నచ్చలేదా?" అని దుర్గ కళ్ళల్లోకి చూచాడు మోహన్.

"'స్వబుద్ధి సుఖంబైవ" అన్నారు పెద్దలు. ఎప్పుడూ ఎవరి నిర్ణయాన్ని వారు చెయ్యడం మంచిది. కాగా ప్రక్కవారు, సన్నిహితులు సూచనలు చేయవచ్చును; సలహాలను అందిచ్చవచ్చును; అంతవరకే ఇతరుల ప్రమేయం. కాగా, ఒకసారి నీవు నిర్ణయానికి వచ్చినతరువాత దాన్ని గురించి చర్చ అనవసరం; తర్జన భర్జనలు నిరుపయోగం. ఏదైనా నీ నిర్ణయానికి వచ్చినతీరుకు నిన్ను అభినందిస్తున్నాను" అని దుర్గ అతనికి ధైర్యం ఇచ్చింది.

మోహన్ ముఖంలో సంతోషరేఖలు వెల్లివిరిశాయి. ముఖం నూతనతేజస్సుతో జేగీయామానంగా వుంది.

దుర్గ మనస్సులో మరల ఎన్నో భావాలు. తను చేసే సంఘ సేవకూ, మోహన్ చేయపూనుకున్న సమాజసేవకు తేడా వుందా? వుంటేఅది గుణాత్మకమా లేక పరిమాణాత్మకమా? అతని పంథా ప్రమాదభరితమా తనదానికన్నా? ప్రభుత్వంతో అతడు ఢీ కొనాల్సి వుంటుందా విధిగా? అలా అతడు ప్రభుత్వానికి విరోధిఅయితే

ప్రభుత్వం అతనిని బ్రతకనిస్తుందా? ఎప్పటికయినా మనిషికే ప్రమాదం వస్తుందా? ఇలా ఏదో భయం, ఏదో సందేహం, ఏదో అనుమానం ఆమెను పీడించ మొదలుపెట్టాయి. తినబోతూ రుచి అడగడం ఎందుకు? కాలమే ఈ ప్రశ్నలకు సమాధానం ఇస్తుంది. ఇంతకూ అతనిని గురించి తను ఇంతగా ఎందుకు ఆలోచించాలి? తమ ఇద్దరి జీవితాలు ఏదైనా అదృశ్య సూత్రంచేత బంధింప బడ్డాయా? ఛీ, ఛీ ఏమిటా పిచ్చి ఊహ. నిజంగా అలాంటిదే ఉంటే అతడు తనతో సంప్రతించకుండా ఏకపక్షంగా నిర్ణయించు కుంటాడా? ఇదంతా భ్రమసంజాతం. పిచ్చిపిచ్చి ఆలోచనలను ఇంక ఎంత త్వరగా కట్టిపెడితే అంత మంచిది అనుకొన్నది దుర్గ.

ఆమె మౌనంగావున్న క్షణాలను గుర్తించాడు మోహన్. ఆమె మనోవీథిలో మెరసే ఊహాపోహలను తెలిసికోవాలని ఉబలాట పడ్డాడు మోహన్. కాని అవి ఏమిటని ఆమెను అడగటానికి అతనికి సాహసం లేకపోయింది. ఇంతలో ఆమె

"మోహన్! తిండికీ, హక్కులకూ వైరుధ్యం వచ్చినా, ఈ రెంటిలో దేనినో ఒకదానినే కోరుకోవలసివచ్చినా ప్రజలు తిండినే కోరుకుంటారని మన దేశాన్ని పరిపాలించే నాయకులు కొందరు అంటున్నారే, అలాంటప్పుడు తిండిని ప్రజలకు అందించే పని మానేసి పౌరహక్కుల ఉద్యమాన్ని సాగించటం అవివేకమేమో!"

ఇలాంటి ప్రసంగాలను ప్రభుత్వవర్గ నాయకులుచేస్తున్న మాట యథార్థమే. అయితే అది స్వయంబాధిత వాదన. ప్రజానీకంలో నూటికి అరవై మంది దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారు అంటే వారు రెండు పూట్ల భోజనానికి నోచుకోలేదన్నమాట. అయితే వారికి తిండి ఎలావస్తుంది. ప్రభుత్వం వారికి వుచిత భోజనసౌకర్య మయినాచేయాలి లేకపోతే వారికందరికీ జీతభత్యాలతో ఉద్యోగా

అయినా ఇవ్వాలి. మరి ప్రభుత్వం ఇన్ని సంవత్సరాల నుండి ఈ ప్రయత్నాలకు ఎందుకు పూనుకోలేదు ? అడగందే అమ్మయినా పెట్టదనే సామెతను నీకు విన్నావుకదా ! కనుక తిండి కావాలని, ఉద్యోగాలు ఇప్పించమనే ఉద్యమాలకు జీవగ్రర పౌరహక్కుల ఉద్యమం. భావస్వాతంత్ర్యం, సంఘ స్వాతంత్ర్యం, సమావేశ స్వాతంత్ర్యం ఇవేకదా పౌరహక్కులు. ఇవి లేనినాడు తిండిని ప్రభుత్వం ప్రజలకు సమకూర్చినా ప్రజలు స్వేచ్ఛను పొందజాలరు; అనుభవించలేరు. ఈ సత్యాన్ని మనం ప్రజానీకానికి తెలియ జేయాలి." ఉద్రేకంగా సమాధానం చెప్పాడు మోహన్.

పరస్పరం అర్థంచేసుకున్నారు దుర్గా మోహనులు. కాగా ఎవరి పంథా వారిది. ఒకరు సమాజపు నడకలో నలిగిపోయిన అనాథలకు సేవచేయ తలపెట్టి మరొకరు సమాజంలో అట్టడుగు వర్గాలకి ఎంతగానో అవసరమైన పౌరహక్కుల ఉద్యమాన్ని చేపట్టున్నారు. లక్ష్యాలుకూడా ఆయా వ్యక్తుల మన స్తత్వాలనుబట్టీ, పెరిగిన వాతా వరణానికి అనుగుణంగా లోనైన ప్రభావాలను అనుసరించి ఉంటాయి. ఏదైనా మోహన్ ప్రతిభావంతుడు. దుర్గ దీక్షావరురాలు. ఈ ఇద్దరూ ఒకరియెడ మరొకరు గౌరవాదరాలను పెంచుకున్నారు.

గడియారం చూచాడు మోహన్. " అబ్బో! రాత్రి పదకొండు గంటలు దాటిందే. ఇక నేను వెళ్తాను " అని సెలవు తీసుకున్నాడు మోహన్. వాకిట్లో అతనికి అప్పుడే ఇంటికివస్తున్న కుటుంబరావు ఎదురయినాడు.

## 9

ఆరోజు శుక్రవారం వారానికోరోజు సాయంత్రం వెంకటావ్రు ప్లీడరీ చెయ్యడు. ఆటవిడుపుగా అతడు నిర్ణయించుకుంది శుక్ర

వారం సాయంత్రం. ఆరోజు మామూలుగా భార్యాపిల్లలను తను నిర్ణయించిన సినిమాకు తీసుకొని వెడతాడు వెంకటాద్రిపు. అతని భార్య విమలకు తలనొప్పిగా వుండటంవల్ల ఆరోజు సినిమా ప్రోగ్రాము రద్దయింది. కనుక తీరికగా తన ఆఫీసు గదిలో ఒక్కడు కూర్చొన్నాడు.

కుటుంబరావుకు వెంకటాద్రివు అలవాట్లు తెలుసు. వెంకటాద్రివు కుటుంబం సినిమాకు వెళ్ళలేదని గ్రహించాడు. అదను దొరికింది ప్లీడరుగారితో మాట్లాడటానికని భావించాడు కుటుంబరావు.

"ప్లీడరుగారూ! ఇంట్లో వున్నారా? నేను కుటుంబరావును" అంటూ వెంకటాద్రివు వాటాలో అడుగు పెట్టాడు కుటుంబరావు.

"రావయ్యా! రా! మా ఇంట్లోకి రావటానికి నీకుకూడా అనుమతి కావాలేమిటి!" అంటూ కుర్చీలోనుంచి లేవకుండానే కేకేసాడు వెంకటాద్రివు.

కుటుంబరావు వచ్చి వెంకటాద్రివుకు నమస్కారం చేశాడు. ప్రతి నమస్కారం చేశారు ప్లీడరుగారు. ప్రక్కనే కుర్చీలో కూర్చో మన్నారు. తాపీగా కూర్చున్నాడు కుటుంబరావు.

"ఊరకరారు మహాత్ములన్నట్లు ఏదో పనిమీద వచ్చావు" అన్నాడు ప్లీడరు.

"ఎబ్బే ఏమంత పనిలేదు. కాగా ఒక్కమాట మీ చెవినవేసి పోదామని వచ్చాను. అంతే" అన్నాడు కుటుంబరావు.

"అంత రాచకార్యమేమిటయ్యా ఇన్నాళ్ళనుంచి లేనిది. ఇరుగు పొరుగున వున్నామన్నమాటే కాని మనం కలవటం అర్నెల్లకోసారేకదా!"

"అదీ నిజమేననుకోండి, ఏదో వెధవ కోర్టు పనులతో సతమత మవుతూ తమబోటి పెద్దల దర్శనం కూడా చేసుకోలేక పోతున్నాను. ఎందుకొచ్చిన పాడు బ్రతుకు?"

"ఇంతకూ అసలు విషయం తెలియజెప్పవయ్యా. చల్లకు వచ్చి ముంత దాచటమెందుకు?" అని తొందర పెట్టాడు వెంకట్రావు.

"ప్రత్యేకంగా ఏమీలేదండి. కాని మన మధ్యవాటాలో వున్న దుర్గమ్మ సంగతే"

"ఏం, ఆమెకు ఏం ఇబ్బంది వచ్చింది" అని ఆదుర్దాగా అడిగాడు వెంకట్రావు.

"ఆమెకు ఏమీ కష్టాలు లేవు. కాగా మనకే కష్టాలు అన్నీను" అన్నాడు కుటుంబరావు.

"మనకు ఆమెవల్ల ఇబ్బంది ఏమిటయ్యా. ఒంటరిపిల్ల; పైగా అవివాహిత." అని కుటుంబరావువైపు నిశితంగా చూచాడు వెంకట్రావు.

"అదేనండి వచ్చిన చిక్కంతా. ఈ ఇంట్లో మనమందరం సంసారపక్షంగా ఉంటున్నాం కదా! మధ్యలో ఈమెకోసం వచ్చే పొయ్యే వాళ్ళు. రాంధాళి." ఆశ్చర్యంగా చూచాడు వెంకట్రావు. దుర్గ రెండేళ్ళనుండి ఆ వాటాలో ఉన్నది. ఆమెవల్ల ఎవరికీ ఇంతవరకు ఏరకమయిన అసౌకర్యమూ కలుగలేదు. అలాంటప్పుడు ఇప్పుడు ఇలా.... పాలుపోలేదు ప్లీడరుగారికి. ఎంత ఆలోచించినా ఊహకందలేదు వ్యాజ్య కారణం.

"ఇంతకూ నీవు చెప్పేది వివరంగా స్పష్టంగా చెప్పవయ్యా. సగం సగం కథ చెప్పి ఇబ్బంది పెట్టకు" విసుగ్గా అన్నాడు వెంకట్రావు.

కొంత ధైర్యం వచ్చింది కుటుంబరావుకు. ముందుగానే చెప్తే ప్లీడరుగారు ఏం విరుచుకుపడతాడోనని భయపడ్డాడు. అనుకున్నదానికి భంగం లేకుండా సజావుగానే ఉన్నది వ్యవహారం. ఇక రంగంలోకి దిగాలనుకున్నాడు.

"అది కాదండీ. నేను చెప్పేదేమిటంటే మనం ఏం చేస్తున్నా లోకం చూస్తున్నదని గ్రహించాలి. పిల్లి కళ్ళుమూసుకొని పాలు తాగితే సరిపోతుందా?" అన్నాడు కుటుంబరావు.

గతుక్కుమన్నాడు వెంకటావు. తన ఉపపత్ని వ్యవహారం ఈ ప్రయివేటు కుటుంబరావుకు తెలిసిందేమోనని భయపడ్డాడు. తను మామూలు ప్లీడరు కాదు. గవర్నమెంటు తరనపున క్రిమినల్ కేసులు చేసే పబ్లికు ప్రాసిక్యూటరు. వృత్తిలో పేరు ప్రఖ్యాతులు కలవాడు. ప్రజలు తనలాంటివాళ్ళ చర్యలను భూత అద్దంతో చూస్తుంటారు. అయినా తన స్వంత వ్యవహారాలు ఎంతో జాగ్రత్తగా చక్కబెట్టుకుంటున్నాడు. ఆరుగురు బిడ్డల తండ్రి అయినా తనకు విమల సాన్నిహిత్యం చాలటంలేదు. క్రొత్త రుచులకోసం తను అర్రులు చాచాడు. రహస్యంగా రంగనాయకిని ఉంచుకొని ఆమె వద్దకు వెళ్ళి వస్తుంటాడు. 'కొంపతీసి తనకూ దుర్గకు అక్రమ సంబంధం ఉన్నదని నింద వేస్తాడేమిటి ఈ పాపిష్టి ప్రయివేటు కుటుంబరావు' అనే అనుమానం కూడా అతనికి వచ్చింది. 'పాపం దుర్గ తన పెద్దకూతురు లాంటిది. ఏనాడు ఆమెను పాపదృక్కులతో తను చూడలేదే. మరి ఈ కుటుంబరావు గోలేమిటి' అనుకుంటూ అడిగితే సరిపోతుందికదాయని

"కుటుంబరావుగారూ! నేను ఆ అమ్మాయిని రెండేండ్ల నుండీ చూస్తున్నాను. మంచిపిల్ల లాగే ఉంది మరిప్పుడు మీరేమిటంటారు?" అని ప్రశ్నించాడు వెంకట్రావు.

"మేడివండు చూడ మేలిమైయుండు పొట్టవిచ్చి చూడ........ అలాగే కన్పడతారు. అయినా అవివాహిత రాత్రి పదకొండు గంటల వరకూ ఆ మోహన్‌తో గుసగుసలు, ఎకచకలు ఏమిటి చెప్పండి? పక్కన సంసారాలు ఉంటున్న్యనయినా సంకోచం వద్దా? ఏమో వత్సా! నా మట్టుకు నాకు ఆమె ప్రవర్తన నచ్చటంలేదు. ఇంటి వారితో చెప్పి ఆ వాటాలోనుండి ఆమెను ఖాళీచేయిస్తే మంచిదేమో! పెద్దవారు మీరు ఆలోచించండి. నాదేముంది నేనూ మా ఆవిడ ఇద్దరం మాత్రమేకదా! మీరంటే ఆడపిల్లలు కలవాళ్ళు. ఇరుగు పొరుగూ బాగా ఉండాలికదా! ఏం చేస్తారో చేయండి. వెళ్ళివస్తాను" అంటూ లేచాడు కుటుంబరావు.

"అలాగే వెళ్ళిరండి. దీనిని గురించి తీవ్రంగా ఆలోచించ వలసిందే. ఏదో ఒకటి చెయ్యక తప్పుతుందా?" హామీ ఇచ్చాడు వెంకటావు.

మాట అయితే అన్నాడు కాని ఏం చేయాలో తోచటంలేదు. దుర్గ ఆకతాయి పిల్ల కాదని వెంకటావు మనస్సుకు తెలుసు. 'తనపు తెలిపి ఏం ప్రయోజనం లోకం హర్షించాలికదా!' లోకం, లోకం! లోకం అంటే ఎవరు? ఇరుగూ పొరుగే కదా? ఇరుగు పొరుగున వున్నవాళ్ళకు ఆవేశాలు కావేషాలు లేకుండా వుంటాయా? ఏమీ లేకపోతే పొరుగువాడు పచ్చగా వుంటే చూచి సహించలేని మనస్తత్వం వుండవచ్చుకదా! ఏమోనబ్బా అంతా క్లిష్టంగా వుంది. అవును కుటుంబరావు చెప్పింది నిజమేనేమో! కాకపోతే ఆ అమ్మాయి వెలరోజులు సెలవుపెట్టి మోహన్‌కు అనువత్రిలో ఉపచారాలు ఎందుకు చేస్తుంది? అతడు తరచుగా ఎందుకు ఆమెవద్దకు వస్తూ పోతూ ఉంటాడు. వచ్చినా తలుపులు వేసుకొని రాత్రి పొద్దుపోయేవరకు

ఎందుకు మాట్లాడతారు? ఇంకేం సందేహంలేదు. దుర్గ తను అను కున్నంత మంచిపిల్ల కాదు. ఏమయినా తొందరపడకూడదు. ఈ విషయం తన భార్య విమలతో సంప్రతించాలి.' అని తలపోస్తూ "విమలా! విమలా!'' అంటూ కేక పెట్టాడు.

విమల ఆఫీసు హాలులోకివచ్చింది. ఎవరైనా ఉన్నారేమోనని తొంగిచూచింది. పరాయి వారెవరూ లేరని నిర్ధారణ చేసుకున్న తరువాత హాలులోకి వచ్చి భర్త పడకకుర్చీ ప్రక్కన కుటుంబరావు ఖాళీచేసి వెళ్ళిన కుర్చీలో కూర్చున్నది. "విమలా! విన్నావా ఇదంతా" అంటూ మొదలుపెట్టి కుటుంబరావువద్ద తను విన్నదంతా ఏకరువు పెట్టాడు. ఆమె అంతా తాపీగా విని

"ఆ అమ్మాయిని నిందిస్తే కళ్ళు పోతాయండీ. మన పెద్ద అమ్మాయి లాంటిది ఆమె." అని విమల దుర్గను సమర్ధించ బోయింది.

"అయితే మోహన్‌పై ఆమెకు ఎందుకంత ఆసక్తి. సెలవు కూడా పెట్టి ఎందుకు అతనికి నెలరోజులు చాకిరీచేసింది. అతగాడు ఎందుకు రెండురోజులకొకసారి వచ్చి వెళ్ళుతూ ఉంటాడు. వచ్చినా తలుపు వేసుకొని ఇద్దరు అవివాహిత స్త్రీ పురుషులు మాట్లాడ వలసిన రాచకార్యాలు ఏమి ఉంటాయి?'' అని తన ప్లీడరీ ప్రతిభ వంతా ప్రదర్శించాడు వెంకటార్రావు. ఇన్నాళ్ళు భర్తయే పరదైవంగా భావించే విమల, భర్త మేధాసంపత్తిపై అశేష విశ్వాసమున్న విమల నిరుత్తరురాలయింది. 'ఏమో! ఏ చెట్టుక్రింద ఏ పాము ఉన్నదో' అనుకుంటూ లేచి వంటింట్లోకి పోయింది.

మరునాడు ఉదయం ఈ విషయం అంతా కుటుంబరావు భార్య లలితలో చెప్పింది. లలిత సంతోషించింది. దుర్గ ప్రశాంత

జీవితంపై ఒక రాయి వేయటానికి అవకాశం కల్గిందని ఉబ్బి తబ్బిబ్బురాలయింది. 'సమయం కలిసిరావాలి కదా' అని తలపోస్తూ కాటెయ్యటానికి వేయికళ్ళతో వేచివుంది లలిత.

# 10

ఒకరోజు సాయంత్రం దుర్గకు ఆఫీసుపని అయిపోయింది త్వరగా. ఏమీ పని లేక తోచడంలేదు. పార్కులో పిల్లలతో ఆడుకుందామనుకుంటే వారిని పిక్నిక్‌కు తీసుకొనివెళ్ళింది వార్డెన్. "మీ ఇంటికివస్తాను. రమ్మంటారా. మీరు ఇంట్లో ఉంటారుకదూ!" అని ముంతాజ్ ఇంటికి ఫోను చేసింది. ఆమె తప్పక రావలసింది గాను, దుర్గకొరకు తమ దంపతులు వేచివుంటారని బదులుచెప్పింది. దుర్గ బయలుదేరి వారి ఇంటికి వెళ్ళింది. ఆమెను ఆహ్వానించారు దంపతులు ఇద్దరూ.

ముంతాజ్ కాపురముంటున్న ఇల్లు అంత పెద్దదికాదు. అంత చిన్నదికాదు. వారికి సరిపోను మరొక గెస్టు రూమువున్న ఇల్లు. ఇంట్లో అవసరం మేరకు ఫర్నిచరు ఉన్నది. ఆడంబరం ఏ మాత్రం లేదు ఆ ఇంట్లో. నిరాడంబరం అని చెప్పడానికీలేదు. చూచిన వాళ్ళకు ఆ ఇల్లు సుందరంగా అలంకరింపబడినట్లు, అమర్చబడినట్లు తోస్తుంది. దానిని చూస్తుంటే జీవించడమే ఒక కళ అనిపిస్తుంది, కొంతమంది మాట్లాడితే వేయి వీణలను మీటినట్లు ఉంటుంది. పిలిస్తే గంగాప్రవాహపు ఘోషలా ఉంటుంది. నవ్వితే హిమాలయ పర్వత శ్రేణులలో రాళ్ళపై పరుగెత్తే నదీ నిక్వణంలాగుంటుంది. పందులవెన్నెల విరియబూసినట్లు ఉంటుంది ముఖవర్చస్సు. అలాంటి స్త్రీ ముంతాజ్. ఆమెతో మాట్లాడకుండానే ఆమెను ఊరకచూస్తూ

కూర్చుంటే కాలం దొర్లిపోతుంది. ఆమె పెదవులమీద చిరునవ్వులు సర్వదా నాట్యమాడుతుంటాయి. బంగారపుఛాయ ఆమెది. ఒక్క మాటలో చెప్పాలంటే ఆమెది అతిలోక సౌందర్యం. ఆమె వయస్సు ముప్పై సంవత్సరాలుంటాయి. రవి అనాకారికాడు, కాని అందగాడని చెప్పలేము. ఒడ్డూపొడుగూ, దానికి తగిన ఛాతీ కలిగి ఉన్నాడు. అతని ముఖంలో ఆకర్షించే లక్షణంవుంది. అతడు ముప్పైఐదేళ్ళ వయస్సు కలవాడుగా కన్పడతాడు.

దుర్గ ముందు అనేకరకాల ఫలహారాలను ఉంచి తినమని బలవంతంచేసింది ముంతాజ్. అన్నింటినీ కాస్తకాస్త రుచిచూచింది దుర్గ. బజారులో కొనుక్కొనివచ్చినవి కావని దుర్గ గ్రహించింది. 'ముంతాజ్‌కు ఎంత ఓపికో వీటిని తయారుచేయటానికి' అని తలపోసింది.

"ఇంత ఓపికగా ఎలా తయారుచేశారండీ" అని ముంతాజ్‌ను అడిగింది.

మనకు ఇష్టమయిన పదార్థాన్ని తయారు చేసుకోవడంలోనే ఆనందమున్నది." అని ముంతాజ్ బదులుచెప్పింది.

"ఈ సూత్రం అన్ని విషయాలలో వర్తిస్తుందంటారా?" అని ప్రశ్న వేసింది దుర్గ.

"ఈ సూత్రం సర్వేసర్వత్ర వర్తించదు. వస్తువుయొక్క లక్షణాలనుబట్టి సందర్భాన్ననుసరించి వుంటుంది" బదులుచెప్పింది ముంతాజ్.

ఈ సిద్ధాంత చర్చను వింటూ కూర్చున్నాడు రవి. అనాథ శరణాలయాభివృద్ధిని గురించి వారు దుర్గను అడిగారు. శరణాలయానికి మరో భవనం అవసరమవుతుందేమోననే అభిప్రాయాన్ని

వారు వెలిబుచ్చారు. అలాంటి కార్యక్రమాన్ని కమిటీవారు చేపట్టి తాము ధనసహాయం చేస్తామని వారు చెప్పారు. శరణాలయ నిర్వహణను గురించి అనేక సలహాలను ఇచ్చారు.

రవి ముంతాజ్‌ల కాలేజీలో వారి పనిని గురించి దుర్గ అనేక ప్రశ్నలు వేసింది. వారు తోచిన సమాధానాలను చెప్పారు.

"ముంతాజ్‌గారూ! మీది మీ కాలేజీలో బోధచేసే విషయాలన్నింటికీ తలమానికం అనుకుంటాను. మీది వ్యవసాయ కళాశాల; మీ విషయం వ్యవసాయశాస్త్రంకదా!" అని అన్న దుర్గకు ఇలా బదులుచెప్పింది ముంతాజ్.

"దుర్గా! అందరూ అలాగే అనుకుంటారు. కాని వాస్తవం అలాలేదు. కాలేజీలో బోధింపబడే విషయాలలో ఇదీ ఒకటి. అలాగే అది పరిగణింపబడుతూ ఉంది."

ఈ విషయం దుర్గను ఆశ్చర్యంలో ముంచెత్తింది. ఆ సందర్భాన్ని గురించి మరో ప్రశ్నకాదు ఇంకా కొన్ని ప్రశ్నలు వేయకుండా ఉండలేకపోయింది. వేసింది.

"వ్యవసాయ శాస్త్రానికి ఉపాంశాలుగా ఉండవలసిన రసాయనశాస్త్రం, ఇంజనీరింగు వగైరాలు దానితోపాటు సమాన హోదాగల విషయాలుగా తయారయ్యాయి. ఇలాంటిది మన దేశంలోతప్ప మరెక్కడాసాధ్యంకాదు." విమర్శించింది ముంతాజ్.

"భూసార పరీక్ష చేసుకోవటానికి ఒక చిన్న పరికరాల పెట్టెను తయారుచేయవచ్చు కదా!" అని రవిని అడిగింది దుర్గ.

"అలాంటిది ఒకటి నమూనాగా తయారుచేసి ఇచ్చాం. వానిని వ్యాపారసరళిలో తయారుచేసి చవకధరకు ప్రతి సన్నకారు

రైతుకూ అందించాల్సిన బాధ్యత ప్రభుత్వానిది" అని తమ విభాగపుకృషిని విశదీకరించాడు రవి.

"మీ పరిశోధన ప్రజలకు అందేరోజు ఎప్పుడువస్తుందో ?" అన్నది దుర్గ.

"ఆరోజుకోసం ఎదురు చుస్తున్నాము" అంది ముంతాజ్.

సంభాషణ ఎన్నో మలుపులుతిరిగి చివరకు గృహస్థాశ్రమ ప్రాశస్త్యం పైకి దొర్లింది.

వ్యక్తిత్వం బాగా పెరిగిన ఇద్దరువ్యక్తులు - స్త్రీ పురుషులు - వివాహబంధంలో ఇమడలేరేమోననే సందేహాన్ని దుర్గ ప్రకటించింది.

వివాహబంధం చాల సహజమైన సంబంధం కనుక దానిలో ఇమడడం చాలా తేలికైనపని యని ముంతాజ్ అభిప్రాయాన్ని వెలిబుచ్చింది.

"సంసారజీవితానికి స్త్రీ పురుషులిద్దరూ రెండు చక్రాలవంటి వారు. ఈ రెండుచక్రాలు సమానంగా దొర్లుతుంటేనే కుటుంబమనే రథం సాగిపోతుంది; లేకపోతే నడక కుంటుపడుతుంది. ఈ ముఖ్యాంశాన్ని గమనించక ఏదో మూడుముళ్ళువేస్తే కుటుంబం ఏర్పడుతుందని చాలమంది అమాయకంగా అనుకుంటున్నారు. ఇదిచాల పొరపాటు. ఈ భావం ప్రజల మనస్సులలో నుంచి ఎంతత్వరగా వదిలిపోతే అంతమంచిది" గట్టిగా చెప్పాడు రవి.

ఈ చర్చ ఇలా కొనసాగడం దుర్గకు అట్టేఇష్టంలేదు. కాలా తీతమైనదని సాకుచెప్పి నమస్కారాలుచేసి ఇంటికి తిరుగు ప్రయాణం కట్టింది.

# 11

హైదరాబాదులో వివాహవ్యవస్థపై సెమినారు జరిగింది. దానికి హైకోర్టుజడ్జి ఒకరు అధ్యక్షత వహించారు. వెంకటావ్రుకు ఇటువంటి సెమినార్లంటే అట్టే ఇష్టంలేదు. అంటే అతని ఇష్టాఇష్టాలకు వదిలితే వాటికిహాజరయ్యేవాడుకాదు. ఇటీవలవచ్చినమర్యాద అతనిని బాధపెట్టింది. పై ఆఫీసరో, లేక ఎవరివల్లమనం ఏదైనాఆశిస్తామో వారుహాజరైనసభకూ మనమూ హాజరుకావటం. ఆ కార్యక్రమ సందర్భంగా మనం వారినికలవడం వారితోమాట్లాడి కరచాలనం చేసిరావడం. ఇలాంటి పరిభ్రమణలు స్వతంత్రం వచ్చినప్పటినుండీ పెరిగాయి. అలాంటిదే ఈ సెమినారు; కనుక వెళ్ళకతప్పలేదు వెంకట్రావుకు.

ప్రారంభకులు ఇలాంటి సెమినార్లవల్ల కలిగే లాభాలను గురించి గంభీరంగా ఉపన్యసించారు. తరువాత జడ్జీగారు ఇలాంటి సెమినారులలో చర్చనీయాంశాల విషయాన్ని ముచ్చటించారు. 'వివాహం ఎందుకు?', 'దానికి తంతు అవసరమా!', 'క్రొంగొత్త వివాహరీతులు ఎలా ఉంటున్నాయి?' 'వాటి ఉపయోగాలు లేక నష్టాలు.' ఇలాంటి అంశాలపై సెమినారు నాలుగు భాగాలయి చర్చిస్తుందని వారు చెప్పారు. 'పెండ్లికి తంతు అవసరమా' అనే చర్చా విభాగంలో జడ్జిగారు కూర్చున్నారు. వెంటనే వారిచుట్టూతిరిగే వెంకట్రావులాంటి ప్లీడరుకూడా ఆ చర్చా విభాగంలో కూర్చున్నారు. ముఖ్యందుగా వెంకట్రావును ఆశ్చర్య పరిచిందేమంటే ఆ విభాగానికి రాధాకృష్ణ అధ్యక్షత వహించడం.

తన ఇంటిపక్కి ఇంటిలో అద్దెకు ఉంటున్నాడని మాత్రమే రాధా కృష్ణని గురించి తెలుసు అంతేకాని అతడు ఏ వృత్తి చేస్తున్నాడో, ఏ కార్యక్రమాలలో పాల్గొంటున్నాడో అతని అభిమాన విషయాలు ఏమిటో వెంకట్రావుకు తెలియవు. తెలిసికోవలసిన అవసరమూ కలుగలేదు ; తెలిసికోటానికి కాలవ్యవధిలేదు. ప్లీడరీ ప్రాక్టీస్ అంటే మాటలా. వారానికి ఏడు రోజులున్నా చాలటంలేదు తనకు. 'ఏదైనా ఇదొక తమాషా. దీని సంగతీ వాకబుచెయ్యాల్సిందే' అనుకుంటూ చర్చల తీరును గమనించసాగాడు.

"వివాహం అవసరం అని అంగీకరిస్తేనే వివాహానికి తంతు అవసరమా లేదా అనే ప్రశ్న ఉదయిస్తుంది" అని అధ్యక్షత వహించిన రాధాకృష్ణ చర్చనీయాంశాన్ని సూచించారు.

ముంతాజ్ ముందుగా ప్రసంగించింది. ఆమెను పరిచయం చేశాడు అధ్యక్షుడు. వ్యవసాయ విశ్వవిద్యాలయంలో ఆమె హోదాను చెప్పాడు.

ముంతాజ్ ప్రసంగం కొలది నిమిషాలే జరిగినా ఆమె స్పష్టమైన అభిప్రాయాలను చెప్పింది. "వివాహం కుటుంబంలో స్థిరత్వం కలిగిస్తుంది. అందుకని అది అవసరమని మనం అందరం గుర్తిస్తున్నాం. కాగా అలాంటివివాహానికి ఏదో ఒక తంతు అవసరమని నా దృఢాభిప్రాయం. వీరిరువురు భార్యాభర్తలుగా జీవిస్తున్నారు అనేదానికి చిహ్నంగా ఈ తంతు అవసరం అవుతుంది. అంతేకాదు సంతానం విషయంగాకూడ ఈ తంతు అవసరం; ఎందుకంటే ఈ సంతానం వలానావారిది అని ప్రజలకు తెలియాలికదా?" ఇలా ముగించింది ప్రసంగాన్ని ముంతాజ్. ముంతాజ్ మాటలు సంప్రదాయ వాదులకు తృప్తి కలిగించేవిగా ఉన్నాయి.

తరువాత శ్యామలాదేవి లేచారు. ఆమె ధోరణి ఇలా సాగింది.

"వివాహానికి ముఖ్యం ఏమిటి? ఇద్దరు స్త్రీ పురుషులు ఆలుమగలుగా జీవితం సాగిద్దామనే నిర్ణయానికి రావడమేకదా. అలాంటి నిర్ణయాన్ని పదిమంది యెదుట చెప్పవలసిన అవసరమేమిటి. అది వారిద్దరి వ్యక్తిగత సమస్య. దానిని బహిర్గతం చేయవలసిన అవసరంలేదు. భార్యాభర్తలలో ఏ ఒక్కరికైనా ఆ వివాహం కొనసాగించటం ఇష్టం కాకపోతే విడాకులు పొందడానికి మనం అంగీకరిస్తున్న ఈ రోజుల్లో వివాహానికి తంతు అనవసరం. ఎవరి మనస్సాక్షి వారికి ప్రమాణాధారంగా ఉంటుంది. అంతేకాదు సంతానం గురించి ముంతాజ్‌గారు ప్రస్తావించారు. ఫలానివారి కుమారుడు లేక కుమార్తె అని నమోదు చేయడానికి తండ్రి పేరే నమోదు చేయాలని ఎందుకు ఉండాలి? తల్లిపేరు వ్రాయటం సముచితం కదా? గట్టిగా తెలిసిన విషయాన్ని నమోదు చేయటం మంచిదికాదా? కనుక ఏ రకంగా ఆలోచించినా పెండ్లికి తంతు అనవసరం. ఏతంతూ లేకుండానే ఇద్దరు స్త్రీ పురుషులు పరస్పర విశ్వాసంతో కాపురం చేయవచ్చును. అది అసంభవం కాదు; విపరీతం అంతకన్నా కాదు."

రవి లేచి తన అభిప్రాయాన్ని ఇలా--

"వివాహం పవిత్రబంధం. ఆ బంధంలోనికి ఎవరైనా ప్రవేశించేముందు చుట్టూవున్న పెద్దల ఆమోదాన్ని పొందాలి లేక కనీసం వారికి ఎరుకపరచాలి. లేకపోతే ఎవరు ఎవరితో కాపురం చేస్తున్నారో ఎవరికీ తెలియదు" వివరించాడు.

అధ్యక్షతస్థానంలోవుండి రాధాకృష్ణ ఒకచిన్న విసురువిశిరారు.

" చుట్టూవున్న సంఘానికి ఈ వివాహం విషయం తెలిసి మాత్రం ఏం చేస్తుంది? తెగిపోయిన వివాహ బంధాన్ని అతికించ లేదు. గట్టిగావున్న బంధానికి వీరితోడు అవసరంలేదు."

ఈ చురకకు ముంతాజ్ సమాధానం చెప్పకుండా ఉండలేక పోయింది. ప్రసంగానికి మారుగా ప్రశ్న వేసింది.

" ఒకవేళ దంపతులు విడిపోతే సంతానానికి మనవర్తి ఇచ్చే విషయంలో తండ్రి బాధ్యత నిర్ణయించటానికి తండ్రి ఎవరో తెలియాలికదా?" శ్యామలాదేవి ఈ వాదనకు అడ్డుపుల్ల వేసింది.

" అయితే సంతానం కననివారికి, లేక పొందనివారికి తంతు అక్కర్లేదని అంగీకరిస్తారా?" ఎదురు ప్రశ్న వేసింది. ఇలా సవాళ్ళు అడ్డు సవాళ్ళతో సాగిపోయింది చర్చ. ఇతరులుకూడా పాల్గొంటున్నారు అతి హుషారుగా. ఇంతలో ఒక మూలనుంచి ఒక ఘాటి ప్రశ్న వచ్చింది.

" ఇదంతా వృధాచర్చ. తంతు లేకుండా ఆలుమగలుగా జీవించే స్త్రీ పురుషులు ఈ సంఘంలో ఉన్నారా?" గొంతు పెద్దది చేస్తూ అడిగిందా కంఠం, సభ నిశ్శబ్దమయింది. ఒకరి మొగాలు ఒకరు చూచుకుంటున్నారు.

శ్యామలాదేవి లేచింది. నిటారుగా నిలబడింది. అసలే ఆకర్షణీయమైన ముఖవర్చస్సేమో ఇపుడు తారాజువ్వలాగా వెలిగి పోతుంది. మామూలుగా ప్రసన్నంగావుండే ఆమె వదనంలో తీక్షత చోటుచేసుకుంది. ఆమె నయనాలు ఆమె భావతీవ్రతను సూచిస్తున్నాయి.

" చెప్పేది ఒకటి చేసేది ఒకటి మా ఇంటా వంటాలేదు. త్రికరణశుద్ధికల మానవ సంఘ నిర్మాణం నా ధ్యేయం. తంతు

లేకుండా నేనూ రాధాకృష్ణ ఆలుమగలంగా కాపురం చేస్తున్నాం. మాకు అయిదేండ్ల వయస్సుగల చిన్నారి బిడ్డ క్రాంతి వున్నది. మేము సుఖంగా ఆనందంగా తృప్తిగా బ్రతుకుతున్నాం. ఇంకా వేరే నిదర్శనాల కోసం వెతుక్కోవటం దేనికి?" అంటూ గంభీరంగా సమాధానమిచ్చింది. సభ గతుక్కుమన్నది. ఎవరూ నోరు మెదవ లేదు. రాధాకృష్ణ అధ్యక్షుని తుదిపలుకులు మాట్లాడి సభను ముగించారు.

సభ అయిపోగానే రవి ముంతాజ్‌లు రాధాకృష్ణ, శ్యామలాదేవి గార్లతో పరిచయం చేసుకున్నారు. ఈ రెండు జంటలూ ఒకచోట కలవడం ఇదే మొదటిసారి. ఇద్దరూ త్రికరణశుద్ధికలవారే. ఇరువురికి ఆత్మవిశ్వాసం మెండు. సభ్యతాసంస్కారాలు వారి సొమ్ము. తమతమ అభిప్రాయాలు భేదించినా ఒకరినొకరు గౌరవించుకోగల సత్తాకలవారు. రాధాకృష్ణ దంపతులను తమ ఇంటికి ఆహ్వానించారు రవి ముంతాజ్‌లు. త్వరలోనే వారి ఆహ్వానాన్ని మన్నిస్తామని రాధాకృష్ణ శ్యామలాదేవి గార్లు హామీ ఇచ్చారు.

వెంకట్రావుకు ఈ సభ విచిత్రంగాతోచింది. కొన్ని కొత్త విషయాలు తెలుసుకున్నాడు. 'రాధాకృష్ణ, శ్యామలాదేవిగార్లకు పెండ్లికాలేదట; అంటే శ్యామలాదేవి లా దృష్టిలో రాధాకృష్ణ ఉంపుడు గత్తె. అలాంటి కుటుంబముతో సంపర్కం పెట్టుకోవటం మహాపాపం. తన భార్య విమలకు ఈ విషయం తెలియదు. తెలిస్తే వారిని నిన్న గాకమొన్న తమ ఇంట్లో పుట్టినరోజుకు పిలుస్తుందా? తన భార్య విమలలాంటి పతివ్రత ఇలాంటి వారిని ఆహ్వానించవచ్చా! ఇదంతా విమలకు చెప్పాలి.' అనుకుంటూ వెంకట్రావు ఇల్లు చేరాడు.

వెంటనే విమలకు ఈ విషయమంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాడు. ఆమె ముక్కుమీద వేలేసుకుంది. ఇక శ్యామలాదేవిని ఇరుగు పొరుగు మనిషిగా గౌరవించరాదని తీర్మానించుకున్నది. లలితతో కూడ చెప్పి ఆమెను వెలివేద్దామనుకుంది.

# 12

ఆ రోజు రాత్రి ఎనిమిది గంటలయింది. కుటుంబరావు ఇంటికి వచ్చాడు. "లలిత లలితా" అని పలుమార్లు పిలిచాడు. లోపలి నుంచి జవాబులేదు. తలుపు దబదబా బాదాడు. వాకిలి తలుపు తెరుచుకుంది. ఎదురుగా క్రోధారుణ నేత్రాలతో లలిత అతనికి ప్రత్యక్షమయింది. 'ఎందుకూ అలా గావుకేకలు వేస్తావు' అన్నట్లు చూస్తున్నది. ఆ చూపును భరించలేక పోయాడు. తల వంచుకొని లోపలికి వెళ్ళాడు. కాళ్ళు చేతులు కడుగుకొనివచ్చి మంచినీళ్ళు తాగి వడకకుర్చీలో కూలబడ్డాడు. తన భార్య కాఫీనీళ్ళు పోస్తుందేమోనని గంపెడాశతో ఉన్నాడు. కాని కాఫీ వాసన తగలలేదు.

"సాయంత్రం సినిమా టైము రాత్రి ఎనిమిది గంటలకా? చెప్పరేమండీ. సాయంత్రం సినిమాకు రెడీగా ఉండమనిచెప్పి వెళ్ళింది కుటుంబరావుగారేనా కాదా?" అనే పరుష కంఠధ్వని వినిపించింది అతనికి. గడగడ వణికిపోయాడు.

'అలా చెప్పివెళ్ళింది తనే. సందేహంలేదు. కాని సాయంత్రం క్లబ్‌లో పేకాట ఆడుతూ ఆ విషయం మరచిపోయాడు. ఇంత లేటుగా ఇంటికిచేరాడు. చేసిన తప్పుకు దండన అనుభవించాల్సిందే' అనుకొని

"ఏమిటా గావుకేకలు. ప్రక్క ఇళ్ళవాళ్ళు విని నవ్వి పోగలరు. కాస్త నెమ్మదిగా మాట్లాడు. క్రొత్తకేసు వచ్చింది. ఆ పని తొందరలో మర్చిపోయాను." అని సముదాయించ బోయాడు భార్యను.

ఈ పంజాయిషీ ఆమెకు అగ్గిమీద గుగ్గిలంలా అయింది.

"ఏమిటీ? మరచిపోయారా? మరచిపోరూ మరి! ఈ రోజు సినిమా పంగతి మరిచిపోయారు, రేపు ఇంట్లో ఇల్లాలు వుందనే విషయమూ మరచిపోతారు. ఎల్లుండి పెండ్లి అయిన విషయమూ మరచిపోతారు. మీకేమండి మగమహారాజులు. మర్చి పోగలరు; మర్చిపోయామని బొంకగలరు." లలిత మారు పల్కింది అతి కోపంతో. ఆమెను యెలాగైనా అనునయిద్దామను కున్న కుటుంబరావుకు చిరాకెత్తింది.

'తను తప్పుచేశాడు. అందులో పందేహంలేదు. అయితే అంతమాత్రాన తాళి కట్టిన మొగుడిని అలా నానా మాటలూ అనడమా? పంపాదించే మగవాడని అయినా కొంత భయం భక్తీ ఉండొద్దూ? ఇలా పహిస్తుంటే ఈమె ఆగడం పెచ్చు పెరిగిపోతోంది. ఈమెను అదుపులో పెట్టాలి' అనుకున్నాడు కుటుంబరావు.

మనస్సు చిక్కబట్టుకున్నాడు. ధైర్యం తెచ్చుకున్నాడు. కంఠస్వరం పెంచాడు. కోపంగా

"పంపాదించే వాడికి తెలుస్తాయి దాంట్లో ఉండే సాధక బాధకాలు. క్రొత్తకేసువస్తే వీలులేదనిఅంటే ఎవరైనా కేసులుఇస్తారా? నా భార్యను సినిమాకు తీసికొనివెళ్ళాలి రేపురండి అంటే వస్తారా? ఏమిటి తెలిసీతెలియనికోపం, పోషించేవాడికి తెలుస్తుంది బరువు భారం. ఎందుకు అలా గింజుకుంటావు".

ఆమె తోకత్రొక్కిన తాచైంది.

"నేను నీకు బరువైనానా? అవనూమరి. నేను తెచ్చిన కట్నము పదివేలేకదా! సారెలు పండుగలు అనీ మా నాయన తన ఇల్లు నీకు దోచిపెట్టాడే! నీవునన్ను పోషిస్తున్నావా? నేనుతెచ్చిన పైకంమీద వడ్డీచాలు నా జీవితం వెళ్ళిపోవటానికి. ఎందుకయ్యా పోజులుపోతావు నన్ను పోషిస్తున్నానని" అని దబాయించింది లలిత.

కుటుంబరావులో పురుష దురంహంకారం విజృంభించింది. లేకిమాటలు వస్తాడా పురుషపుంగవుడైన భర్త.

కుర్చీలోంచి ఒక్క ఉదుటునలేచి ఆమె జుట్టువట్టుకొని వంచి ఆమె వీపుమీద దబదబా నాలుగు దెబ్బలువేశాడు. ఆమె "కుయ్యో, మొర్రో, నన్ను చంపేస్తున్నాడర్రో అంటూ గావుకేకలు పెట్టింది లలిత. ఈ మాటలు, కేకలు అన్నీ దుర్గకు వినవస్తూనేవున్నాయి. ఆ రోజు తను త్వరగానే వచ్చింది ఇంటికి. కాని లలిత లేకీమాటలు ఆవాళ విమలగారి ఇంటిలో విన్నప్పటినుండి ఆమె విషయాలలో తను జోక్యం కలుగజేసుకోలేదు ఆమె.

లలిత రెచ్చిపోయి భర్తను తిట్లు లంకించుకున్నది. అతడు నిగ్రహం కోల్పోయి ఆమె వీపుమీదా, చెంపలమీదా తాషామరపా వాయిస్తున్నాడు. ఆమె ఏడ్పులూ పెడబొబ్బలూ సాగించింది.

ఈ గోలంతా వెంకట్రావు విమలలకు వినపడింది. వాళ్ళు దబదబావచ్చి కుటుంబరావు వాటా తలుపుతట్టారు. కొంత ఆలస్యంగా కుటుంబరావు తలుపుతీశాడు. లలిత ఏడుపు మూలుగులోకి దిగింది.

"ఏమిటయ్యా కుటుంబరావు ఈ గొడవ. గృహచ్ఛిద్రం తెచ్చిపెట్టుకునేటట్లున్నావు. ఎంత తెలివి తక్కువ వాడివయ్యా!

ఏదో సర్దుకుపోవాలిగాని బజారున పడతామా ” అంటూ కుటుంబ రావును మందలించాడు వెంకట్రావు.

విమల లలిత దగ్గరకువెళ్ళి భుజంపై చెయ్యివేసి, తలనిమిరి ఆమెను అనునయించింది.

“ ఊరుకో అమ్మా, ఊరుకో ! ఏం చేస్తాం ! ఆడవాళ్ళం. ఒకరికి లొంగి పడివుండాల్సిన వాళ్ళమేకాని ఎదురు తిరగవలసిన వాళ్ళం కాదమ్మా. మన బ్రతుకులు ముల్లుమీద అరటాకు సామెతవి. ఎటైనా మనకే నష్టం.” హితబోధ చేసింది విమల. లలిత దుఃఖం తగ్గింది కుటుంబరావు సిగ్గుపడి నించున్నాడు ఒకమూల.

“ విమలా ! ఇక పోదాంపద ” అంటూ విమలని పిలిచాడు వెంకట్రావు. ఇద్దరూ తమ వాటాల్లోకి వెళ్ళిపోయారు.

వెంకట్రావు భోజనానికి కూర్చున్నాడు. విమల వడ్డిస్తున్నది. కుటుంబరావు లలితల తగాదా ఇద్దరి మనసులలో ఇంకా మెదులుతూ ఉంది. ఇద్దరికీ ఆ విషయం చర్చిద్దామనే ఉంది. కాని ఎవరు ముందు మాటలు మొదలుపెట్టాలి ? విమల ముమ్మందుగా ప్రస్తావించింది.

“ ఏమండీ ! మీరు కుటుంబరావుగారిని మందలించారు, కనుక మీ దృష్టిలో ఆయనదే తప్పనికదూ ?” అని ఒక ప్రశ్న వేసింది విమల భర్తని.

“ కాదు ! అలా ఎన్నటికీకాదు. తప్పంతా ఆమెదే. కాకపోతే అంత దూరం వ్యవహారం రానీయడం అతని బలహీనత.”

“ అంటే సినిమాకు తీసికెళ్ళలేదేమని ఆమె అడగడం ఆమె తప్పన్నమాట. అతగాడు వేళకి ఇంటికి రాకపోవడంలో అతని పొరపాటేమీ లేదన్నమాట.”

"నీకు అర్ధంకాదు. నీది పిచ్చిమాలోకం. సినిమాకు తీసు కెళ్ళకపోతే ఆమె అంత రగడచేయడం తప్పుకాదూ? నిన్ను ఎన్నిసార్లు సినిమాకు తీసుకెళ్తానని ప్రోగ్రాం మార్చాను. నీవూ ఆమెలాగే రాద్ధాంతం చేశావా?" అని అడిగాడు వెంకట్రావు.

"నా సంగతే చెప్పుకోవాలి. ఎప్పుడైనా సినిమాకు తీసు కెళ్ళమని నేను ఇన్నిఏళ్ళుగా - నేను కాపురానికివచ్చి ఇరవై ఏళ్ళయింది - ఎప్పుడైనా అడిగానా? అందులో ఫలాని సినిమా అని అడిగానా? తీసుకొనివెళ్తే వచ్చాను; లేకపోతే ఊరుకున్నాను. అందరూ నాలాగే అణగిమణిగి ఉంటారా. అందులో ఈ రోజుల్లో చదువుకున్న ఆడపిల్లలు." అని తన గోడును చెప్పింది విమల.

"అదికాదోయి అసలు విషయం. పని తొందరలో రాలేక పోయాడనుకో. దానికి ఇంత తగవుపెట్టాల్సిందేనా అనేదే ప్రశ్న."

"రాలేకపోయినందుకు కాదు ఆమె ఏడ్చి గోలచేసింది. తనకు చేసిన వాగ్దానం మరచిపోయినందుకు. రాలేకపోతే మన ఇంటికి ఫోనుచేసి రాలేకపోయానని చెప్పవచ్చుగా! బహుశః అదే ఆమెకు కోపకారణమయి ఉంటుంది." అని విడమర్చిచెప్పింది విమల.

ఏం చెప్పాలో తోచలేదు వెంకట్రావుకు.

"అసలు సమస్య అదికాదు. ఏ పని అయినా చెయ్యాలన్నా వద్దనుకున్నా ఆ హక్కు భర్తది. ఇలా ఎందుకు జరగాలి? ఇలా ఎందుకు జరగలేదు? అని ప్రశ్నించే హక్కు భార్యలకు ఉండాలా లేదా అనేదే ప్రశ్న. ఈ హక్కును వారు ఏనాడూ అనుభవించ లేదు. మా అమ్మమ్మలూ, నాయనమ్మలూ, మా అమ్మా, మా మేనత్తా ఏనాడుకోరలేదు. నీవూ కోరటంలేదు. పూర్తిగా భర్త ఇష్టాను

సారం గ్రహించడమే పతివ్రతా లక్షణం. నీబోటి పతివ్రతలు ఇంకా ఉండబట్టే భూమిమీద భారతదేశ సంస్కృతీ నాగరికతా ఖ్యాతికి బట్ట కట్టున్నాయి." ఇలా తన చివరిమాట చెప్పి భోజనం ముగించాడు వెంకట్రావు. విమల వెంకట్రావు మాటలను మననం చేసుకుంటూ తన పనులలో నిమగ్నురాలయింది.

# 13

సెమినార్రైన వారం రోజులకు శ్యామలాదేవి, రాధాకృష్ణా, రవి ముంతాజుల ఇంటికి వెళ్ళారు. ఆ రోజు వాళ్ళింట్లో చిన్న టీ పార్టీ. వీరుకాక దుర్గా, మోహన్‌లు మాత్రమే ఆహ్వానితులు. ఫలహారాదులు, టీ పుచ్చుకున్న తర్వాత అందరూ బాతాఖానీలో పడ్డారు. రవి తను, ముంతాజ్ ఉద్యోగాలు మానేస్తున్నామని ప్రకటించాడు. ఆ సందర్భంలోనే ఈ టీ పార్టీ ఏర్పాటు చేసినట్లు చెప్పాడు. ఈ వార్త మిగతావారిని దిగ్భ్రాంతిలో ముంచేసింది. ఇలాంటి పని వారు చేయగలరని, చేస్తారని ముందుగా ఏనాడూ ఊహించక పోవటంతో వారి ఆశ్చర్యానికి మేరలేదు.

"ఇంతకూ, ఏమంత తొందరొచ్చిందని మీరు రాజీనామా పెట్టారు?" అని మోహన్ ప్రశ్నించాడు.

"మేము చేసిన పరిశోధన, మాకృషి అంతా వృధాఅవుతోంది ప్రభుత్వ చర్యలవల్ల. భూసారపరీక్షకు చిన్న పరికరాల మూట ఒకదానిని రవి రూపొందిస్తే ఆమోదించిన ప్రభుత్వం పన్నుకారు రైతులకు అందజేయలేదు. నా వ్యవసాయ శాస్త్ర పరిశోధనా ఫలితాలను విస్తరణశాఖ ద్వారా ప్రజలకు అందజేయటంలేదు ప్రభుత్వం. ఇలా బందీలంగావుండి ఈ ఉద్యోగాలను అంటి

పెట్టుకొని వుండటం మాకు సుతరాము ఇష్టంలేకపోయింది. అందుకే వాటిని వదిలించుకున్నాం." తెలియజెప్పింది ముంతాజ్.

"అయితే మీరిప్పుడేం చెయ్యతల్చుకున్నారు?" అని అడిగింది శ్యామలాదేవి.

"మేము సంపాదించిన డబ్బు అంతా గ్రామాభ్యుదయ ట్రస్టుగా ఏర్పరచి దాని ఆధ్వర్యాన ఇరువురం కృషిచేయదలచాం. మీకేదయినా పల్లె గ్రామం తెలిస్తే చెప్పండి.' అభ్యర్థించాడు రవి.

తనూ, శ్యామలా దగ్గరి గ్రామంలో ఎలా పయోజన విద్య గరుపు తున్నదీ వివరించి ఆ గ్రామంలోనే రవి, ముంతాజులు కూడా పనిచేస్తే బాగుంటుందని సూచించాడు రాధాకృష్ణ. ఆ గ్రామం హైదరాబాదుకు దగ్గర్లోవున్నది. కనుక పాతబస్తీలో కాపురంవుండి పోయిరావడం తేలికని శ్యామల చెప్పింది. ఈ ప్రతిపాదనకు ముంతాజ్ దంపతులు ఎగిరి గంతేశారు. ముంతాజ్ పేరుతో ట్రస్టు ఏర్పడగానే పని ప్రారంభిస్తామన్నారు. ఇదంతా వింటువ్న దుర్గ ముంతాజుమ అభినందించింది.

దేశము, ప్రజలు ఇలాంటి అంశాలు మాట్లాడుకుంటున్న ఈ ఆరుగురి సంభాషణ అటూ ఇటూ మళ్ళీ కుటుంబనియంత్రణ మీదికి దొర్లింది. కుటుంబనియంత్రణ భారత ప్రజలకు తప్పక అవసరమవుతుందని అందరూ అంగీకరించారు. కాకపోతే పిల్లలక్కరలేదని ముంతాజ్ వాదిస్తే కనీసం ఒక పిల్లయినా వుండాలని శ్యామలాదేవి ప్రతివాదన చేసింది. వివాహము, సంతానము లక్ష్య సాధనకు అడ్డంకులవుతాయని దుర్గ అభిప్రాయం వెలిబుచ్చింది. కుటుంబనియంత్రణ అనేది దేశ దృష్ట్యా కాకుండా వ్యక్తిదృష్ట్యా పరిగణించబడాలని రవి చెప్పాడు. పూర్తిగా సంతానాన్ని

కాదమకుంటే జీవితం ఆనందం కొరవడుతుందనే భయాన్ని రాధాకృష్ణ వెలిబుచ్చాడు. సంతానరాహిత్య విధానం అందరికీ అందుబాట్లో లేకపోవచ్చుకానీ అభ్యుదయ భావాలుగల కొందరైనా అమలుపర్చటం మంచిదని రవి నొక్కిచెప్పాడు. ఈ చర్చ అట్టే తమ జీవితాలకు వర్తించదని దుర్గా మోహనులు పెద్దగా పాల్గొన లేదు. ఒకవైపురవి, రెండోవైపు రాధాకృష్ణా ఎంతగా వాదించుకున్నా ఇద్దరూ ఏకాభిప్రాయానికి రాలేకపోయినారు.

"ఈ సమస్య ఇక తేలదుకాని ఆపండిబాబూ ఈ చర్చ" అని శ్యామలాదేవి కోరినమీదట చర్చ ఆగిపోయింది. నమస్కారం పెట్టి దుర్గా, మోహన్‌లు వెళ్ళారు. తర్వాత శ్యామలా, రాధాకృష్ణ గార్లుకూడా వెళ్ళారు.

## 14

ఆ రోజు 'అణచివేత నిరశన దినోత్సవం.' మధ్యాహ్నం మూడు గంటలకు అబ్జుల్‌గంజ్ నుండి ఊరేగింపు బయలుదేరి సికిందరాబాదు స్టేషన్ ప్రాంతానికి చేరుకుంటుందని, రాత్రి ఏడు గంటలకు పెరేడ్ గ్రౌండులో బహిరంగసభ జరుగుతుందని ప్రచురించబడింది. గోడలమీద అలాగని కాయితాలు అతికించారు. సాయంత్రం నాల్గు గంటలకు కోటీ అంతా జనంతో నిండిపోయింది. ఊరేగింపు ఆ ప్రాంతాన్ని దాటటానికి గంట పట్టింది. రాష్ట్రం నలుమూలల నుండి కార్మికులు, కర్షకులు, మేధావులు అశేషంగా వచ్చి ఊరేగింపులో పాల్గొన్నారు. ఊరేగింపు అగ్రభాగాన గ్రామీణమహిళలు, పట్టణ విద్యార్థినులు బ్యానర్లు పట్టుకొని నిలబడ్డారు. ఊరేగింపుకు సారథ్యం వహించాడు మోహన్. ఎక్కడ

చూచినా తనే తిరుగుతున్నాడు. నినాదాలిచ్చే వారికి సూచన లేమిటి? ఊరేగింపులోని వారిని లైన్లలో నడిపించటం, ఊరేగింపు ట్రాఫిక్కు అవరోధంకాకుండాచూడటం ఇలా ఎన్నో పనులు అతనొక్కడే చూస్తున్నాడు. అంటే ఊరేగింపు బాధ్యత అంతా అతనిదే అయినట్లు కనిపిస్తోంది. మూడు మైళ్ళపొడుగునవున్న ఊరేగింపు అగ్రభాగం టేంకుబండ్ ఉగ్రభాగానికొచ్చేసరికి ఆగిపోయింది. ఎందుకాగిపోయిందో వెనకవారికి అర్థంకాలేదు. మధ్యలో జనాన్ని సర్దుతున్న మోహన్ ఊరేగింపు అగ్రభాగానికొచ్చాడు. ఊరేగింపు కెదురుగా మూడు వరసలుగా బారులు తీరి స్పెషల్ రిజర్వు పోలీసు బలగం కనిపించింది.

"ఊరేగింపును ఎందుకాపారు" అని పోలీసు డి.ఐ.జి. ని ప్రశ్నించాడు మోహన్. ఊరేగింపుకిచ్చిన అనుమతిని పోలీస్ కమీషనర్ రద్దుచేశాడని ఆఫీసరు చెప్పాడు. "ఇవ్వడం, రద్దు చేయుటం రెండూ ఆయన హక్కేనా? అసలు ట్రాఫిక్కు, ప్రజా శాంతికి భంగం కానంతకాలం రోడ్డుమీద ఊరేగింపుగా నడిచేహక్కు ప్రతి పౌరుడికీవుంది. దానిని భారత ప్రధానికూడా తీసివేయ డానికి వీలులేదు. అందువల్ల కమీషనర్ ఉత్తరువునుకూడా నేను ఖాతరుచెయ్యను," అన్నాడు మోహన్.

కొద్ది కాలం ఓపిక పట్టవలసిందని ఈ లోగా కమీషనర్‌తో మాట్లాడివస్తానని డి.ఐ.జి. మోహన్‌తోచెప్పి వైర్‌లెస్ వేన్ వద్దకెళ్ళాడు. తిరిగొచ్చి తన బలగాన్ని తొలగి పొమ్మన్నాడు. ఊరేగింపుకు దోవ ఇచ్చాడు. ఊరేగింపు ముందుకు సాగిపోయింది. ఈ సంఘటనతో మోహన్ పేరు ప్రఖ్యాతులు ఇనుమడించాయి.

మర్నాడు ఒక నూలు మిల్లులో సమ్మె జరుగుతోంది. దొంగ లేబరును దొడ్డిదోవన ఫ్యాక్టరీలోనికి తీసుకెళ్ళాలని యజమాని

ప్రయత్నించాడు. దాంతో రెచ్చిపోయిన కార్మికులు గేటుకు అడ్డంగా పడుకున్నారు. వారిని అశ్విక పోలీసుదళం చేత తొక్కించాలని యజమాని ప్లాను వేస్తున్నాడు. ఈ సంగతంతా కార్మిక లోకానికి పాకింది. వాతావరణం ఉద్రిక్తంగా వుంది. ఆ సమయములో మోహన్ అక్కడికొచ్చాడు. అడ్డంపడ్డ వారిని తీసేయమని మోహన్‌ను పోలీసు డి. ఎస్. పి. ఆజ్ఞాపించాడు. అతని ఆజ్ఞను పాటించలేదు మోహన్. ఒక వేళ అడ్డంగా పడుకున్న కార్మికులను పోలీసులు తొలగిస్తే - స్థానాలను ఆక్రమించటానికి అయిదొందల కార్మికులు సిద్ధంగావున్నారు.

ఇంతలో పోలీసులపై రాళ్ళు పడ్డాయి. పోలీసులు కాల్పులు సాగించారు. ఎదురుగా నిల్చున్న మోహన్ ఛాతి ఎడమ భాగంలో గుండు దూసుకుపోయింది. అతని అనుచరులు, సహచరులు అతన్ని మోసుకెళ్ళారు.

## 15

ఊరేగింపు జరిగిన మూడు రోజులకు రవి ముంతాజ్‌లు తమ అలవాటు ప్రకారం అనాథ శిశు శరణాలయానికి వెళ్ళారు. వారు దుర్గను కలసికోలేకపోయారు. వాకబుచేస్తే ఒక నెలరోజులు సెలవు పెట్టి వెళ్ళిపోయిందని తెలిసింది. సెలవులో ఎక్కడ ఉండేది చిరునామా ఇచ్చి వెళ్ళిందేమోనని అడిగారు వార్డెనును. అలాంటి చిరునామా ఏమీ వదలివెళ్ళలేదని తెలిసింది. వారి మనస్సు పరిపరి విధాలపోయింది. ఊరేగింపులో కొందరికి తుపాకి గుండుదెబ్బలు తగిలాయని పత్రికలలో వార్త వచ్చింది. ఒకవేళ మోహన్‌కేమైనా గుండుదెబ్బ తగిలిందేమో అతనికి సపర్య చేయటానికే ఆమె వెళ్ళిందేమో. వెళ్తే మాత్రం రహస్యంగా వెళ్ళవలసిన అవసరమేమిటి?

ఏమో మోహన్‌మీద వారంటు ఉందేమో! కాకపోతే ఏదైనా అర్జంటుగా విదేశాల పెండ్లి సంబంధంవస్తే వాళ్ళ నాన్నగారు టెలిగ్రాం ఇస్తే ఆమె తన స్వంత ఊరుకు పెళ్ళి చూపులకు వెళ్ళిందేమో!

తాము తెచ్చిన పుస్తకాలు, చాక్లెట్లు పిల్లలకు పంచి వాళ్ళతో ఒక గంట గడిపి రవి ముంతాజ్‌లు ఇంటికిపోయారు.

మరునాడు సాయంత్రం వారిరువురు రాధాకృష్ణ శ్యామలా దేవిగార్లను చూడటానికి వెళ్ళారు. రాధాకృష్ణ దంపతులు ఇంట్లోనే ఉన్నారు. రవి ముంతాజ్‌ల రాకకు వారెంతో సంతోషించారు. మోహన్‌కు అరెస్టు వారెంటువచ్చింది. అతడు తీవ్రవాద రాజకీయా లతో సంబంధం పెట్టుకుంటున్నాడేమోననే అనుమానం కల్గిందని రాధాకృష్ణ చెప్పాడు. బహుశః అతనిపై వారంటు ఉండిఉంటుందని శ్యామలాదేవి అన్నది. ఊరేగింపును లేవదీసిన నాయకులను కొందరిని అరెస్టుచేసినట్లు పత్రికలలో చదివానని రాధాకృష్ణ చెప్పారు. ఇదంతా విన్న రవి ముంతాజ్‌లు అతనిజాడ ఇప్పట్లో తెలియడానికి అవకాశంలేదని తేల్చుకున్నారు.

"దుర్గ ఇటీవల మీకు ఏమైనా కన్పడిందా?" అని రవి రాధాకృష్ణను అడిగాడు.

"ఆమె జాడ మాకు తెలియదు. ఫలానిచోటికి వెళ్తున్నానని చెప్పి వెళ్ళలేదు. బహుశః మోహన్‌తోపాటే వెళ్ళిందేమోనని మా అనుమానం" అని రాధాకృష్ణ జవాబిచ్చారు.

దుర్గ భావాల స్వభావాన్ని గురించి తర్వాత కొంత చర్చ జరిగింది. ఆమె సంస్కరణవాదేనని వారంతా ఖచ్చితంగా తేల్చారు

కాకపోతే దుర్గకు మోహన్‌కు భావాలలో సన్నిహితత్వం లేనపుడు వారిమధ్య ఇంత బంధం ఉండటానికి ఎలా ఆస్కారం కలిగిందనే విషయంపై తర్జన భర్జనలు జరిగాయి. జీవితతత్వ విధానాలు వేరైనప్పుడు ఇద్దరు స్త్రీ పురుషులమధ్య ప్రేమ చోటుచేసుకోగలదా లేదా అనే అంశంపై వారు నల్గురూ వాదించుకున్నారు. జీవిత లక్ష్యాలు వేరుగా ఉంటే ప్రేమ అసాధ్యమని రవి రాధాకృష్ణలు అంటే వేరైనా ప్రేమ ఉదయించటానికి అవకాశంవుందని ముంతాజ్, శ్యామలాదేవి అభిప్రాయాలు వెలిబుచ్చారు.

తాము పాతబస్తీలో హుస్సేను ఆలంలో ఇల్లు అద్దెకు తీసుకున్నామని, వారం రోజులలో గ్రామంలో పని ప్రారంభిస్తామని, తమరిని గ్రామస్తులకు పరిచయం చెయ్యమని శ్యామలాదేవిని కోరింది ముంతాజ్. ఈ వార్త రాధాకృష్ణ దంపతులకు ఎంతో సంతోషాన్ని కలిగించింది.

" ఏ సంస్థ ఆధ్వర్యంలో పని ప్రారంభిస్తారు " అని రాధాకృష్ణ రవిని ప్రశ్నించాడు.

" ప్రస్తుతానికి నా భార్య ముంతాజ్ పేర ఒక ట్రస్టును ఏర్పాటుచేశాము. ముంతాజ్ ట్రస్టు ఆధ్వర్యాన మా సమాజసేవ గ్రామసీమలలో ప్రారంభిస్తాము. రోజూ ఆ గ్రామం ఉదయాన్నే వెళ్ళి రాత్రికి తిరిగి వచ్చేలాగు ఏర్పాటు చేసుకున్నాం " అని రవి చెప్పాడు.

"ముమ్మందుగా మీరిరువురు మా వయోజన విద్యా కేంద్రంలో చేరి ఒక పాఠం తీసుకోండి. తరువాత మీ పథకం ప్రకారం మీ పని సాగిద్దురు కాని" అని కోరింది శ్యామలాదేవి. ఈ ప్రతిపాదనకు వెన్వెంటనే అంగీకరించింది ముంతాజ్.

" రాబొయ్యే ఆదివారం మీ ఉపన్యాసం వుంటుంది " అని నిర్ధారణచేసి చెప్పింది శ్యామలాదేవి.

" అంతకన్నానా. మీ యీ సహాయాన్ని ఎన్నడూ మర్చిపోము " అని కృతజ్ఞత తెలిపింది ముంతాజ్.

" మన కార్యక్రమాలు ఒకదానికొకటి చేదోడువాదోడుగా ఉంటాయి. ఆచరణకు అవకాశంలేని సిద్ధాంతబోధ నిరుపయోగం. అది కుంటివానివంటిది. అలాగే సిద్ధాంతంలేని ఆచరణ నిష్ప్రయోజనం. అది గ్రుడ్డివాని వంతు. మన ఈ సమష్టి కృషివల్ల ఆ గ్రామం ఆదర్శ గ్రామం కావచ్చు " ఆశాభావం వెలిబుచ్చాడు రాధాకృష్ణ.

"మీలాంటివారి సహకారం దొరకడం మా అదృష్టం" అన్నాడు రవి.

" అసలే సమాజసేవకు పూనుకునేవారి సంఖ్య చాల తక్కువ. మరి వారిలో సఖ్యత లోపిస్తే ఎలా " అని ప్రశ్నించాడు రాధాకృష్ణ. అతని అభిప్రాయంతో ఏకీభవించాడు రవి. తరువాత సెలవు తీసుకొని వెళ్ళిపోయారు ముంతాజ్, రవి ఇద్దరూనూ.

## 16

శనివారం ప్రొద్దున రాధాకృష్ణ శ్యామలాదేవి వెంకట్రావు ఇంటికివచ్చారు. వెంకట్రావుకు వాళ్ళమీద ఏహ్యభావంవున్నా ఇంటికి వచ్చిన వారిని అమర్యాదచేయలేక ఆహ్వానించాడు. తమ కుమార్తె పుట్టినరోజు పండుగకు ఆ రోజు సాయంత్రం రావలసినదని రాధాకృష్ణ వెంకట్రావును ఆహ్వానించాడు.

'మీబోటి వారి ఇండ్లకు మా బోటి కులీనులు రావటమా' అని అందామనుకున్న వెంకట్రావుకు రాధాకృష్ణ గంభీరముఖంచూచి ఆ మాటలు పెగలలేదు.

"వస్తాంలెండి. రాక తప్పుతుందా. మనం ఇరుగుపొరుగు వాళ్ళం కదా!" అని మాత్రం అనగల్గాడు వెంకట్రావు.

విమలను ఆహ్వానించటానికి శ్యామలాదేవి లోపలకి వెళ్ళింది.

"మా అమ్మాయి పుట్టినరోజు వేడుక ఈ రోజు సాయంత్రం. మీరు తప్పక రావాలి" అని వేడుకకు పిలిచింది శ్యామలాదేవి.

విమల మూతి మూడువంకరలు త్రిప్పింది.

"మాకా యోగ్యతకూడానా" అని వెటకారంగా పలికింది విమల.

షాక్ తిన్నది శ్యామలాదేవి.

"అదేమిటి అక్కగారూ అలా అంటారు. మీబోటి పెద్దల ఆశీర్వచనం కావాలనేగా నేను వచ్చింది" వివరించింది శ్యామలాదేవి.

"అమ్మా! మీ వద్ధతులువేరు; మా పద్ధతులువేరు. మేమేదో పూర్వకాలపు వాళ్ళం! చాంధసులం. మీరేమో ఆధునికులు; క్రొత్త లోకిళ్ళు పొయ్యేవారు" ఈసడింపుగా వల్కింది విమల.

"ఇంతకూ మేము ఏమంత కాని పనులు చేశామండీ" ప్రశ్నించింది శ్యామలాదేవి.

"ఇంకా ఏం చెయ్యాలి తల్లీ. పెండ్లి పెటాకులు అక్కర లేకుండా కాపురాలు చేసేది చాలక పిల్లలను కనడంకూడాను" కుండ బ్రద్దలు కొట్టింది విమల.

" అదా ! మీ బాధ. హుష్. అంతేగదా ! చూడండి మీ కోసం మా పద్ధతులు మార్చుకోం. వేడుకకు మీరు వస్తే సంతోషిస్తాను. రాదల్చుకోకపోతే మీ ఇష్టం " అని చకచకా వాకిట్లోకి వచ్చేసింది శ్యామలాదేవి.

హాలులో కూర్చున్న రాధాకృష్ణనుచూచి 'రా కృష్ణా' అని పిలిచింది. ఇద్దరూ వెళ్ళిపోయారు త్వరత్వరగా.

శ్యామలాదేవి రాధాకృష్ణ కుటుంబరావు వాటావద్దకు పోయి తలుపు తట్టారు. కుటుంబరావు తలుపు తీశాడు. ఇద్దరినీ లోపలికి తీసుకొని వెళ్ళాడు.

రాధాకృష్ణ వచ్చిన సంగతి చెప్పాడు.

కుటుంబరావు ప్రయివేటు. లౌక్యుడు. ఎవరితోను విరోధం పెట్టుకోడు. అది అతని జీవిత విధానం. రాధాకృష్ణ పిలుపును తప్పక స్వీకరిస్తానని చెప్పాడు.

రాధాకృష్ణకు ఊరట కల్గింది. ఇక్కడకూడ అవమానంపాలు కావల్సివస్తుందేమోనని భయపడుతూ వచ్చాడు. అందుకు భిన్నంగా జరుగుతున్నందుకు లోలోన సంతోషించాడు. శ్యామలాదేవి ఇంట్లోకి వెళ్ళింది లలితను పిలవటానికి.

" లలితగారూ ! మా అమ్మాయి పుట్టినరోజు వేడుక ఈ రోజు సాయంత్రం మా ఇంట్లో. మీరువచ్చి చిరంజీవిని ఆశీర్వదించాలి " పిలిచింది శ్యామలాదేవి.

" అడ్డమైన వాళ్ళ ఇళ్ళకు నేను పోను " సమాధానం వచ్చింది లలితనుంచి.

మరోషాకు శ్యామలాదేవికి.

పిల్లలులేని లలిత చాల ఆప్యాయంగా మాట్లాడుతుందని తనను మన్నిస్తుందని ఆశించింది ఆమె. కాని కథ ఇలా అడ్డం తిరుగుతుందని శ్యామలాదేవి కలలోకూడ ఊహించలేదు.

కొద్దిక్షణాలకు ఆమె తెప్పరిల్లింది. "ఏమిటమ్మా లలితమ్మా! అసందర్భంగా మాట్లాడుతున్నావు. ఇంటికివచ్చిన వాళ్ళను గౌరవించేది ఇలాగేనా" నిక్కచ్చిగా అడిగింది లలితను.

"ఏం. అంటాను; అన్నాను. ఉన్నమాటే అన్నాను. కానిమాట ఏమీ అనలేదే? ఎందుకంత గింజుకుంటావు" పెద్దా చిన్నా తారతమ్యం లేకుండా మాట్లాడింది లలిత.

"ఎవరమ్మా అడ్డమైన వాళ్ళు? మాటలు జాగ్రత్తగా రావాలమ్మా" మందలించింది శ్యామలాదేవి.

"ఇంకా ఎవరని అడుగుతున్నావా? పెండ్లి గిండ్లీ లేకుండా కాపురంచేసే వాళ్ళని, ఇంకా ఏ పేరుపెట్టి పిలవాలి. నీవేచెప్పు" దబాయించింది లలిత.

"అదా నీ బాధ! పెండ్లి చేసుకొని రోజూ పోట్లాడుకుంటూ కాపురంచేసే వాళ్ళకన్న మేమేనయం" ఈసడించింది శ్యామలాదేవి.

"హూ" అంటూ విదిలించింది లలిత.

అక్కడ ఇంక ఒక్కక్షణం ఉండకుండా ఒక్క ఉదుటున వాకిట్లోకి అడుగువేసింది శ్యామలాదేవి.

ఆమె ఉగ్రస్వరూపం చూచి ఆమెను అనుసరించాడు రాధాకృష్ణ.

ఇంటికివచ్చిన శ్యామలాదేవి మనస్సు అకలావికలంగా ఉంది.

"ఛీ ఛీ! పాడు ప్రపంచం. తను సుఖంగా జీవించదు. ఇంకొకళ్ళను సుఖపడనీయదు" విసుక్కుంది శ్యామలాదేవి.

రాధాకృష్ణ ఆమెను అనునయించాడు.

"వ్యవస్థలో కుళ్ళుంది. కశ్మలంవుంది. దానిని కదిపితే దుర్గంధం వస్తుంది. దాని స్వభావమే అంత. నూతన వ్యవస్థ కోసం అర్రులు చాచేవారు అన్ని ఇబ్బందులకు లోనుకావాలి. నిందలకు తలవొగ్గాలి; తిట్లను సహించాలి. ఇంతకూ వారిననే పనేముంది; వారు అజ్ఞానంలో కొట్టుమిట్టాడుతున్నారు. వారిని జాలితో చూడాలి కాని వారిని ద్వేషిస్తే లాభంలేదు" తన మనోగత భావాలను శ్యామలాదేవికి ఎరుకపరిచాడు.

"అదికాదు కృష్ణా! మనం వాళ్ళని బాధపెట్టడం లేదుకదా! వాళ్ళు మనల్ని ఎందుకు హింసించాలి? ఇదే నా ప్రశ్న" శ్యామలా దేవి రాధాకృష్ణను సందేహనివృత్తి చేయమన్నది.

"శ్యామా! ఇంత తెలిసినదానివి. నీవూ అజ్ఞానంలోపడి పోతే ఎలా? బురదలో మునిగినవాడు అది అసౌకర్యమని అను కోవటంలేదు. తన స్థితే మంచిదని తలపోస్తున్నాడు. అందువల్ల ఒడ్డునవున్న నిన్ను అసహ్యించుకుంటాడు; ఈసడిస్తాడు. నిందిస్తు న్నాడు అంతే."

రాధాకృష్ణ వివరణ శ్యామలాదేవికి మనశ్శాంతి కలుగజేసింది.

ప్రపంచంలో నిండినిబిడీ కృతమయిన అజ్ఞానాన్ని చూచి ఇద్దరూ నవ్వుకున్నారు.

# 17

కుగ్రామంలో ఊరికి చివరగా ఒక చిన్న గుడిసె. అందులో మలక మంచంమీద మోహన్ పడుకొనివున్నాడు. ప్రక్కన ముక్కాలి పీటమీద దుర్గ కూర్చున్నది. మోహన్ నిద్రపోతున్నాడు. అతని వంక తదేక దీక్షతో చూస్తూవున్నది దుర్గ.

కనులు తెరచి మూలిగాడు మోహన్.

"బాధగావుందా?" దుర్గ ప్రశ్నించింది.

"లేదు"

"మరి ఎందుకు మూలుగుతున్నావు"

"మనోబాధ"

పక్కున నవ్వింది దుర్గ. ఆ నవ్వులో పదివేల మల్లెలు చోటు చేసుకున్నాయి. శ్రావ్యమైన కంఠమేమో గండశిలలపై ప్రవహించే సెలయేటి నీటి ధ్వని వినిపించింది. చకితుడైనాడు మోహన్.

"చెప్పమంటావా? నా బాధ తెలిసికోవాలని నీకుందా?" ప్రతిప్రశ్న వేశాడు. మోహన్.

"నాకుగాక నీ బాధను గురించి మరెవరికి అవసరం?" ఆత్మవిశ్వాసంతో పలికింది దుర్గ.

"అయితే చెప్తావిను. నీలాంటి ధనవంతుల ఇంటిపిల్ల. నీలాంటి విద్యావంతురాలు ఇలా ఒక పూరిగుడిసెలో అజ్ఞాతంగావడివున్న నాకు ఉపచర్యలు చెయ్యటం చూస్తే నాకు బాధకలగడం అసహజం అవుతుందా? నిన్ను ఇన్ని ఇక్కట్టుల పాలుచేసినందుకే నాకు మనోవ్యథ."

దుర్గమనస్సు రెండుభావాలతో నిండిపోయింది. ఏ మోహన్‌ను ఇవ్వాళ్ళ తను కంటికి రెప్పలా కాపాడుకుంటూ వచ్చిందో ఆ మోహను ఇవ్వాల్టికి పూర్తిగా ఆరోగ్యాన్ని పొందాడు. ఇది ఒక సంతృప్తి. అంతేకాదు ఆ మోహన్ మనస్సు తన యెడ కృతజ్ఞతా భావంతో పురివిప్పి నాట్యమాడుతోంది. ఇది ఆనందానికి కారణం. జీవితంలో ఎన్నో పనులు చేస్తుంటాము. కొన్ని మంచివి కొన్ని చెడ్డవి. మంచి పనులన్నీ ఫలించవు. ఒకవేళ వాటివల్ల మన మాశించింది జయప్రదమైనా ఏ వ్యక్తి శ్రేయస్సు కోసం మనం ఆరాటపడతామో ఆ వ్యక్తి మనల యెడ దుర్మార్గంగా ప్రవర్తించవచ్చు. జీవితం కడు విచిత్రమైన మెలికలతో మలుపులతో సాగిపోతుంది. దాని గతిని ఇదమిద్ధమని పూర్తిగా మనం ఎవ్వరమూ స్పష్టంగా నిర్దుష్టంగా చెప్పలేము. కనుకనే జీవించడంలో ఒక రంజు, ఒక అభిరుచివున్నాయి. లేకపోతే జీవితం చాల విసుగు జనించేదిగా తయారవుతుంది. ఇలా తలపోస్తూ కూర్చున్న దుర్గకు-

"దుర్గా" అనే పిలుపు కర్ణరసాయనంగా తోచింది. ఆ పిలుపుతో ఈ ప్రపంచంలోకి వచ్చింది దుర్గ. ఉలిక్కిపడింది ఆ పిలుపులోని మార్దభావానికి. స్పందించకుండా ఉండలేకపోయింది.

"మోహన్! పిలిచావా"

"దుర్గా! నీకు నామీద ఎందుకింత సానుభూతి"

"నా పిచ్చి మోహన్! ఏమిటా ప్రశ్న. మనిషికి మరో మనిషిమీద సానుభూతి ఉండటంలో ఆశ్చర్యంగావుందా?"

"అది మామూలు విషయం. కాని నీవు ఒక అసాధారణ ప్రజ్ఞకల యువతివి - నాపై - అజ్ఞాతవాసంలో కొట్టుమిట్టాడుతున్న నా మీద - ఎందుకింత దయ, జాలి చూపిస్తున్నావు?"

"మోహన్ ! మనిద్దరం ఒక ఊరివారం. అంతేకాదు, స్పష్టమైన జీవితలక్ష్యాలు కలవాళ్ళం. కాకపోతే మార్గాలు వేరువేరు. కాని త్రికరణశుద్ధిగల వ్యక్తి బాధకులోనయితే, చిత్తశుద్ధిగల వ్యక్తి తనకేమీ పట్టనట్లు ఊరుకోగలదా ? అలా పట్టీపట్టనట్లు ఉండటం అసంభవం ; అసహజం."

"దుర్గా ! నిన్ను ఇప్పుడు అర్థంచేసుకున్నాను. ఇన్నాళ్ళూ నీ ఋణం ఎలా తీర్చుకోవాలా అని బాధపడుతున్నాను. ఇక ఆ ప్రశ్న ప్రసక్తేలేదు. నీవు నీ చిత్తవృత్తికి అనుగుణంగా సంచరిస్తున్నావు. నేను నా మనోభావాలననుసరించి జీవయాత్ర సాగిస్తున్నాను. కనుక ఇందులో ఋణానుబంధ ప్రసక్తిలేదు. అంతేగా నీవనేది ?"

"అవును మోహన్ అంతే. మానవనైజమే అంత. ఒకరిని చూస్తే మొట్టబుద్ధి పుట్టుంది. మరొకరినిచూస్తే ముద్దుపెట్టుకో మనవవుతుంది. ఎందుకంటే వెంటనే చెప్పలేము. కాని ప్రతి మనో భావం వెనుక ఏదో అగాధమయిన విషయముంటుంది. అయితే వాటికి కారణ కార్య సంబంధం వుండకపోదు ; వుంటుంది. కాని బహిర్గతంకాదు. ఇదీ ఒక విచిత్రమే ?"

"నన్ను చూస్తే ముద్దు పెట్టుకోవాలనిపిస్తుంది కదూ ?"

"మోహన్ ! ఏమిటా చిలిపి ప్రశ్న ?" సిగ్గుపడింది దుర్గ.

"ఏమన్నా తప్పుగా మాట్లాడానా ? నీవన్నదే నేను అన్నాను."

"నా మోహన్ తప్పు మాట్లాడడు."

"అయితే సరిగానే మాట్లాడానన్నమాట."

దుర్గ మౌనంగా ఉంది.

" నేను కరెక్టుగా మాట్లాడినట్లు రుజువేమిటి ? నీకర్తవ్యాన్ని నెరవేర్చటమే కాదు నాపై ప్రేమ విశ్వాసాలున్న దానివి " అంటూ దుర్గను కళ్లతో తనివితీరా చూచాడు మోహన్.

దుర్గ చటుక్కున మోహన్ మీదికి వంగి అతని చెంపలపై ముద్దు పెట్టుకున్నది. అనుకోని ఈ సంఘటనకు జ్వలితుడయ్యాడు మోహన్.

" దుర్గా ! నీఅభిమానం నన్ను పులకింప చేస్తున్నది. నాబోటి నిర్భాగ్యుడు నీబోటిదాని ప్రేమకు పాత్రుడవటం విశేషం."

దుర్గకూడా చలించింది ఆ ముద్దుతో. పురుషస్పర్శ ఆమెకి ఇదే మొదటిసారి. ఆమె ఆలోచించి అతనిని ముద్దిడలేదు. అతనడిగే కొంటె ప్రశ్నలకు చిలిపి జవాబుగా అలా చేసింది. కాని దానికి ఇంత అనుభూతిని కల్గించే శక్తి ఉంటుందని శరీరాన్ని వివశం చేస్తుందని ఆమె ఊహించలేదు. ఏదో మైకం తన్ను ఆవహిస్తున్నది. మరో ప్రపంచంలోనికి అడుగు పెట్టున్నట్లుగా ఆమెకు తోస్తున్నది. మనసు దిటవు చేసుకోవాలని ప్రయత్నిస్తున్నది ఆమె. కాని మనస్సుకూడా ఒకచోట నిలవటంలేదు. " మోహన్ ! మోహన్ " అనే మాటలే తన మనస్సునంతా ఆవరించాయి. ఇంతలో

" దుర్గా ! దుర్గా ! ఏమిటి అలా ఊగిపోతున్నావు. పడి పోగలవు సుమా !" హెచ్చరించాడు మోహన్.

జవాబులేదు దుర్గనుండి.

ఆమె మనో నేత్రాలు మరో లోకంలో విహరిస్తున్నాయి. ఆమె కనులు మూసుకొనివున్నాయి. ఏదో రసానుభూతిని పొందుతున్నట్లు ఆమె ఊగిపోతున్నది. ఆమె పడిపోతుందేమోనని

అమెను మంచం మీదికి లాక్కున్నాడు మోహన్. ఆమె అతని బాహుబంధంలో ఇమిడిపోయింది. ఆమెను తన హృదయానికి హత్తుకున్నాడు మోహన్.

"మోహన్!" అస్పష్టమైన పిలుపు ఆమె పెదవులనుండి వెలువడింది.

"దుర్గా!" అంటూ ఆమెను తన శరీరంతో పెనవేసి బంధించాడు మోహన్. అలాంటి ఐక్యతానుభూతిని అనుభవించటం వారికి ఇదే మొదటిసారి. ఏక శరీరులయినారు దుర్గామోహన్‌లు.

విడివడిన తరువాత ఒకరి ముఖాన్ని మరొకరు చూడటానికి సిగ్గుపడ్డారు. కాని బాధపడలేదు. దుర్గ గుడిసె వెలుపలికి వెళ్ళిపోయింది.

## 18

ఆనాడు కుటుంబరావు సాయంత్రం త్వరగా ఇంటికివచ్చాడు. కోర్టులో కేసులు వెంటనే వాయిదా పడ్డాయి. క్రొత్త కేసులు ఏమీ తగలలేదు. ఇంట్లో భార్యతో సరదాగా కాలక్షేపం చేద్దామని వచ్చేశాడు హుటాహుటిన ఇంటికి. తనకు రాజుకు జరిగే స్వాగతం జరుగుతుందని ఊహించాడు. తన భార్య తను త్వరగా ఇంటికి వచ్చినందుకే తనను ఎంతో మెచ్చుకుంటుందని తలపోశాడు. వాకిలి తలుపు తీయగానే తన భార్య తన కౌగిలిలో ఎలా ఒదిగిపోయేదీ ఊహించుకొని ఆనంద డోలికలలో ఊగిపోయాడు. ఇంటికి చేరాడు. తలుపు తట్టాడు జవాబులేదు.

"లలితా! లలితా!"

ఎంత పెద్దగా అరిచినా తలుపులు విడివడలేదు.

"ఏయ్ నిన్నే! వినవడటంలేదూ! అబ్బ ఏమి మొద్దు నిద్దర" అంటూ తలుపులు దబదబా బాదాడు.

వాకిలి తలుపులు విడివడ్డయి.

మసక చీకటి. ఏమీ కనవడటంలేదు. తన భార్యలాంటి ఆకారం గోచరం కాలేదు.

కన్నులు తుడుచుకొని అలాగే తన గదికి చేరుకున్నాడు. చొక్కా ఉత్తరీయం తీసి చిలకకొయ్యకు తగిలించాడు. దొడ్లోకి వెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కొనివచ్చాడు. తన సతీమణి కాఫీతో సాక్షాత్కరిస్తుందని ఊహించాడు. తన ఆశలు అడియాసలయ్యాయి. లలితకోసం ఇల్లు అంతా గాలించాడు. వంటఇంట్లో నేలమీద పడుకొన్న లలిత కనుపించింది.

దగ్గరగా చేరాడు.

"ఏం తల నొప్పిగా ఉన్నదా? మందు వేసుకోలేక పోయావు" పలకరించాడు కుటుంబరావు ఆప్యాయత తొణికిసలాడే కంఠధ్వనితో.

"నా సంగతి మీ కెందుకు. మీకు సుష్టుగా జరిగిపోతున్నది కదా! నా ఊసెందుకు?"

"లలితా! లేచి రా. బట్టలు మార్చుకో. డాక్టరు దగ్గరకు వెళ్ళివద్దాము."

"బజారుకు వెళ్ళడానికి అందరూ నోచుకోవద్దూ? ఈ వట్టి మెడతో ఎలా ఊరేగను? ఎన్నాళ్ళు ఊరేగను?"

"ఓస్! అదా! నగలులేవని నీ బాధ. అంతేకదూ. అయినా ఈ రోజుల్లో నగలు పెట్టుకోవటం ఫ్యాషనుకాదు"

"నపుంసకుడు పాతివ్రత్యాన్ని భార్యకు బోధించినట్లు నగలు చేయించలేనివాడి భార్యకు నగలు లేకపోవటం పరిపాటి" అంటూ ఎత్తిపొడిచింది లలిత.

"నోరు క్రొవ్వి మాట్లాడుతున్నావు జాగ్రత్త."

"నేను ఏం కానిమాట అన్నాను. వెంకట్రావుగారి భార్య శ్రావణశుక్రవారం నోమురోజున వంటు ముత్తయిదువులాగా ఆమె నడయాడుతూంటే చూడముచ్చటయింది."

"చూడు లలితా! వెంకట్రావుగారు పేరు ప్రఖ్యాతులున్న ప్లీడరు. పైగా పబ్లిక్ ప్రాసిక్యూటరు బోలెడంత ప్రాక్టీసు. ధనలక్ష్మి గలగలా శబ్దంచేస్తూ వారి గడపవద్ద నాట్యంచేస్తూ ఉంటుంది. వారికీ మనకూ సామ్యం ఏమిటి? వారితో మనం పోటీపడటం తెలివి తక్కువ." ఇలా గంభీరంగా ఉపదేశం చేశాడు కుటుంబరావు.

"చేతగాని తనానికితోడు మాటలుకూడాను. ఇంతకూ అవతలి మనిషిమీద అభిమానం ఉంటేగా నగలు చేయించటానికి? ఈసడించింది లలిత.

"నగలు చేయించకపోతే మొగుడుమీద అభిమానం చూపించలేని నీ పోటిదాన్ని చెప్పాలి పతివ్రతల జాబితా చదివే టప్పుడు." అవహేళనచేస్తూ అరిచాడు.

"అవును. నేను పతివ్రతనుకాదు. నీవే శ్రీరామచంద్రుడివి. ఎందుకయ్యా అలా పేట్రేగిపోతావు?"

"ఛీ! ఛీ! నీతో మాట్లాడేదానికన్నా బావిలోపడి చచ్చేది మేలు" అంటూ ఇల్లువదలి పోవటానికి వరండాలోని నడిచాడు కుటుంబరావు.

లలితకు భయం పట్టుకుంది. కుటుంబరావు అన్నంత పనిచేసి ఇల్లువదిలిపోతాడని ఆమెకు గట్టి అనుమానం కలిగింది. దానితో ఆమె గావుకేకలు ప్రారంభించింది.

"అయ్యో! నన్ను వదలిపెట్టి పోతున్నాడే నా భర్త. నన్ను అన్యాయంచేసి పోతున్నాడే!" ఈ కేకలువిని వెంకట్రావు, విమల చకచకా కుటుంబరావు వాటా వాకిట్లోకి చేరుకున్నారు. ఉత్తరీయం బుజానవేసుకొని చెప్పులు టకటక లాడించుకుంటూ వాకిట్లోకి పోవటానికి సిద్ధంగా ఉన్నాడు కుటుంబరావు.

"కుటుంబరావుగారూ! ఎక్కడికి ప్రయాణం?" అంటూ పల్కరించాడు వెంకట్రావు.

"ఈ ఇంట్లో వేగలేకపోతున్నానండీ. అందుకని ఎక్కడికైనా లేచిపోదామని పోతున్నాను" అన్నాడు కుటుంబరావు.

పరిస్థితి అర్థమయింది వెంకట్రావుకు.

"భార్యను అదుపులోపెట్టుకోమని వెంకట్రావు కుటుంబరావుకు సలహాచెప్పి వెళ్ళిపోయాడు. విమల భర్తను అనుసరించింది.

## 19

ప్రతిపక్షాలవారూ, అనేక ఉద్యమాలవారూ చేసిన ఆందోళన ఫలితంగా మోహన్ మొదలయిన నాయకులపై వారంట్లు రద్ద యాయి. మోహన్ అజ్ఞాతవాసంనుండి బయటికివచ్చాడు. తన

మామూలు కార్యక్రమాలే కాకుండా కార్మికోద్యమంలో కూడ వేలు పెట్టాడు. అతడికి తీరిక ఉండటంలేదు; విధి విరామం లేకుండా చేతినిండా పని.

దుర్గ మళ్ళీ డ్యూటీలో చేరింది. పేరుకున్న పాతపని అంతా చకచకా పూర్తిచేసింది. ఉద్యోగంలో తిరిగిచేరిన ఇరవై రోజులకు గాను ఈ రోజు ఆమెకు తీరికలభించింది. ఇంతలో అటెండరువచ్చి-

"ఎవరో మీ కోసం వచ్చారమ్మా! మిమ్మల్ని వెంటనే చూడాలంటున్నారు" అన్నాడు.

"వెంటనే ప్రవేశపెట్టు" అన్నది.

ఏబదియైదేండ్ల ప్రాంతం వయస్సువున్న పెద్దమనిషి ఆయన. పల్లెటూరి వ్యక్తి అని తోస్తుంది చూచేవారికి.

"నాన్నగారూ!" అంటూ అప్రతిభురాలై నిల్చింది దుర్గ.

"అమ్మా! నీతో మాట్లాడేందుకు అర్జంటుగా వచ్చాను" అన్నాడు ఆయన.

తండ్రిని ఇంటికి తీసుకెళ్ళింది దుర్గ. ఆయన ఇల్లంతా కలయజూచాడు. ఒంటరి ఆడదాని ఇంట్లో ఏముంటాయి కనుక.

"ఏమమ్మా ఇల్లంతా బోసిగావుందేం"

"నాన్నగారూ! నాకు పటాటోపం ఎందుకు? ఒక్కత్తెను. ఎలా చేసుకున్నా సరిపోతుంది."

"అందుకేనమ్మా నేను వచ్చాను. ఇలా ఒంటరి జీవితం బిక్కుబిక్కుమంటూ నీవు గడపటానికి వీలులేదు ఇకముందు."

దుర్గ తండ్రి మాటలభావం గ్రహించింది. పెండ్లిచేసుకోమని బలవంతం చేయటానికి వచ్చాడు ఆయన. అందులో సందేహం

లేదు. ఆయన మనస్సుకు కష్టంలేకుండా చెప్పి పంపివెయ్యాలి. అందుకు ఒకప్లాను ప్రకారం నడవాలి లేకపోతే కుదరదు. ఇలాంటి ఆలోచనలతో తండ్రికి జవాబు చెప్పింది.

"నాన్నగారు! ఇంతకు మీరనేది ఏమిటి? వివరంగా చెప్పండి."

"ఏమీ విడ్డూరమైనదేమీ కాదమ్మా! నీవు వివాహం చేసుకోవాలని నేనూ, మీ అమ్మా కోరుకుంటున్నాం."

"ఒకవేళ నేను అంగీకరించాననుకోండి. ఇంత అర్జంటుగా వరుడు దొరకద్దూ. తీరికగా ఆలోచిద్దాంలెండి నాన్నగారూ!"

"అమ్మాయి దుర్గా! నీవు అలా అంటావని నాకు తెలుసు. అందుకే సంబంధాన్ని వాకబుచేసుకొని వచ్చాను. మన ప్రక్కింటి వాళ్ళ వేలు విడిచిన మేనల్లుడు అమెరికాలో న్యూయార్క్ స్టేట్‌లో ప్రొఫెసరుగా ఉంటున్నాడట. నెలకు ముప్పయివేల రూపాయలు జీతమట. పిల్లవాడు బాగుంటాడట. నీకిష్టమయితే చూపిద్దామని.... మళ్ళీ ఆ అబ్బాయి పదిహేను రోజులలో వెళ్ళిపోతాడట. ఆ మాట నీకు చెప్పిరమ్మనమని మీ అమ్మ పంపించింది నన్ను జరూరుగా."

"నాన్నగారూ ఈ అమెరికా సంబంధాలు నాకు వచ్చవు. అక్కడ ఆ అబ్బాయి ఎలాంటి జీవితం గడుపుతున్నాడో మనకు తెలియదుకదా! అదీగాక పదిరోజుల్లో ఎలా తేల్చుకుంటారు వధూవరులు. పెండ్లాన్ని ఎంపిక చేసుకోవటమంటే బజారుకెళ్ళి చీర ఎంపికచేసిన తీరా అది. ఒకరి గుణగుణాలు మరొకరికి తెలియాలి. ఒకరి జీవిత లక్ష్యం, ఆదర్శం ఏమిటో రెండవవారికి తెలియాలి. ఇద్దరికీ ఆసక్తిదాయకమైన కొన్ని విషయాలు ఉండాలి. ఇద్దరి మధ్యా పరస్పర అభిమానం, గౌరవం ఏర్పడాలి. ఇవేమీ లేకుండా

సాయంత్రానికి పెండ్లికి సిద్ధం కావడమంటే నా వల్లకాదు బాబూ!" అంది దుర్గ ధృఢంగా.

ఆయనకు తన కుమార్తె విషయం బాగా తెలుసు. ఆమె వజ్రసంకల్పురాలని ఆయనకు మొదటినుంచీ తెలుసు. ఈ మాట అనుకుంటే ఒకరకంగా ఆయనకు సంతోషం. తన కూతురుకు తన లక్షణాలే వచ్చాయని ఆనందం. తన కూతురు ఇలా అన్న ప్రతి పాదవలను త్రోసివేసి ఒంటరి జీవితం గడుపుతూ వున్నదే అనిబాధ. ఈ రెండు భావాలు ఆయన మనస్సును తికమక పెట్టినయి.

ఈ అంశాన్నే మరియొక కోణంనుండి చూడమని ఆమెను కోరితే ?

" పోనీలే అమ్మా ! నీకు ఇష్టంలేని పని చెయ్యమని నేను చెప్పను. కాని నీకు నచ్చిన మనిషివుంటే అతని పేరుచెప్పు. నేను సంబంధం స్థిరం చేస్తాను " అన్నాడు తండ్రి.

" నాన్నగారూ నేను ఆ అదృష్టానికి నోచుకోలేదు. నేను ఒకతనికి మనసిచ్చాను. కాని ఆయన మనస్సు అన్యాసక్తంగా ఉంది. ఈ పరిస్థితులలో .... ...."

" ఎంత బాధ వచ్చిందే తల్లీ నీకు. ఎప్పుడూ ఎవరికీ చెడు తలపెట్టని దానివి. అందరికీ తలలోనాలుకగా మెదిలేదానివి. అందరి ఆనందంకోసం ఆలమటించే దానివి. అలాంటి నీకు .... ...."

" నాన్నగారూ ! ఇటువంటి విషయాలలో తొందరపడి ప్రయోజనంలేదు. కాలమే అన్నిటిని చక్కపరుస్తుంది. అతమనస్సు మారవచ్చుకదా ! వేచివుంటాను " అన్నది దుర్గ.

ఇక ఆ విషయాన్ని తరచకూడదనుకున్నాడు తండ్రి.

"సరేలే అమ్మా! నీ ఇష్టప్రకారమే కానియ్యి. నేను నిన్ను ఇంకెప్పుడూ తొందరపెట్టను. కాని ఈ మాటవింటే నీ తల్లిగుండె చెరువవుతుందమ్మా!" అని ఆక్రోశించాడు.

"నాన్నగారూ! అమ్మను ఓదార్చవలసిన బాధ్యత మీది. తల్లిదండ్రులను సుఖపెట్టలేని నిర్భాగ్యురాలిని. నన్ను ఇలా వదిలి వేయండి" అన్నది గట్టిగా దుర్గ.

మరునాడు ఆమె తండ్రి తన ఊరికి వెళ్ళిపోయాడు మళ్ళీ పెళ్ళి ప్రస్తావన చేయకుండా.

# 20

మహిళా సంఘంలో ఒక పెద్ద ఉపన్యాసం వుందని లలితా విమలలు వున్న వీధిచివర కాపురముంటున్న సంఘసేవకురాలు ఒకామె వీళ్ళిద్దరినీ బలవంతంచేసి దానికి తీసికెళ్ళింది. అచ్చట అచ్చం హిందూనారీ వేషంలోనున్న ఒక సుందరి ఉపన్యసిస్తున్నది. ఆమె మాటలు వింతగా తోచాయి లలితా విమలలకు. శ్రద్ధగా వినడం సాగించారు. మైకులో ఆమె కంఠం పలుకుతున్నది.

"ఇద్దరు స్త్రీ పురుషులు పరస్పర సమ్మతితో ఇద్దరి అభ్యుదయం కోసం కాపురం చేయటానికి ఇష్టపడితే అది వివాహంగా పరిణమిస్తుంది. ప్రతి వ్యక్తికీ ఒక ఆలోచనా సరళి, ఒక జీవిత తత్వమూ ఉంటాయి. తమకు అలాంటి భావాలున్నాయని వారికి తెలియకపోవచ్చును కాని పూసల పేరులోని దారంలాగా ఏదో ఒక జీవితతత్వం ఉంటుంది. ఆలుమగల దృష్టిపథాలు ఒక్కొక్కపుడు వేరుగా ఉండవచ్చును. అలా ఉన్నప్పటికీ వారు ఒకరు మరి యొకరిని గౌరవించుకుంటూ కాపురం చేయాలి. సహనం, సర్దుకు

పోవడం జీవితం సుగమంగా సుఖంగా నడవటానికి మూల సూత్రాలు. అయితే వాటిని పాటించే బాధ్యత ఎప్పుడూ స్త్రీ నెత్తినే వేయరాదు. అది ఇరువురికీ వర్తించే సూత్రం."

ఉపన్యాసం ముగిసింది. ఉపన్యాసకులు కావాలనే క్లుప్తంగా మాట్లాడారని ఎవరైనా ప్రశ్నలువేస్తే సమాధానాలు చెప్పే సందర్భంగా వారు విపులంగా మాట్లాడతారని అధ్యక్షులు సెలవిచ్చారు.

విమలకు ఒక సందేహం కల్గింది. కాని తనెప్పుడూ సభలలో మాట్లాడి ఎరుగదు. ఆ మాటకువస్తే సభకు రావడం ఇదే ప్రథమం. సభ అంతా ఇటూఅటూ కలయజూచింది. అందరూ స్త్రీలే కనబడ్డారు. అంత గుండె దిటవుచేసుకొని ఒక ప్రశ్న వేసింది.

"భర్త చెప్పినట్లు సర్వదా వినటమే పతివ్రతా లక్షణంగా పేర్కొన్నారు కదా! మీరు ఇపుడు మరో రకంగా చెప్తున్నారే!"

"అలా చెప్పినమాట వాస్తవమే; అలా వాగుతున్నమాట నిజమే. కాని ఆమాటచెప్పింది ఎవరు? పురుషులు. వారికి అనుకూలంగా వారు చెప్పారు. అదే విషయాన్ని స్త్రీ చెప్పవలసి వస్తే భార్యమాట జవదాటనివాడు, పత్నీవ్రతుడని చెప్పివుండేది. ఆమె శాసించగలిగితే భర్త ఆమె చెప్పినట్లు విధేయుడుగా నడుచుకునేవాడు." సమాధానం చెప్పింది ఉపన్యాసకురాలు.

"అయితే అలా స్త్రీలు పురుషులను శాసించాలని మీభావమా?" మళ్ళీ ప్రశ్నించింది విమల.

"కాదు. ముమ్మాటికీకాదు. తప్పు ఎవరు చేసినాతప్పే. అసలు సుఖవంతమైన కుటుంబంలో ఒకరు మరియొకరిని శాసించటమనే

ప్రసక్తిరాదు. పరస్పర సమ్మతి మీద అన్ని వ్యవహారాలు జరిగిపోతాయి."

సందేహనివృత్తి చేసుకునే వంతు ఈసారి లలితకు వచ్చింది.

"భార్య ఏదైనా కోరిక కోరితే భర్త బండగా నిరాకరిస్తే కుటుంబం సాఫీగా సాగిపోతుందా?"

"సాగిపోదు. భార్య కోరిక భర్తకు నచ్చకపోతే ఎలా అది అసమంజసమో అతడు ఆమెకు నచ్చచెప్పవచ్చును. కాని బండగా మొద్దుగా ససేమిరాకాదు అనటం భావ్యం కాదు."

ఈ సమాధానం విమలను కొంత అస్తుబిస్తుచేసింది. ఇంతలో సభలోనేవున్న మరో స్త్రీ ఇలా అడిగింది.

"భార్యలు అసమంజసమైన కోర్కెలు నెరవేరాలని పట్టుపడితే వాటిని తిరస్కరించే అధికారం భర్తలకు ఉండవద్దా?"

"సమంజసం, అసమంజసం అని తేల్చవలసినది ఎవరు? ఇరువురూ కాదా? ఏకపక్షంగా అలా నిర్ణయించటానికి అతనికి ఎవరిచ్చారీ అధికారాన్ని" ఎదురు సవాలుచేసింది ఉపన్యాసకురాలు.

"ఇన్నాళ్ళనుండీ అలాగే జరిగిపోతున్నది కదా!" అన్నది విమల.

"ఇన్నాళ్ళనుండీ అలా అక్రమంగా జరిగిపోతున్నది కనుకనే ఇపుడు ఆ పరిస్థితి మారాలంటున్నాం" వివరించింది ఉపన్యాసకురాలు.

విమలకిదంతా క్రొత్తగావుంది. క్రొత్త కళ్ళజోడుతో ప్రపంచాన్ని చూస్తున్నట్లు తోచింది. ఏమిటో అన్నీ సందేహాలే

వస్తున్నాయి ఇపుడు. ఇన్నాళ్ళనుండి ఈ ఆలోచనలు తనకెందుకు రాలేదు ? ఇపుడు తనకేమయింది. చక్కగా ఆరుగురు పిల్లల తల్లి అయి పూజలు పునస్కారాలు, నోములు వ్రతాలు చేసుకుంటూ, భర్త తీసుకొనివెళ్ళిన సినిమాచూస్తూ, ఆయన వెంటబెట్టుకొని వెళ్తే తీర్థయాత్రలకుపోతూ కాలక్షేపం చేస్తున్న తనకు తన భర్త ఏం లోపం చేశాడు. తను అడిగి అడగకుండానే అన్నీవచ్చి ఇంట్లో పడుతున్నాయికదా ! ఇపుడు ఈ క్రొత్త నిర్వచనాలు ఏమిటి ? ఈ క్రొత్త ప్రయోగాలేమిటి ? ఇదేదో చాల వింతగావున్నది. పోనీ ఉపన్యాసకురాలు చెప్పింది తప్పనీ తోచటంలేదు. అంతా అయోమయంగా వుంది. అసలు తను ఎందుకు వచ్చినట్లు ఈ సభకు. కడుపులో చల్ల కదలకుండా కూర్చొని కాలక్షేపం చేస్తున్న తనకు ఈ సభలేమిటి ? ఇలా మనసులో తర్కవితర్కం చేసుకుంటున్న విమలకు మరొక్క ప్రశ్న అడగాలని తోచి - - -

" ఏమండీ ! ఒక్కమాట. భార్యలకు స్వేచ్ఛలేదని మీరంటున్నారు. వారికి ఇంటి వ్యవహారాలలో పూర్తి స్వేచ్ఛ ఇచ్చి వారిని గృహలక్ష్ములను చేశామని భర్తలు అంటున్నారు. మరి మీ వాదానికి రుజువేమిటి ?" అని అడిగింది.

ఈ ప్రశ్న యిచ్చిన సదవకాశాన్ని వదులుకోగూడదని ఉపన్యాసకురాలు తలపోసింది.

" మీరు అడగాల్సిన ప్రశ్నే అడిగారు. నేను మీకు చిట్కా చెపుతాను. నగరంలో అనేక మళయాళ చిత్రాలు నడుస్తున్నాయి. అవి అసభ్య అశ్లీల చిత్రాలని పత్రికలు వాటిని తెగనాడుతున్నాయి. అందులో ఒక్క సినిమాకు మిమ్మల్ని తీసుకొని వెళ్ళమని మీ భర్తను కోరండి. తరువాత జరిగే సంఘటనే మీ ప్రశ్నకు జవాబును ఇస్తుంది."

ఇక విమలకు ప్రశ్నలు మిగలలేదు.

ఇంతసేపూ లలిత శ్రద్ధగా వింటున్నది. ఆమె మనస్సులో ఒకేఒక ప్రశ్న మెదులుతున్నది.

" భార్య ప్రతిపాదనను, లేక సలహాను, లేక కోరికను భర్త దురహంకారంతో త్రోసిపుస్తే ఆమె ఏం చేయాలి ?"

" ఇది చాల క్లిష్టమైనసమస్య. దీనికి పరిష్కారం ఎవరికివారే కనుగొనాలి. కాగా కొన్ని సూచనలు చేయవచ్చు. వాటిని గురించి ఆమె భర్తతో చర్చించటానికి పూనుకోవచ్చు. సహనంతో అతనికి నచ్చజెప్ప కొనవచ్చు. అతడు వినడానికి నిరాకరిస్తే అంత అహంకారం ఎవరికీ పనికిరాదనికూడా చెప్పవచ్చు. అంతగా వినక పోతే రెండేరెండు మార్గాలు. సమస్య తీవ్రమయినదయితే అతనిని విడనాడటం, సమస్య చాల చిన్నదయితే సర్దుకుపోవటం. మరో మార్గంలేదు."

ప్రశ్నలను ఇంతటితో ముగిద్దాము అని అధ్యక్షురాలు సభను ముగించింది. విమలా లలితలు ఉపన్యాసకురాలి పేరు శ్రోతలలో ఒకరిని అడిగి తెలుసుకున్నారు. ఆమె పేరు ముంతాజ్‌అట. ఆమె ఒక హిందువును పరిణయమాడిందట. ఆలుమగలిద్దరూ వ్యవసాయ విశ్వవిద్యాలయంలో ఉద్యోగంచేస్తూ రాజీనామాలిచ్చి సమాజసేవ చేస్తున్నారట నగరానికి దగ్గరలోవున్న కుగ్రామంలో.

ఈ విషయాలు తెలిసికొన్న విమలా లలితకు ఆశ్చర్యం కలిగింది. ప్రేమ అంత బలీయమైనది కాబోలు. తమ మతస్థులను వదలి మరియొక మతస్థుని వివాహమాడే వరకు తెచ్చింది. మామూలుగా అయినవాళ్ళలోనే సంబంధాలుచేస్తారు తమ ఇళ్ళల్లో.

అలాంటిది పరాయి మతంవాడిని వివాహం చేసుకోదలచడం ఎంత సాహసం? ప్రేమ అనే పదానికి ఇన్నాళ్ళనుండి తాము చెప్పుకునే అర్థానికి, ఉపన్యాసకురాలి జీవితాన్ని మలిచే ప్రేమ సూత్రానికి పొంతన కుదరడంలేదు.

విమల నాలుగోక్లాసువరకేచదివింది. కాగా లలిత ఎస్.ఎస్.సి. చదివినందువల్ల ఆమెకు ఇలాంటి భావాలు కొంతగా కొంత పరిచయమే. కాని వాటి అంతరార్థాన్ని గురించి ఆమె ఏనాడూ ఇంతగా ఆలోచించలేదు.

విమలా లలితలు ఇంటిముఖం పట్టారు. కాని వారి చెవులలో తాము విన్న ఉపన్యాసం తాలూకు మాటలే ప్రతిధ్వనిస్తున్నాయి. ప్రేమ, వివాహం, సర్దుకుపోవడం, సహనం, పురుష దురహంకారం, మొండి భర్తను విడనాడటం ఇవన్నీ వారి మనస్సులో నిండి పోయాయి. 'అమ్మో! ఇలా ఆలోచిస్తే కుటుంబం బ్రద్దలై పోదూ?' అనే భయంకూడా వారిని ఆవరించకపోలేదు. క్రొత్త ఆటవస్తువును చూచిన పసిపిల్లవానిలా ఉన్నది విమల. చీకటిలో తడుముకుంటున్న మనిషికి లాంతరు కన్పించినట్లుగావుంది లలితకు. ఇద్దరూ మౌనంగా ఇంటివైపు నడిచారు.

# 21

అజ్ఞాతవాసంలో మోహన్‌కు సపర్యలుచేసి అతన్ని ఆరోగ్య వంతుణ్ణిచేసి తిరిగివచ్చిన దుర్గ ఏవో కల్లబొల్లి కబుర్లుచెప్పి తన తండ్రిని తన ఊరు పంపింది. కాని ఆమె మనస్సు అనాథ శిశు శరణాలయంలో ఉన్నంతసేపు తప్ప స్థిరంగా ఉండటంలేదు. ఏమిటో అనేక ఆలోచనలు, పెక్కు ఊహలు, భయ సందేహాలు.

ఫోనీ కాస్సేపు రవి ముంతాజ్‌ల ఇంటికివెళ్ళి కొ_స్త పిచ్చాపాటీ మాట్లాడివ_స్తే బాగుంటుందేమోనని తలపో_స్తే, ఫోనుచే_స్తే వారు ఇంట్లోలేరని తెలిసింది. రాధాకృష్ణ, శ్యామలాదేవిగారలు అసలు ఆ రోజు నగరంలో ఉండరని ఆమెకు ముందుగానే తెలుసు. గత్యంతరంలేక తను ఒక్కతే తన ఇంట్లోకూర్చుని గ్రంధపఠనం చేద్దామనుకుంది. పు_స్తకం చేతబట్టిందేకాని అక్షరాలు కనపడటం లేదు. ఏదో అలికినట్లుగా వున్నాయి. పు_స్తకం అవతల పారేసింది. నిద్రపోదామని ప్రక్కమీదికి చేరింది. మేను వాల్చింది. దుప్పటీ కప్పింది. అంతరిక్షాన్ని చూడటం తప్ప కంటికి కునుకురాందే! ఇక లాభంలేదని ముందు గదిలోకివచ్చి కూర్చుని ఆలోచించడం ప్రారంభించింది.

ఆరోజు మోహన్‌తో ఆ సంఘటన అలా ఎందుకు జరిగింది? తన బుద్ధిపూర్వకంగా ఆ పరిస్థితిని తెచ్చుకున్నదా లేక అనాలోచితంగా సంభవించిందా? ఇంతకూ తనకు తెలియకుండానే ప్రేమ బీజాలు మోహన్‌పై తన మనస్సులో పడ్డాయా? అలా జరగడానికి అవకాశంలేదు. తన జీవితాన్ని సమాజసేవకు అంకితము చేద్దామనుకున్న దృఢసంకల్పురాలు తను. కాకపోతే ఈ ప్రశ్నలకు తను ఏం సమాధానం చెప్పగలుగుతుంది. తనకు మోహన్‌పై ఎందుకంత ఆసక్తి? అతనికి సేవ చేయాల్సిన విధి తనకేముంది? ఊరివాడనా? ఊరి వాళ్ళందరికి తను సేవచేసిందా? ఒకవేళ సాయంచేసినా అందరికీ ఇంతసేవ చేసిందా తను? మరి! మనిషికి మనిషికీ సంబంధం ఉండదా? సాటి మనిషిపై సానుభూతి చూపటం తప్పా? అలాగే తనూ మోహన్‌కూ సపర్యలు చేసింది. నగరంలో ఉన్న అందరికీ తమ

సపర్యలు చేయటం లేదే ? మరి మోహన్‌పై ప్రత్యేక శ్రద్ధకు కారణం ఏమిటి ? అతడు కూడ ఉద్యోగాదులు తనలాగే వదిలేసి సమాజ సేవకు నిస్వార్ధంగా పూనుకున్నందు వల్ల కాబోలు తనకు అతనిపై ప్రత్యేకాభిమానం ! అంతే ! అదే కారణం. మరో కారణం ఉండటానికి వీల్లేదు అనుకున్నది దుర్గ.

అలాగని సరిపెట్టుకోవటానికి ఆమెకు మనస్కరించలా. ఇంకా ఎన్నో ప్రశ్నలు క్యూలో నిలబడివున్నాయి. వాటికి కూడా సమాధానం చెప్పాలని అవి తొందరపెట్టున్నాయి తనను.

అచ్చంగా గౌరవమయితే అతనిని తను ఎందుకు ముద్దు పెట్టుకోవాల్సి వచ్చింది. అదా ! ఒట్టి చిలిపిపని. దానికంతకన్నా అర్ధం చెప్పుకోవటం అవివేకం. చిలిపిపనులు అనేకం ఉన్నాయి ? ఆ చిలిపి పనికే తను ఎందుకు పూనుకోవాలి ? బహుశః అతని శరీరసౌందర్యాన్ని చూచి తను ముగ్ధురాలైనదేమో ? తనకు తెలిసినంత వరకూ తనెప్పుడూ ఆ విషయం ఆలోచించలేదే ? తెలియకుండానే ఆ భావం తన మెదడులో ప్రవేశించిందేమో ? నచ్చదగిన, మెచ్చదగిన యువకునిగా మోహన్‌ను తనెప్పుడూ పరిగణించలేదు. వయస్సులోవున్న తనలాంటి యువతి పురుష సాన్నిహిత్యాన్ని అభిలషించడం విడ్డూరం కాదు. ఆ మాటకువస్తే అలాంటి భావమే తనకు కలిగితే ఆ రకమయిన అన్వేషణ తను చేసేదే. తనకు తెలిసిన యువకులను ఆ దృష్టితో పరిశీలించిందే? అలా తను ఎన్నడూ చేయలేదు. దానినిబట్టి అతనిపై తనకు వ్యామోహంలేదని తేలుతున్నది. మరి అదంతాసరే ! ముద్దుపెట్టుకున్న తరువాత తనకు ఆ పూనకపుస్థితి ఏమిటి? అదెలా కలిగింది? అంతర్గతంగా అతనిమీద ప్రేమానురాగాలు లేకపోతే అలాంటి సంఘటన సంభావ్యమా ?

తను ఎన్నో గ్రంథాలు చదివింది సెక్సుమీద. మన తత్వ శాస్త్రాన్ని మథించింది. వాటిలో తనకు ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరకవా?

ప్రేమలో సెక్సుపాలు ఎంత? సెక్సులేని ప్రేమ ఉంటుందా? 'ప్లేటోనికులవ్' అంటారే! అమలిన శృంగారమని అంటారే! అది సాధ్యమా! సెక్సులేకుండా ప్రేమ సంపూర్ణం అవుతుందా? అసలు ప్రేమ అనేదివుందా! అంతా సెక్సేనా? సెక్సువల్ల కలిగే భావ విభావాలకు ప్రేమ అని పేరుపెట్టి దాగుడు మూతలాడుతున్నదా సమాజం? దుర్గను ఇలాంటి ప్రశ్నలు ముప్పిరిగొన్నాయి.

ఇద్దరు వ్యక్తులను సన్నిహితం చేసేది ప్రేమ. పరస్పర గౌరవం, అభిమానం, సహనం, సర్దుకుపోవడం, ఒకరికై ఒకరు త్యాగం చేయదలచటం, ఒకరి సంతృప్తికోసం మరొకరు ప్రయత్నించడం ఇలా ఎన్నో కలిస్తేనే ప్రేమ అంటారు. అది స్త్రీ పురుషుల సన్నిహితత్వాన్ని కోరుతుంది. అది సహజం. ఇద్దరూ ఒకరికి మరొకరు బాగా చేరువయ్యాక సెక్సు వారి సంబంధాలలో ప్రవేశిస్తుంది. దానితో ప్రేమ ఫలిస్తుంది. ఇదంతా తను పుస్తకాలలో చదివిన విషయం.

ప్రథమ దర్శనంలో ప్రేమ పుట్టుకొచ్చిందంటారు. మరి అదేమిటి? ప్రథమ దర్శనంలో పుట్టుకొచ్చేది ప్రేమకాదు. ఆకర్షణ అది. ఒక వ్యక్తి మరొక వ్యక్తిచేత ఆకర్షితుడవుతాడు. అది నిత్యం జరిగే సంఘటనే. తొలిచూపులో ప్రేమ పుట్టదు. తాత్కాలిక ఆకర్షణ ప్రేమ క్రిందికిరాదు. మోహానికి ప్రేమకూ తేడావుంది. ఒక వ్యక్తి యొక్క నడకనుచూచి, సంభాషణను విని, లేక అతని దుస్తులతీరు గమనించి, హాస్యధోరణిని తిలకించి ఇలా ఎన్నోరకాలుగా మరో

వ్యక్తి ఆకర్షణకు లోనుకావచ్చు. అది అంతా ప్రేమ అని భావిస్తే జీవితంలో ఎదురుదెబ్బలు తగుల్తాయి. అలాగే శారీరక సౌందర్యం కూడాను.నిండైన విగ్రహం, పొందికగానున్న అవయవ సౌష్టవం, విశాలమైన ఛాతి, పొడుగైన చేతులు, తేజస్సుతో తొణికిసలాడే ముఖం ఇలాంటివికూడా అవతల మనిషిని ఆకర్షిస్తాయి. కేవలం ఈ లక్షణాలనుచూచి పెండ్లాడితే తరువాత ఇబ్బంది కలుగుతుంది. జీవితలక్ష్యం, ఆదర్శం, జీవనరీతి వీటినికూడా పరిగణనలోకి తీసుకోవాలి. ఈ అంశాలన్నీ తనకు పూర్వమే అవగతం.

ఇంతకూ తన ఆనాటి చర్యకు సరియైన కారణం తనకు గోచరించడంలేదు. అదొక చిక్కుపడిన దారపు బంతిలా తయారయింది. మరో రకంగా ఆలోచిస్తే? .... .... .... తనా మంచి వయస్సులోవున్న యువతి. అంతవరకు తనకు పురుష సాంగత్యం సెక్సు పరంగా తటస్థించలేదు. తన వయస్సువున్న స్త్రీలకు కామ వాంఛ ఉండటం సహజం. ముద్దుపెట్టుకున్నందువల్ల తనలోని కామవాంఛ ప్రేరేపింపబడి ఉంటుంది. తరువాత .... తరువాత .... శరీరం విజృంభించి ఉంటుంది. మనస్సును లొంగదీసి ఉంటుంది. సెక్సుకు జీవితంలో ఎంత ప్రముఖస్థానం ఉన్నది? మనో ధైర్యమూ, ధృతి సంకల్పబలం కలిగిన తనలాంటి దాన్నే అది లొంగదీసుకున్నది. ఇక సామాన్యుల విషయం చెప్పాలా?

ఒక భావం ఆమె మనస్సులో తళుక్కున మెరిసింది. ఆనాటి చర్యవల్ల తను గర్భవతియైతే? వెంటనే భయం పట్టుకుంది. తనా అవివాహిత. మోహన్ అవివాహితుడు. వీరికి సంతానం ఏమిటి? విడ్డూరంగా వుండదూ? సమాజంలో తన స్థానం ఏమవుతుంది? లోకుల దృష్టిలో తను పలచనైపోదూ? ఛీఫ్ వార్డెను ఉద్యోగంలో

నుండి తొలగిస్తుందేమో! తన తల్లిదండ్రులకుతెలిస్తే వారు క్రుంగి పోరూ! ఇన్ని అనర్థాలు వస్తాయని ఆనాడు తెలిస్తే .... ఇంతకూ ఏమీ అనర్థం రాలేదుకదా ; వస్తే? గర్భం తీసివేయించుకుంటే? ఎందుకు తీసివేయించుకోవాలి? తనేం తప్పుచేసింది కనుక. ఆ మాటకువస్తే ఒకవేళ తనూ మోహన్ తప్పు చేశామనుకున్నా అ గర్భస్త శిశువుకు ఎందుకు శిక్ష? అంత పిరికిమనిషా తను? తన జీవితానికి తను బాధ్యత వహించలేని దద్దమ్మా తను? కాదు. కానేరదు. ప్రసవించాల్సిందే ; శిశువును బహిరంగంగా దర్జాగా పెంచాల్సిందే. తనలో పిరికితనం ప్రవేశించరాదు ; తను అందరి లాంటి స్త్రీ కారాదు. జీవితం విషయమై నిశ్చితాభిప్రాయాలుకల స్త్రీ తను అందరిలాగా బేలయిపోవడం తప్పు. అయినా ఇంకా తేలలేదుకదా! కొన్నాళ్ళు జరిగితేకదా గర్భం అయిందీ లేనిదీ తేలేది?

పోనీ! మోహన్‌తో చర్చిస్తే, ఛీ! అతని యెదుట తను బలహీనురాలిగా కన్పడటమా? అయినా అతను మాత్రం ఏం చెప్తాడు? నిర్ణయం తనేచేయాలి ; తప్పదు. తన జీవితాన్ని తనే పరిదిద్దుకోవాలి.

మోహన్‌ను పరాయి వాడినిగా ఎందుకు చూడాలి. అతడూ తనలాగే సంఘసేవకు పూనుకున్న వ్యక్తి. మహోదాత్త ఆశయాల కోసం జీవితాన్ని అంకితం చేసిన వ్యక్తి. ఎన్ని త్యాగాలకైనా సంసిద్ధుడైన కార్యకర్త. అలాంటి వాడిని సంప్రదించినందువల్ల నష్టంలేదు. అతని అభిప్రాయం వినవచ్చు. 'వినదగు నెవ్వరు సెప్పిన .... ....' పద్యం ఉండనే ఉందికదా! వినాలి మోహన్ సలహా. చివరి నిర్ణయం మాత్రం తనదే. పిరికితనం, సెనక చూపు తనలాంటి వారికి తగునా!

ఇలా ఆలోచనా సముద్రంలో తేలియాడుతున్న దుర్గ జాగ్రదవస్థలోకివచ్చి ఏదో అలికిడివిని. అది ఖూట్లసవ్వడి. పరిచయమైన మోహన్ ఖూట్ల టకటక. లేచి ఎదురేగి ఆహ్వానించింది మోహన్‌ను. కుర్చీలో ఆశీనునిచేసి అతని సేద దీర్చటానికి ఒక డ్రింకు తెచ్చి ఇచ్చింది.

మోహన్‌కూడ ఇరకాట స్థితిలోనే ఉన్నాడు. ఆనాటి సంఘటన తరువాత, ఆ కుగ్రామం వదలిన తరువాత ఇదే మొదటి పర్యాయం దుర్గ ఇంటికి రావటం. ఆమె కళ్ళల్లో కళ్ళుపెట్టి చూడటానికి అతనికి ధైర్యం చాలటంలేదు. తలవొంచుకొని కూర్చున్నాడు. దుర్గే చొరవ తీసుకొని పలకరించింది.

"ఏమయ్యా మోహన్! ఎక్కడా కనుపించటంలేదు. నల్లపూస అయిపోయావ్"

"ఏదో పనుల తొందరవల్ల రాలేకపోయాను" ముక్తసరి జవాబు ఇచ్చాడు మోహన్.

పరిస్థితి ఇబ్బందిగావుంది మోహన్‌కు. ఇంతసేపూ ఆ విషయంపై తన మనస్సులో సుదీర్ఘచర్చ చేసినందువల్ల దుర్గకు మోహన్‌కున్నంత ఇరకాటంలేదు.

"మోహన్! ఎన్నడూలేనిది నాకు భయంగావుంది" ప్రస్తావన చేసింది దుర్గ.

వెంటనే స్ఫురించింది మోహన్‌కు ఈ అంశం ఆనాటి తమ ఇద్దరి సన్నిహితత్వానికి సంబంధించిందని. అంతగా తబ్బిబ్బు పడలా.

ఇది విడ్డూరంగా తోచింది దుర్గకు. అంత దుష్ప్రభావాలు కలిగే సంఘటనను అంత తేలికగా ఎలా తీసుకోగలుగుతున్నాడు

అతడు. ఎంతైనా పురుషుడు కదా ! కష్టాలు నష్టాలూ ఆడవాళ్ళకే గదా ! కాని, మోహన్ అందరి పురుషుల్లాంటివాడు కాదే !

"దుర్గా ! అనవసరమైన ఆలోచనలతో జీవితం అంధకార బంధురం చేసుకోవద్దు. ఏ విధమైన ప్రమాదమూ నీకురాదు; రావటానికి అవకాశంలేదు. నన్ను నమ్ము" ధీమాగా పల్కాడు మోహన్.

అతడి మనోనిబ్బరానికి ఆమె ఆశ్చర్యపోయింది. దానికి తగిన కారణాన్ని తను ఊహించలేక పోతున్నది. తల తిరిగి పోతున్నది ఈ భావాల తీవ్రతతో.

"ఆ రోజు మనం రవి ముంతాజ్‌లతో వాళ్ళ ఇంట్లో కుటుంబ నియంత్రణను గురించి చర్చించాం జ్ఞాపకముందా? ఆ మరునాడు నేను వేసక్టమీ ఆపరేషను చేయించుకున్నాను." తాపీగా అన్నాడు మోహన్.

దుర్గ ఆశ్చర్యాంబుధిలో మునిగిపోయింది. తను వింటున్నది కలా లేక నిజమా ? వెంటనే మరో భావం స్ఫురించింది. మోహన్ ఉద్దేశపూర్వకంగా ఆ రోజు .... ఆ గ్రామంలో ..... ..... తన్ని దగ్గరకు తీసుకున్నాడా ? అందుకోసమే - తన జీవితంలో చెలగాట మాడటానికే — ఆపరేషన్ చేయించుకున్నాడా ? మోహన్ తను అనుకున్నంత పెద్ద మనిషేనా ? ఈ ఆలోచనలతో ఆమె మాట్లాడలేదు. అలా ఆమె మౌనంగా కూర్చుంటే ఎదురుగా తను కూర్చోవటానికి మోహన్‌కు ఇబ్బందిగావుంది. వెంటనే లేచి వెళ్ళి వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు. దుర్గ అలాగే స్థాణువులా కుర్చీలో కూలబడిపోయింది.

## 22

వెంకట్రావుగారి ఇంట్లో ఆ రోజంతా సందడే. వాళ్ళ రెండో అబ్బాయి ఉపనయనం. వాళ్ళ ఆరుగురు సంతానంలో పెద్దవాడికి పెండ్లి అయిపోయింది అంతకుముందే. అతగాడు వేరే ఊళ్ళో ఉద్యోగంచేస్తూ తన భార్యతో అక్కడే కాపురముంటున్నాడు. వడుగు బాగా వైభవంగా జరిగింది. చుట్టుపక్కల స్నేహితులూ, బంధువులూ అంతావచ్చి వెళ్ళారు. కుటుంబరావూ అతని భార్య లలితా ప్రొద్దున్నే వచ్చి భోజనాలయిన తరువాత వెళ్ళిపోయ్యారు.

పిల్లలంతా పైకెళ్ళి పడుకున్నారు. వెంకట్రావు పడకగదిలో భర్తకు తాంబూలం అందిస్తూ-

"ఏమండీ! నన్ను రేపు సాయంత్రం 'రాత్రి అనుభవాలు' సినిమాకు తీసుకొనివెళ్ళరూ ?" ప్రాధేయ పూర్వకంగా అడిగింది విమల. విద్యుద్ఘాతం తగిలినట్లు అదిరిపడ్డాడు వెంకట్రావు.

ఇదేమి కోరిక ఈ వయస్సులో. ఆరుగురు బిడ్డలతల్లి. పెద్దవాడికి పెళ్ళయింది. ఏపుగా పెరిగిన పెద్దపిల్లకు రేపో మాపో పెండ్లి చేయాల్సిన రోజులు. ఆమెకు ఏభై ఏండ్లు నిండాయి. ఇలాంటి స్థితిలో ఈ కోరిక. తనకేమీ పాలుపోలేదు. అయినా మాట్లాడి చూద్దామనుకున్నాడు.

"ఛీ! ఛీ! అది పాడు సినిమా. దానికి సంసారులు వెళ్ళరు. అందులో నీలాంటి పతివ్రతలు అసలే వెళ్ళకూడదు" అన్నాడు వెంకట్రావు.

ఆమె మనోభావాలు తెలుసుకోవాలని భార్య ముఖంవైపు తదేక దృష్టితో చూస్తున్నాడు. ఆమె ఆశించిన జవాబేవచ్చింది. ఇంకా విషయాన్ని ఒక నిర్ధారణకు తేవాలని తోచింది.

"సరదాగా అడిగాను. తీసుకొని వెళ్ళకూడదా" మరోసారి గోముగా అడిగింది విమల.

"నేను రెండు వారాలకొకసారి తప్పకుండా సినిమాకు తీసుకొనివెళ్తున్నాను కదా! ఈ పాడు సినిమాలజోలి మనకెందుకు?" తను భార్యను ఎంతగా గౌరవిస్తున్నాడో ధీమాగా చెప్పాడు వెంకట్రావు.

"నేను కోరుకున్నది పాడు సినిమా అవుతుందా అండీ? మీకు ఇష్టమైతే అది మంచి సినిమా! పోనీలేండి బుద్ధి తక్కువయ్యి అడిగాను" నొచ్చుకుంది విమల లోలో కృంగిపోతూ.

"అలా అనుకోకు. మీలాంటివాళ్ళు చూడదగిన సినిమా కాదని అన్నాను. దాని నిండా అశ్లీలం, బూతు నిండివున్నాయి." నచ్చ చెప్పాడు వెంకట్రావు.

"మీకెలా తెలుసు? మీరు చూచారాదాన్ని" నిలదీసి అడిగింది విమల.

"చూచాను అనుకో! పోనీ చూచే పనికిరాదని చెప్తున్నాను అది పెద్ద నేరమా?" అంటూ గ్రుడ్లురిమి చూశాడు.

"అయితే నేనూ చూచి ఎలా పనికిరానిదో తేలుస్తానండీ" అన్నది రోషంతో.

"నేను చూచి చెప్తున్నాగా. మళ్ళీ నీవూ చూడాలేమిటి?" ఎత్తి పొడిచాడు భార్యను.

"మీరు చూచి చెడిపోనిది నేను మాత్రం ఆ సినిమాచూచి చెడిపోతానని మీరు ఎందుకు అనుకోవాలి?" ఆవేశంతో అడిగింది.

"ఎందుకా? ఆడవాళ్ళు అటువంటి సినిమాలుచూస్తే ఉద్రేక పడిపోతారు. దాంతో సర్వనాశనం" కనుబొమ్మ లెగరేస్తూ అన్నాడు.

"బాగానేవుంది వరస. చూచిన మీకు ఉద్రేకం రాలేదా? ఉద్రేకం మీకు రాకపోతే నాకూరాదు. అలా కాకపోతే మీరు చెడిపోంది నేనూ చెడిపోను" మధ్యలో అడ్డతగిలి సంభాషణ సాగిస్తోంది విమల. ఈ తర్కం, ఈ వాదన తలనొప్పి కలిగించాయి వెంకట్రావుకు.

వ్యవహారం శృతి మించిదని భావించాడు. తనపురుషత్వాన్నే దెబ్బ తీస్తున్నట్లుగా ఉన్నది విమల ధోరణి.

"ఇదిగో నేను చెప్తున్నాను. నీవు ఆ సినిమాకు వెళ్ళడానికి వీలులేదు." ఆజ్ఞాపించాడు అధికార స్వరంతో వెంకట్రావు.

అతని కంఠధ్వనికి ఆమె ఉలిక్కిపడింది. అంతకు క్రితం ఎప్పుడూ అలాంటి పరుషవాక్కులు అతని నోట రాలేదు. ఇదే మొదటిసారి తను వినడం. ఆమెకు కోపంవచ్చింది. తమాయించు కుంది. ముంతాజ్ చెప్పినట్లే జరిగింది. అతని ఇష్టమే తన ఇష్టంగా చలామణీ అయినన్నాళ్ళు ఏ తగాదా ఉండదు; భార్యాభర్తలు అన్యోన్యంగా ఉన్నట్లే. ఏ మాత్రం భార్య స్వంత అభిప్రాయాలు వెలిబుచ్చినా వస్తుంది తంటా వెన్వెంటనే. ఈ పాతకాలపు వివాహ రథంలో ఒక చక్రమే తిరుగుతుంది. రెండో చక్రాన్ని తిరిగే చక్రం ఈడ్చుకొని వెళ్తుంది. అదే పురుషుడనే చక్రం. స్త్రీకి స్వతహాగా ఆలోచించే అవకాశంలేదు; అవకాశం ఇవ్వదు సమాజం. ఇపుడు అర్థమయింది తన స్వేచ్ఛ ఏమిటో.

విమల మౌనం వహించింది. ఆమెకు కోపం వచ్చిందని వెంకట్రావు గ్రహించాడు. ఆమెను అనునయిద్దామని తన బాహు వల్లరిలోకి లాక్కున్నాడు. యాంత్రికంగా ఆమె అతని చేతుల్లోకి ఒరిగిపోయింది.

# 23

వెంకట్రావు ఇంట్లో ఉపనయనం జరిగిన మర్నాడు రాత్రి కుటుంబరావు ఆలస్యంగా ఇంటికివచ్చాడు. ఇటీవల ఆలస్యంగా ఇంటికి వస్తున్నాడు తగాదాలు లేకుండా ఉండాలని.

భోజనాదులు పూర్తిచేసుకొని ముందుగదిలో కూర్చున్నాడు. లలిత అతనికి దగ్గరగా కుర్చీలాక్కొని కూర్చుంది.

ఏదో క్రొత్త విషయం ప్రస్తావించబోతున్నదని కుటుంబరావు గ్రహించాడు. రాబొయ్యే తుఫానును శంకిస్తున్నది అతని మనస్సు.

“ ఏమండీ నిన్న వెంకట్రావుగారి ఇల్లు ఎంత కళకళలాడుతున్నదో చూచారా ?” అప్యాయంగా అన్నది లలిత.

ఈ విషయం ఆమె ఎందుకు లేవదీసిందో తోచలేదు కుటుంబరావుకు.

“ వారికేం సంపన్నులు. బోలెడంత బలగం. వైభవంగా ఉండక ఎలా ఉంటుంది ? పైగా ఉపనయన మహోత్సవం.”

“ అది కాదండీ నేననేది. పిల్లా పాపలతో ఇల్లు కళకళలాడుతుందని నా భావం ’’

కుటుంబరావు గతుక్కుమన్నాడు. తాము వడివయస్సులో ఉన్నా లలిత కడుపున ఒక నలుసైనా పుట్టలేదు. ఈ విషయం అతని మనస్సును కూడా దహించివేస్తున్నది.

"ఓస్! అదా విషయం. మనచేతుల్లో ఏముంది. అంతా ఆ భగవంతుడి దయ" అన్నాడు కుటుంబరావు నెపం భగవంతుడి మీదికి నెట్టూ.

"మనిద్దరం డాక్టరుచేత పరీక్ష చేయించుకుంటే సరిపోతుం దండి. మనలో ఏదైనా లోపంవుంటే వైద్యం చేస్తారు డాక్టరు".

"నీది పిచ్చిభ్రమ. డాక్టర్లచేతుల్లో ఏముంది! భగవల్లీలలు అనంతం. కొంతమందికి గంపెడు పిల్లలను ఇస్తాడు. కొంత మంది ఆడవాళ్ళను గొడ్రాళ్ళుగా సృష్టిస్తాడు."

కోపం వచ్చింది లలితకు. ఎంతసేపూ ఆడవాళ్ళను ఆడి పోసుకోవటం తప్ప మరేం పనిలేదు ఈ మగాళ్ళకు.

"అది కాదండీ! పిల్లలు కలగకపోవడానికి మగవాళ్ళలో కూడా లోపం ఉండవచ్చుట కదా!" ఈ మాటతో అదిరిపడ్డాడు కుటుంబరావు. తుఫాను ముంచుకొస్తుందని గ్రహించాడు. తన పురుషత్వానికే భంగం వచ్చేటట్లుంది. తట్టుకోవాలి ఈ దాడి.

"నీకెవరు చెప్పారు ఈ అసత్యపు మాటలు. పురుషుల్లో లోపం ఉంచడు భగవంతుడు" పతివక్త పోజుపెట్టి భార్యతో అన్నాడు.

"దేవుడు పురుష పక్షపాతియా? తెలియక అడుగుతున్నాను. చెప్పండి" రెట్టించినట్లుగా మాట్లాడింది లలిత.

ఈ తిరుగుబాటును తొడిమలోనే త్రుంచివేయకపోతే ఇది మహా విప్లవంగా పరిణమించవచ్చని భయం కలిగింది కుటుంబ రావుకు.

" నీ పొగరుమోతు మాటలు కట్టిపెట్టి పోయి నిద్రపో. దైవ దూషణకు కూడా వెనుదీయటంలేదు " ఆజ్ఞాపించాడు కుటుంబరావు.

ఆమె బెదరిపోలేదు; వెనుదిరగ దలచలేదు.

" మీరు రేపు నాతో డాక్టరు దగ్గరకు వస్తానంటే తప్ప నేను ఇచ్చటనుండి లేవను." కృతనిశ్చయంతో పలికింది లలిత.

" మరి నీకీమధ్య హఠం ఎక్కువయింది. ఏదో దయ్యం పట్టుకుంది. దానిని వదలకొడ్తేగాని నీకీ రోగం కుదరదు " అంటూ ఆమెను జుట్టుపట్టుకొని వాకిట్లోకి ఈడ్చుకెళ్ళి వాకిలి తలుపు వేసేశాడు.

ఈ మాటలు, ఈ గలభా అంతా ప్రక్కవాటాలోనున్న దుర్గకు వినవట్టున్నాయి. కాని లలిత నోటి దురుసుతనం ఒకసారి తను చవిచూచింది. ఇంక ఆమె ప్రమేయం పెట్టుకోదలచుకోలేదు. అందుకని ఊరకున్నది. తలుపుతీసి వాకిట్లోకి రాలేదు. లలిత పరిస్థితి మరీ అయోమయంగావుంది. ఇలా జరుగుతుందని ఏనాడూ ఊహించలేదు. కుటుంబరావు ఇంత దుర్మార్గానికి దిగుతాడనే అనుమానం తనకేనాడు కలుగలేదు. ఈనాటికన్నా ఘాటుగా ఎన్ని పర్యాయాలు తామిద్దరూ పోట్లాడుకోలేదు. ఈ రోజు తను కానిమాట ఏమీ అనలేదే. ఎంతో జాగ్రత్తగా మాట్లాడింది ఇవ్వాళ. మరెందుకు ఆయనకు అంత కోపం వచ్చినట్లు? తన మాటలు ఆయన పుంస్త్వాన్ని శంకించినట్లు అతనికి తోచిందా? అలాగని తను స్పష్టంగా అనలేదే. 'లోపం ఎవరిదైనా కావచ్చును' అని అన్నది. అది ఏమంత తప్పు. నిజానికి లోపం ఎవరిదైనా కావచ్చుగా! ఇపుడు తనకేది గతి. భర్త విడిచిన ఇల్లాలుకు సమాజంలో ఏం గౌరవం ఉంటుంది.

ఈ రాత్రికి తను ఎక్కడ పడుకోవాలి. పోనీ దుర్గనులేపి ఆశ్రియం అడిగితే. తను ఆ పని చేయలేదు. దుర్గను తను ఒకసారి విమలగారి ఇంట్లో బుద్ధిపూర్వకంగా అవమాన పర్చింది. మరి ఇపుడు ఆమె సాయం ఎలా కోరటం? అది తనకు అలవికాని పని. అలాగని విమలగారిని లేపితే? వెళ్ళి తగుదునమ్మాయని ఆ భార్యాభర్తల మధ్య తను ఎలా మసలగలదు?. దగ్గరలో శ్యామలాదేవి తప్ప మరెవ్వరూ లేరు. శ్యామలాదేవిని ఆ రోజు పిల్ల పుట్టినరోజుకు పిలవడానికివస్తే తను నానా మాటలూ అన్నది. ఏ మొగం పెట్టుకొని వారి ఇంటికి పోగలదు. ఏమయినాసరే దుర్గ ఇంటికే వెడదామని దుర్గ వాకిలివద్దకు చేరింది లలిత. మళ్ళీ మరో ఆలోచన వచ్చింది ఆమెకు. దుర్గ తనకన్నా చిన్నది. ఆమె ఒకవేళ నిందిస్తే తను భరించగలదా. ఎంతయినా శ్యామలాదేవి దుర్గకన్నా అనుభవంకలది, కాపురం చేస్తున్న స్త్రీ. తన పరిస్థితిని అర్ధం చేసుకోగలదు. కాకపోతే మహా అంటే రెండు నిష్ఠూర్యం మాటలు అంటుంది. అంటే అననీ. అయినా ఆమె అలాంటిది కాదు. సంస్కారవంతురాలు. ఆపదలో మన్న తనను ఏమీ అనదు. ఆదరిస్తుంది.

ఇలా ఆలోచించి లలిత శ్యామలాదేవి అద్దెకున్న వాటావైపు నడిచింది.

ఇదంతా గమనిస్తున్న కుటుంబరావుకు శివమెత్తింది. లలిత మళ్ళీవచ్చి తలుపుకొట్టి ప్రతిమాలి తలుపు తీయించుకొని లలిత తన కాళ్ళమీద పడుతుందని అనుకున్నాడు కుటుంబరావు. అది జరుగక్క పోగా ధీమాగా ఇతరుల సాయం అడగటానికి పోతున్నది. ఈమె కెంత పొగరు? వాకిలి తలుపు ఒక్క ఉదుటున తీశాడు. చేతిలోని కర్రతో ఆమె తలమీద ఒక్కవేటు వేశాడు. ఆమె 'అయ్యో' అంటూ కూలబడింది. తర్వాత మళ్ళీ రెండు దెబ్బలు వేశాడు.

"చంపుతున్నాడర్రో" అంటూ కేకలు పెట్టింది లలిత.

కర్ర చేతపట్టుకొని అక్కడే నుంచున్నాడు కుటుంబరావు.

దుర్గ దబదబా తలుపు తీసుకొనివచ్చి రక్తపు మడుగులోవున్న లలిత తలను తన తొడపై కూర్చోపెట్టుకొని రక్తపుధార ఆపటానికి ప్రయత్నిస్తున్నది.

ఈ వైపునుంచి వెంకట్రావు కుటుంబం, ఆ వైపునుంచి రాధాకృష్ణ శ్యామలాదేవులు, మోహన్ పరుగెత్తుకొని వచ్చారు.

వీధి దీపాల వెలుగులో అందరి ముఖాలు అందరికీ కన్పిస్తున్నాయి.

"బంగారం లాంటి పిల్లను కొట్టటానికి చేతులెలా వచ్చాయయ్యా" అని నిగ్గదీసి అడిగింది విమల.

"కాపురం చెయ్యనని ఇంట్లోనుంచి వెళ్ళిపోతుంటే ఏం చెయ్యాలండీ ఇంటికైన మగాడు" బొంకాడు కుటుంబరావు.

"అవును మరి. అతగాడేం చేస్తాడు. బరితెగించి ఆమె బజారునపడితే" అన్నాడు వెంకట్రావు.

"మీ మగబుద్ధి పోనిచ్చారుకాదు" వెటకారంగా పలికింది విమల.

డాక్టరుకోసం మోహన్ పరిగెత్తాడు.

"ఒకవేళ ఆమెకు కాపురం ఇష్టంలేక ఇంట్లోనుంచి వెళ్ళిపోతే మాత్రం ఆమెను హింసించటానికి మీకెవరిచ్చారండీ అధికారం" దబాయించింది శ్యామలాదేవి.

లలితకు నోట మాటలేదు. అచేతనంగా దుర్గ వళ్ళో పడివుంది.

" తాళి కట్టిననాడే నాకు ఆ అధికారం సంక్రమించింది" అన్నాడు కుటుంబరావు కోర్టు వాదనలాగా.

" తాళి కట్టింది కొట్టి చంపడానికి కాదయ్యా. పెట్టి పోషించటానికి, అప్యాయంగా ఆదరించటానికీను" బుద్ధిచెప్పాడు రాధాకృష్ణ.

" అమ్మా " అని ఒక గావుకేక పెట్టింది లలిత.

డాక్టరువచ్చి నాడిచూచి పెదవి విరిచాడు.

వెంకట్రావుఇంట్లోంచి పిల్లలు ఫోను చేశారు కాబోలు పోలీసులు వచ్చి కుటుంబరావు చేతికి బేడీలు వేశారు. శవ పరీక్షకోసం లలిత శరీరాన్ని వ్యానులో తీసుకెళ్ళారు. నిశ్చేష్టితంగావున్న దుర్గను చూచాడు మోహన్.

" దుర్గా ! ధైర్యంగావుండు " అని హెచ్చరించాడు.

" ఈ రాత్రికి నీవు వక్కతెవు పడుకోవద్దు. మా ఇంటికిరా " అని తీసుకెళ్ళారు దుర్గను రాధాకృష్ణ దంపతులు.

మోహన్ వారిననుసరించాడు.

" ఎంత ఘోరం జరిగింది " అనుకుంటూ నిష్క్రమించారు విమలా వెంకట్రావులు.

# 24

హైదరాబాద్ నగరంలో మత కలహాలు మొదలయినాయి. మ్యునిసిపాలిటీకి ఎన్నికలు పెట్తామని ప్రభుత్వం ప్రకటించింది. దాంతో తీవ్ర మతవాద గ్రూపులు మీటింగులు పెట్టటం, పరమత పార్టీల ఆగడాలను అభివర్ణించడం మామూలు. ఆగ్రహం ఎక్కువవుతుంది. ఇదే సమయంలో ఏదో హిందువుల పండుగ వస్తుంది.

ఊరేగింపు బయలుదేరుతుంది మేళతాళాలతో. మసీదులవద్ద మేళాలు ఆపే ఆచారంవుంది. దానికి భిన్నంగా మేళాలు వాయించడం, మసీదులో నుండి కొందరు బయటికివచ్చి మేళాలు ఆపమనటం, ఆపడానికి వీలులేదని ఒక మతవర్గం, ఆపాల్సిందేనని మరియొక మతవర్గం దబాయించటం, సంఘర్షణ, కొందరికి దెబ్బలు తగలటం ఇది అలవాటుగా జరుగుతుంది.

తరువాత చుట్టుప్రక్కల ప్రాంతాలకు ఈ తగాదా ప్రాకుతుంది. హిందువుల పేటల్లో ముస్లింలను, ముస్లింల పేటల్లో హిందువులను హింసించడం, చంపడం, పొడవడం ఇదీ తంతు. ముందుదెబ్బ తీసింది హిందువులని, కాదు ముందు దెబ్బ తీసింది ముస్లింలని ఇలా వాదించుకోవడం పరిపాటి.

ఈ సారి జరిగిన మత కలహాలు మామూలుగా జరిగే వాటి కన్న భిన్నంగా జరిగాయి. కొంతమంది హిందూ గూండాలు ముస్లిం ప్రాంతాలపై దాడిచేయటం, మరి కొంతమంది ముస్లిం గూండాలు హిందూ ప్రాంతాలపై దౌర్జన్యానికి దిగడం ఒక పథకం ప్రకారం జరిగేది పూర్వం.

ఈసారి పద్ధతి మారింది. పురానాపూల్‌లో బస్సు దిగిన హిందువును లాలాదర్వాజా ప్రాంతపు ముసల్మాను యువకుడు కత్తితో పొడుస్తాడు. అలాగే లాలాదర్వాజాలో బస్సు దిగుతున్న ముసల్మానును శాలిబండ ప్రాంతపు హిందూ యువకుడు కత్తితో పొడుస్తాడు. దెబ్బ తీసేవాడు, దెబ్బకు లోనయ్యేవాడు పరాయి ప్రాంతపువారే. దీనివల్ల ఆయా ప్రాంతాలవారు ఎన్ని సుహృద్భావ సంఘాలను వేసుకున్నా, ఎంతగా కావలాకాసినా, ఎంత జాగ్రత్తగా

తమ పేటలో రౌడీలను, గూండాలను కనిపెట్టివున్నా లాభం లేక పోతోంది. ఇది ప్రచ్ఛన్న యుద్ధం. ఎపుడు ఏ వేళకు ఎవరు ఎవరిని పొడుస్తారో ఊహించ వీలులేని విషయం. దీంతో హతుల సంఖ్య పెరిగిపోయింది. నగరంలో హాహాకారాలు బయలుదేరాయి. చనిపోయినవారి సంఖ్య సరిగ్గా తెలియకపోవడంతో పుకార్లు చెల రేగినయి. హిందువులు ఎక్కువగా చనిపోయారని హిందూ మత వాదులు, ముస్లింలు ఎక్కువగా చనిపోయారని ముస్లిం మత వాదులు పుకార్లను పనిగట్టుకొని ప్రచారం చేసేవారు. దాంతో దాడులు మరీ ఎక్కువయ్యేవి. ఇలా ఇది ఒక విషవలయంగా తయారయింది.

మోటారు సైకిలుమీద ఇద్దరు లేక ముగ్గురు యువకులు బయలుదేరడం, వీధిమధ్య ఆపటం, దారినపోయే పురుషుణ్ణో, స్త్రీనో పొడవడం ఇదీ పద్ధతి.

ఈ రకంగా మతకలహాలు జరిగే రోజుల్లో ఒకరోజు ఉదయం హుస్సేనీ ఆలంలో హిందూ దుస్తుల్లోవున్న ఒక యువతి వీధిలో నడచిపోతున్నది. మోటారు సైకిలుపైన ముగ్గురు ముసల్మాను యువకులు రావడం, సైకిలును ఆమె ప్రక్కన అరక్షణం ఆపడం, అందులో ఒకడు ఆమెను వెనుకగుండా వీపుమీద పొడవడం, 'అల్లా' అంటూ ఆమె నేలకొరగడం ఆ యువకులు సైకిలు పై పారి పోవడం క్షణంలో జరిగిపోయాయి. చుట్టుప్రక్కల వారంతాచేరారు. అప్పటికే ఆమెకు స్పృహలేదు.

'ఎంత ఘోరం జరిగింది' అని హిందువులు, ముసల్మానులు హింది ఉర్దూ భాషలలో మాట్లాడనారంభించారు. ఇదంతా చూచిన కొందరు ఆమెను గుర్తించారు. ఆమెతమపేటలోనే కాపురముంటున్న రవిగారి భార్య అని హిందువులు అంటే, తమ ఇంటిప్రక్కనే కాపురం

వున్న ఆమె అని ముస్లింలు చెప్పుకున్నారు. ఆమెపేరు ముంతాజ్ అని తేల్చారు. కొందరు రవిగారికి ఈ వర్తమానం చేరవేశారు. మరికొందరు పోలీసులకు కబురుపెట్టారు.

ముసల్మాను చేతి లో ముసల్మాను వ్యక్తి కత్తిపోటుకు గురయింది, ఇంతకన్నా ఘోరం ఉంటుందా అని ముసల్మానులు వాపోయారు. హిందువును, కాఫర్‌ను పెండ్లి చేసుకున్నందుకు దేవుడు ఆమెను అలా శిక్షించాడని తీవ్ర మతవాద భావాలుకల ముస్లింలు ప్రకటించారు.

'అల్లా దయామయుడు, అంత క్రూరంగా ఎవరినీ శిక్షించడు' అని మతస్థులలోనే కొందరు అభిప్రాయపడ్డారు. అలాగే హిందూ మతస్థులు కొందరు రవిని నిరసించారు. 'హిందువులలో ఆడపిల్ల దొరకనట్లు ముసల్మాను అమ్మాయిని పెండ్లి చేసుకున్నాడు. వీడికిలాంటి శాస్తే జరగాలి' అని హిందూమత మౌఢ్యాన్ని పుణికి పుచ్చుకున్న కొంతమంది వ్యాఖ్యానించారు. వేర్వేరు మతాలలో పుట్టినా పభ్యతా సంస్కారాలు అలవరచుకున్న కొంతమంది యువకులు రవికి అండగా నిలబడ్డారు. ఇంతలో డాక్టరు రావడం, ఆమెను ఆంబులెన్సులో తీసుకొనివెళ్ళి ప్రత్యేక విభాగంలో ఉంచటం జరిగింది. రవి వెంట వెళ్ళాడు.

ఈ విషయం తెలిసిన రాధాకృష్ణ శ్యామలాదేవులు రవి ఇంటికి వచ్చారు. ఇరుగు పొరుగు వారివల్ల విషయగ్రహణంచేసి ఆస్పత్రికి వెళ్ళారు. అలాగే దుర్గా మోహన్‌లుకూడా ఆస్పత్రికి చేరారు.

రవి మొగంలో విన్నదనం తప్ప మరేమీలేదు. రాధాకృష్ణను, మోహన్‌ను కౌగలించుకొని పసిపిల్లవానిలా ఏడ్చాడు. "నా ముంతాజ్ .... నా ముంతాజ్ ...." అనడమేగాని మాట పెగిలేది

కాదు. రోజున్నర గడిస్తేగాని ఏ సంగతీ చెప్పలేమని ఆమె ప్రమాద స్థితిలో ఉందనిచెప్పారు వైద్యులు.

'మీరు ఇక్కడవుండి చేయగలిగిందిలేదు. అంతా మేము చూచుకుంటాం. పైగా మీరిక్కడవుంటే మాకు పరిచర్య చేయడానికి అడ్డుగా ఉంటుంది' అన్నారు నర్సులు. ఇంతలో డాక్టరు వచ్చాడు. "కత్తిపోటువల్ల రక్తం పోయింది. రక్తాన్ని వంట్లోకి ఎక్కించాలి. మీరెవరైనా 'ఓ' గ్రూపు రక్తం గలవారున్నారా" అని అడిగాడు డాక్టరు.

మోహన్ ముందుకువచ్చాడు. అతనిని మరోగదిలోనికి తీసుకొని వెళ్ళారు. రక్తం అతని శరీరంలోనుంచి తీశారు నర్సులు.

ఆ రక్తాన్ని ముంతాజ్ శరీరంలోనికి ఎక్కించే ఏర్పాటు చేశారు. ఆమె బెడ్ ప్రక్కన ఆ పరికరాన్ని ఏర్పాటు చేశారు.

చీకటి పడబోతున్నది. రోగి ప్రక్కన ఒక్కరుకన్నా ఉండ రాదని నర్సు ఆదేశించింది. తను ఉంటానని రవి అన్నాడు. అతనిని అచ్చట అలా ఉంచటం భావ్యంకాదని రాధాకృష్ణకు తోచింది. శ్యామలాదేవి తను ఆస్పత్రిలో ఉంటానని చెప్పింది. దుర్గ అడ్డువచ్చి తనను రోగి ప్రక్కన ఉండనిమ్మని కోరింది. అందరూ అంగీకరించారు. మోహన్ ఆసుపత్రి వెలుపల ఉంటానని చెప్పాడు దుర్గకు అండగా. రవిని ఆ పరిస్థితిలో ఒంటిగా విడిచి పెట్టలేక తమ ఇంటికి తీసుకొనివెళ్ళారు రాధాకృష్ణ శ్యామలాదేవులు.

రాధాకృష్ణ ఇంటికి వచ్చిన తరువాత రవి హృదయం బ్రద్ద అయింది. అప్పటివరకు నిబ్బరంగా కన్పడుతున్న రవి ఒక్కసారిగా

గొల్లుమన్నాడు. తనివితీరా ఏడ్చాడు. ఆ స్థితిలో ఓదార్చడం మంచిదికాదని, ఏడి స్తేకాని మనిషి కోలుకోడని తెలిసిన వారు కనుక అతనిని సముదాయించ ప్రయత్నించలేదు.

'మా పరిశోధనలకు అడ్డు వస్తుందని మేము సంతానాన్ని కనదలచలేదు. సంతానంలేదనే కొరత పూడ్చుకొనే నిమిత్తం అనాధ శిశుశరణాలయంలో వున్న పిల్లలందర్నీ మా పిల్లలుగానే భావించాము. అందుకనే నెలకొకసారి శరణాలయానికివెళ్ళి పిల్లలకు దుస్తులు, ఆట బొమ్మలు, చాక్లెట్లు, పుస్తకాలు, బొమ్మల పుస్తకాలు ఇచ్చి వారితో ఆడి పాడి ఇంటికి వచ్చేవాళ్ళం. మేము ఇద్దరం సంతాన నిరోధక ఆపరేషన్లు చేయించుకున్నాం. ఈ విషయంలో నా కన్నా ముంతాజ్‌దే ఎక్కువపట్టు. ఇంక ఒక్కడినే శరణాలయానికి ఎలా వెళ్ళగలను" ఆక్రోశించాడు రవి.

## 25

ఇలా దుఃఖాన్ని మరీ పెంచుకుంటే రవి దక్కడని గ్రహించిన రాధాకృష్ణ బలవంతంమీద రవిచేత ఒక కప్పు కాఫీ త్రాగించి నిద్ర మాత్రవేసి నిద్రపోయేలా చేశాడు.

మరునాడు ప్రొద్దున్నేలేచి ఆస్పత్రికి పోవడానికి రవి సిద్ధపడ్డాడు. రాధాకృష్ణ శ్యామలాదేవులు తాముగూడా వెంటవస్తామని బయలుదేరారు. ముగ్గురూ ఆస్పత్రిలో ముంతాజ్‌వున్న విభాగానికి పోయారు. ఆమె గదిలో ప్రవేశించారు. దుర్గ అక్కడే ఉన్నది. రాత్రి అంతా నిద్రలేదేమో ఆమె కళ్ళు జ్యోతుల్లా ఉన్నాయి. మోహన్ బెడ్ ప్రక్కన నిలబడి ఉన్నాడు.

డాక్టరు వచ్చాడు. ముంతాజ్‌ను సమీపించి "చూడమ్మా! కళ్ళుతెరూ" అన్నాడు.

ముంతాజ్ అతి కష్టంమీద కళ్ళు తెరిచింది. డాక్టరు సంతోషానికి పట్టపగ్గాల్లేవు.

"ఇంక ఈమె ప్రాణానికి భయంలేదు. ఈమె మీకు దక్కింది" అనిచెప్పి రవిని బుజంతట్టి వెళ్ళిపోయాడు.

అందరి ముఖాలలో సంతోషరేఖలు వెల్లివిరిశాయి.

"డ్యూటీ మార్చుకుందాము. నేను శ్యామలా ఇక్కడే ఉంటాము. రవికూడ మాతోనే ఉంటాడు. మీరువెళ్ళి విశ్రాంతి తీసుకోండి" అని దుర్గా మోహన్‌లను ఇంటికి పంపించాడు రాధాకృష్ణ.

కొన్నాళ్ళకు ముంతాజ్ ఆరోగ్యాన్ని కోలుకున్నది. ఆమెను ఆసుపత్రినుంచి ఇంటికి పంపించారు. ఆమె చాలా నీరసంగా ఉన్నందువల్ల తమ ఇంట్లోపని చేసుకోలేదని వారిని శ్యామలాదేవి తన ఇంటికి తెచ్చింది. కంటికి రెప్పలా ముంతాజ్‌ను కాపాడుకుంటున్నది. దుర్గ మధ్యమధ్యవచ్చి చూచిపోతున్నది. ఇంటిపనిలో శ్యామలాదేవికి తోడుపడుతున్నది. మోహన్ అపుడపుడువచ్చి యోగక్షేమాలను వాకబ్‌చేసి పోతున్నాడు.

## 26

దుర్గ మామూలుగా తన విధులకు హాజరవుతూ ఉన్నది. శరణాలయంలోని బాల బాలికలందరికీ అన్నీ సమకూరుస్తున్నది. ఎందుకో ఆమెలో భయసందేహాలు పోలేదు. మోహన్ నిజంచెప్పాడా.

అతడు ఆపరేషను చేయించుకున్నమాట వాస్తవమేనా? ఆపరేషను చేయించుకున్న తేదీకి గ్రామంలో తమరిద్దరి మధ్య జరిగిన సంఘటనకూ వ్యవధియెంత? మూడు నెలల వ్యవధి ఉన్నదా? లేదే! అంత వ్యవధి లేకపోతే తనకు గర్భం రావచ్చుకదా! సందేహంలేదు. తనకు పిరియడ్ ఆలస్యమయింది. అందువల్లనేమో! ఇలా ఎన్నో ఆలోచనలు.

ఎందుకైనా మంచిదని లేడీడాక్టరు వద్దకువెళ్ళింది. నూతన పరిశీలనా పద్ధతులు రావటంవల్ల డాక్టరమ్మ పరీక్షచేసి ఇట్టే చెప్పేసింది. తను గర్భవతియట.

ఇపుడేంచేయాలి? గర్భవిచ్ఛిత్తి చేయించుకుంటే. ఛీ! ఎందుకంత పిరికితనం. తను తల్లి అవుతుంది. పుట్టేపిల్లను నిర్భయంగా పెంచుకుంటుంది. తను ఎవరి మోచేతిక్రింద నీళ్ళు త్రాగటంలేదు. తను ఎవరికీ భయపడనక్కరలేదు.

ఇంతలో మోహన్ వచ్చాడు. అతనెప్పుడూ శరణాలయానికి రాడు. ఇంటికేవస్తాడు. ఏదో గంధముందని గ్రహించింది దుర్గ. రావడమే తరువాయి "మనం మాట్లాడుకోవాలి అలా పార్కుకు వెళదామా" అన్నాడు. తను తల ఊపింది అంగీకారసూచకంగా. బల్లసర్ది గదితలుపు వేసుకోమని ఆయాకు చెప్పి బయలుదేరింది మోహన్‌వెంట. ఇద్దరూ పార్కులోకి నడిచారు. నిర్మానుష్యంగా ఉన్న ఒకప్రాంతాన్ని ఎంపిక చేసుకొని కూర్చొన్నారు. దుర్గ సాభిప్రాయంగా మోహన్ ముఖంలోకి చూచింది.

"నేను రోజు రోజుకు ఊబిలోకి ఇరుక్కుపోతున్నాను. నేను ఇటీవల ఒక పార్టీలో చేరాను. నన్ను ఒక తీవ్రమయిన పనికి

నియోగించారు పార్టీ నాయకులు. బహుశః రెండు నెలల వరకు నీకు నేను కనవడకపోవచ్చు."

"అలాగా" అంది దుర్గ.

ఆమె అంత ముభావంగా మాట్లాడటం అతనికి ఆశ్చర్యం కలుగజేసింది. ఆమె అలా ఎందుకున్నదో అతనికి బోధపడలేదు. 'నీవు చేయబోయేపని ప్రమాదకారి కాదుకదా ! అదేమిటి ? అంత రహస్యమయిన పనికి నీవెందుకు అంగీకరించావు. చెప్పా పెట్టకుండా ఎందుకు పార్టీలో చేరావు ?' ఇలాంటి ప్రశ్నలను ఆమె వేస్తుందని, వేయాలని తను ఆశించాడు. తనకు ఆశాభంగమయింది. ముక్తసరిగా 'అలాగా' అని ఆమె ఊరుకుంది.

ఆమె తన విషయం ఆలోచించు కుంటున్నది. లేడీ డాక్టరు చెప్పిన విషయం అతనికి తెలియజెయ్యాలా అక్కరలేదా అని ఆమె మీమాంస పడ్తున్నది. చివరకు నిర్ణయానికి వచ్చింది.

"మోహన్ ! నేను ఈ రోజు డాక్టరుచేత పరీక్ష చేయించుకున్నాను. నేను — నేను గర్భవతిని." అనగల్గింది దుర్గ.

కొండ చరియమీదనుండి క్రింద లోయలోనికి పడ్డట్టయ్యింది మోహన్ స్థితి.

ఒకపైపు పార్టీ నియోగించిన కార్యం. మరోపై పు ఆపరాన్ని ఆప్యాయుతను కోరే దుర్గ స్థితి. ఏం చెయ్యాలో తోచటంలేదు. కాని ఆ స్థితిలో ఏదో మాట్లాడవలసి యున్నదని మాత్రం గ్రహించగల్గుతున్నాడు.

"మనకు ఈ పరిస్థితిలో సంతానం అనవసరం కదా ! గర్భవిచ్ఛిత్తి చేయించుకుంటావా ?" అంటూ ఆమె కళ్ళల్లోకి చూచాడు.

ఆమె కళ్ళల్లో సిగ్గు, లజ్జ కనపడటంలేదు. భయాందోళనలు అంతకన్నా లేవు.

"లేదు" అని జవాబిచ్చింది దుర్గ.

"అలాగయితే నీ పేరు ప్రతిష్ఠలకు ఈ సమాజంలో దెబ్బ తగలదా? అవివాహిత మాతకు ఏపాటి గౌరవమున్నది ఈ సమాజంలో?" అన్నాడు మోహన్.

ఆమె బదులు పలకలేదు. నేలమీదికి దృక్కులు సారించి అదేపనిగా చూస్తున్నది.

"నీకు అభ్యంతరం లేకపోతే నిన్ను నేను వివాహమాడతాను. ఇప్పుడు నీకు ఏ నిందా ఉండదు" అన్నాడు తనేదో త్యాగంచేస్తున్న పోజు పెట్టి.

చటుక్కున తల ఎత్తింది దుర్గ.

అతన్ని సూటిగా తీక్షణంగాచూచింది.

"పెళ్ళి అంటే నీకు ఎంత తేలికగావుంది. అదేదో బొమ్మలాట అయినట్లు మాట్లాడుతున్నావు. నన్ను ఉద్ధరించటానికి నీవు నన్ను పెండ్లాడనక్కరలేదు."

చెన్నాకోలుతో ఎవరో వీపు చిట్లగొట్టినట్లయింది మోహన్‌కు.

"దుర్గా" అని అరిచినంత పెద్దగా పిలిచాడు.

"మోహన్! నీ భావాలు వేరు; నా అభిప్రాయాలువేరు. నీవు తీవ్రవాదివి; నేను సంస్కరణవాదిని. నీకు నీ పార్టీ చర దైవము; నాకు నా అంతర్ప్రవృత్తే ప్రమాణం. నీకు రహస్యాలుంటాయి; నాకు రహస్యమంటే అసహ్యం. నీది బ్రహ్మాండమంత

ఆరాటం; చిన్నదైనా మంచిపని చేయుపూనటం నా అలవాటు. మనిద్దరి ప్రవృత్తులకు సహస్రాంతరం తేడా ఉన్నది. మనిద్దరిమధ్య స్నేహ సంబంధమే కాని వివాహబంధం ఏర్పడటానికి వీలులేదు. కనుక నీ ప్రతిపాదనను నేను తిరస్కరిస్తున్నాను. ఈ నా నిర్ణయంలో తిరుగులేదు. దయచేసి నీ జాలితో నన్ను చంపవద్దు"

ఇలా చెప్పేసి వెంటనే లేచిపోయింది దుర్గ. మోహన్ మాత్రం అక్కడ చతికిలబడి ఉన్నాడు చాలాసేపు. తర్వాత స్థిరచిత్తుడై తిరుగు ముఖం పట్టాడు.

## 27

వల్లికు ప్రాసిక్యూటరు వెంకట్రావును కోర్టునుంచి ఇంటికి వచ్చేటప్పుడు ఎవరో ఇరువురు యువకులు హత్య చేశారనే వార్త ఊరంతా ప్రాకింది. అనాథ శరణాలయంలో ఉన్న దుర్గకూడా ఈ మాట విన్నది. ఆమె మనస్సు విమలమీదికి పోయింది. పాపం! పెద్ద ముత్తయిదు. ఎప్పుడూ పాత పద్ధతులతో అలంకరించుకొని ఉండేది. పూజలు పునస్కారాలూ, నోములూ వ్రతాలు ఇవేకాని బయటికివచ్చి ఎరుగదు. ఆరుగురు బిడ్డలతల్లి. ఇన్నాళ్ళకీ దుఃఖం.

ఆఫీసు పనులు చకచకా ముగించి తన ఇంటికి చేరింది. వెంకట్రావుగారి వాటా ముందు వేల సంఖ్యలో జనం చేరారు. ఎలాగో అలాగు ఇంట్లోకి వెళ్ళింది. ఒక గదిలో మసక చీకట్లో విమల కూర్చునివుంది. ఆమెను పట్టుకొని ఇద్దరు ముత్తయిదువలు కూర్చున్నారు. ఆమె రోదిస్తున్నది. కంటికి మంటికి ఏకధారగా విలపిస్తున్నది. ఆమెను ఎలా ఆశ్వాసించాలో దుర్గకు తోచలేదు.

విమల దుర్గకన్నా చాల పెద్దది. జీవితాన్ని కాచి వడబోసిన వ్యక్తి. దుర్గ విమల దగ్గరకు వెళ్ళింది.

ఆమెను కౌగిలించుకొని "పిన్నిగారూ" అన్నది.

"అమ్మా దుర్గా! నా బ్రతుకు బండలయిందమ్మా" అని ఎలుగెత్తి ఏడ్చింది విమల.

ఆ వాతావరణంలో కూర్చోవటం చాల కష్టంగావుంది దుర్గకు. ఇలాంటి సంఘటన చూడటం ఇదే మొదలు తన జీవితంలో. ఒక పావుగంట కూర్చొని బయటికి వచ్చింది. వెంకట్రావుగారి శవాన్ని ఇంటికి తెచ్చారు. ఈ విషయం ఇంట్లో తెలిసింది. విమల ఒక్క ఉదుటునవచ్చి భర్త శవంపైబడి రోదించసాగింది. ఈ దృశ్యం చూడలేక చాలమంది కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. 'ఆయన అజాత శత్రుడే' అని కొందరూ

"ఎంతైనా గవర్నమెంటు మనిషికదా! ప్రభుత్వ విరోధులే ఈ పని చేసి ఉంటారు" అని మరి కొందరూ

"ఎవరితో పేచీపడే మనిషికాదే! ఇలా జరిగిందేమిటి చెప్మా" అని ఒక గ్రూపు

"పేచీ లేకపోవడమేమిటి? మొన్న తీవ్రవాదుల మీద కుట్ర కేసులో ఒళ్ళంతా కారం పూసుకొని పనిచేశాడు. అది వికటించదూ" అని మరియొక గ్రూపు ఇలా తలా ఒకరకంగా మాట్లాడుతున్నారు.

హంతకులు ఒకటికాదు రెండుకాదు చాల కత్తిపోట్లకు వెంకటు రావును గురిచేశారని అనుకుంటున్నారు అక్కడచేరిన ప్రజానీకం. దూరానసుంచొని శవాన్ని చూచి నమస్కరించి వెళ్ళింది వెంకట్రావు

వుంపుడుగత్తె తంగనాయకి. శవంమీద గుడ్డ కప్పివుంది. కనుక నిజానిజాలు కనుక్కోటానికి దుర్గకు అవకాశం లేకపోయింది.

శవాన్ని తీసుకెళ్ళిన తరువాత తన ఇంటికి వచ్చేసింది దుర్గ.

ఆమె ఆలోచించ సాగింది.

వెంకట్రావును చంపింది మోహనేనా? చంపమని ఆర్డరువేసింది అతని పార్టీయేనా? మోహన్ ఎంతగా ఎంత మారిపోయాడు. పౌర హక్కుల ఉద్యమంతో ప్రారంభించి హత్యలకుదిగే పార్టీలోచేరాడు. దృష్టిఅంతా పాక్షికమూ, కృత్రిమమూనూ. వాస్తవాన్ని గుర్తించ కుండా, ఊహించుకున్న పరిస్థితులే వాస్తవాలని నమ్మి సంచరించే బాపతు. నయం తను బలహీనత ప్రదర్శించి అతని వివాహ ప్రతిపాదనను అంగీకరించలేదు. అంతవరకు తను తెలివిగానే ప్రవర్తించింది.

లేకపోతే తన జీవితం ఒక హంతకుకి జీవితంతో ముడిపడి యుండేది. తనకు పుట్టబోయే పిల్లకు తండ్రి హంతకుడని ఊహిస్తేనే తన దేహంపై తేళ్ళు జెర్రులు ప్రాకినట్లుంటుంది. ఏమైనా ఏ పరిణామం వచ్చినా తను భయపడలేదు. తను నిర్దే శించుకున్న పంథాను తను విడువరాదు. కష్టాలు మనిషికిరాక మాకునకు వస్తాయా? అన్నింటికీ సిద్ధపడి యుండటమే మానవ లక్షణం - తను తల్లి కావల్సిందే. తన పిల్లను నిర్భయంగా సాక వలసిందే. ఇది తిరుగులేని నిర్ణయం.

# 28

ముంతాజ్, రవి ఇద్దరూ కూడా రాధాకృష్ణ ఇంటిలోనే ఉన్నారు.

హైదరాబాద్ నగరంలో మత కలహాలు ఇంకా చల్లారలేదు. దానిని మతకలహం అని పిలవడమే తప్పు. కత్తిపోట్ల సంబరం అని పిలవడం సబబేమో! కత్తిపోట్ల సంఘటనలు ఇంకా చెదురు మదురుగా జరుగుతూనే ఉన్నాయి. వాతావరణం భయోత్పాతంగానే ఉంది. పౌర జీవితం స్తంభించిపోలేదు కాని ఎవరికి వారు భయపడుతూనే ఊళ్ళో తిరుగుతున్నారు.

ఒకరోజు రాత్రి రవి ఇంటికి రాలేదు. బహుశః పనిమీద వెళ్ళినచోట తను పనిచేసే ఆ గ్రామంలోనే ఆ రాత్రికి పడుకున్నాడేమో అనుకున్నారు మరునాడు పత్రికల్లో వార్త. సాయంత్రం నుండి రాత్రి పది గంటలలోగా హుస్సేని ఆలం ప్రాంతంలో పది మంది కత్తిపోట్లకు గురి అయ్యారట. వారిపేర్లు ప్రకటించలేదు. రవి గ్రామంనుండి ఆ హుస్సేని ఆలంపేట నుండే రావాలి. ఒక వేళ కత్తిపోట్లకు గురైన వాళ్ళలో రవికూడా ఉన్నాడేమో. ముంతాజ్‌కు మనస్సు పరిపరివిధాల పోయింది. మనస్సు అంతా చెడునే శంకిస్తున్నది. "మనిద్దరంపోయి వాకబుచేసి వద్దాం అన్నగారూ" అన్నది రాధాకృష్ణతో.

"నేనొక్కడినే వెళ్ళి కనుక్కొనివస్తాను. మీకింకా బలహీనత తగ్గలేదు. మీరు ఇంట్లో ఉండండి" అన్నాడు రాధాకృష్ణ. విధిలేక అంగీకరించింది ముంతాజ్.

రాధాకృష్ణకు కూడా అనుమానంగానేవుంది రవి కత్తిపోట్లకు గురి అయినాడేమోనని. ముందుగా పోలీసు కంట్రోలు రూముకు వెళ్ళామనుకున్నాడు. కాని అక్కడికివెళ్ళి ఏం లాభం. ఏ రకమైన సమాచారమూ అందదు తనకు. కనుక ఉస్మానియా ఆస్పత్రికి వెళ్ళటమే మంచిదని భావించాడు.

ఉస్మానియా ఆస్పత్రికి వెళ్ళాడు. మత కలహాలలో కత్తి పోట్లకు గురి అయినవారిని పడుకోబెట్టే వార్డు ఎక్కడ ఉందని ఎంక్వయిరీ కౌంటరులో అడిగాడు. 24వ నెంబరు వార్డులో క్షత గాత్రులు ఉన్నారని తెలిసి అక్కడికి వెళ్ళాడు. రోగులు ప్రక్కల మీదనేకాదు. కారిడరులో నేలమీదకూడ పడివున్నారు. ఒక డాక్టరు, ఇద్దరు హవుస్ సర్జనలు, ముగ్గురు నర్సులూ హడావుడిగా తిరుగు తున్నారు. ఒకరికి కట్టుకట్టున్నారు ఒక గ్రూపు. మరొకచోట మరియొకరికి రక్తం ఎక్కిస్తున్నారు. క్షతగాత్రులలో హిందువులూ ఉన్నారు, మహమ్మదీయులూ ఉన్నారు. స్త్రీ పురుషులూ ఉన్నారు. స్టాఫ్ నర్సును కలసి క్షతగాత్రుల పేర్లు అడుగుదామను కున్నాడు. కాని ఆ పరిస్థితిలో స్టాఫ్‌ను పలకరించడమే మహా నేరంగా తోచింది. వీలయినంత మందిని మృత్యుముఖం నుండి బయట పడవేయాలని వైద్య బృందం కృషి చేస్తోంది. వారిని పల్కరించ టానికి మనస్కరించలా. తనేవెళ్ళి ప్రతి బెడ్ ప్రక్కన నిల్చుని రోగిని నిదానంగా చూచివస్తున్నాడు. అలా చేస్తున్నది తనొక్కడే కాదు. క్షతగాత్రుల బంధుగులలో చాలమంది అలాగే చేస్తున్నారు. అందరినికలయజూచాడు. రవి కన్పించలేదు. రవి చనిపోలేదుకదా! భయం ఆవరించింది. అక్కడవున్న పోలీసును అడిగాడు చని పోయిన వారిని ఎక్కడ ఉంచుతారని. మార్చ్యురీ (శవాలుంచే చోటు) కు పొమ్మన్నాడు పోలీసు. ఆ హాలులో ప్రవేశించాడు. అదోరకపు వాసన. భరించడం కష్టంగావుంది రాధాకృష్ణకు. తోటి ఒక్కొక్క శవం ఉంచిన సొరుగులాగి చూపిస్తున్నాడు. సుమారు ఇరవై మంది ఎగబడి చూస్తున్నారు. భయానకదృశ్యం అది. ఇంతలో ఆరవ నెంబరు సొరుగు లాగాడు తోటి. గుర్తించాడు రవి శవాన్ని రాధాకృష్ణ. 'రవీ' అని కేకపెట్టాడు. చుట్టూ ఉన్నవాళ్ళ

గ్రహించారు అతని తాలూకు శవం దొరికిందని. సొరుగు నెంబరు గుర్తుపెట్టుకొని శవాల హాలులోనుండి బయటికి వచ్చాడు. వాకిట్లోనున్న పోలీసును అడిగాడు 'శవం తీసుకొని పోవాలంటే ఏమి చెయ్యాల' ని ప్రొసీజరుచెప్పాడు పోలీసు. మృతుని భార్యో, సోదరుడో, రావాలి. వారు తమ వద్దనున్న మృతుని ఫోటో తీసుకొనిరావాలి. పోలీసు ఇన్స్పెక్టరువద్ద ఆ శవం తమ తాలూకుదని డిక్లరేషన్ ఇవ్వాలి. అప్పుడు ఆ శవం బంధువులకు అప్పగించబడుతుంది. ఎవరూ రాకపోతే పోలీసులే వెట్టివారిచేత దహన సంస్కారం చేయిస్తారు.

ఇదంతా అయ్యేటప్పటికి మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. రాధాకృష్ణ నీరసంగా అడుగుపెట్టాడు ఆసుపత్రినుంచి. తల దిమ్ముగావుంది. ఇంటికి చేరగలనా లేదా అనే సందేహం తనకు పట్టుకుంది. ఒకవేళ చేరినా ఈ విషయం ముంతాజ్‌కు ఎలా చెప్పడం నిన్నగాక మొన్న కత్తిపోటు ప్రమాదంనుండి తేరుకున్న ముంతాజ్‌కు ఈ వార్త ఆశనిపాతం కదా! ఆమె దక్కుతుందా! ఇలా ఆలోచించుకుంటూ ఇంటికి చేరాడు.

హాలులో కుర్చీలో కూలబడ్డ రాధాకృష్ణ వదనం గంభీరంగా ఉంది. నుదురు ముడతలుపడివుంది. అతని రాకపవ్వడి విని ముంతాజ్ హాలులోకి వచ్చింది.

"అన్నయ్యా! రవి కన్పడ్డాడా?"

అవునన్నట్లు తల ఊపాడు రాధాకృష్ణ.

"ఎక్కడ ఉన్నాడు. ఆసుపత్రిలో కాదుగదా?" కీడు శంకిస్తూనే అడిగింది ముంతాజ్. ఇంతలో శ్యామలాదేవి వచ్చింది హాల్లోకి.

"కృష్ణా ! రవి ఆసుపత్రిలో క్షేమంగా ఉన్నాడు కదా ?" ఆదుర్దాగా ప్రశ్నించింది భర్తను శ్యామలాదేవి.

"ప్రమాదం ఇకలేదు. జరిగిన ప్రమాదం మునుపే జరిగింది" అని చెప్పి తన చేతులతో తన ముఖాన్ని కప్పుకొన్నాడు. షాక్ తిన్న ముంతాజ్

"రవీ" అని పెద్ద కేకవేసి మూర్ఛపోయి అపస్మారక స్థితిలో పడిపోయింది. వెంటనే శ్యామల ఆమె తలను తన ఒళ్ళో పెట్టుకొని కూర్చుంది. రాధాకృష్ణ ఇంట్లోకివెళ్ళి స్మెల్లింగు సాల్టు తెచ్చి ఆమెకు వాసన చూపించాడు. ముంతాజ్ కదిలింది.

"రవి, నా రవి ఇకలేడా" అని ఆక్రోశించింది. ఆమె హృదయవిదారక రోదనను వినలేకపోయారు రాధాకృష్ణ దంపతులు. ఆమె మళ్ళీ మూర్ఛలోకి జారుకుంది. ఆమెను జాగ్రత్తగా సోఫా మీద పడుకోబెట్టారు.

"ముంతాజ్ పెట్టెలో ఆమె రవి తీయించుకున్న ఫోటో ఉంటుందేమో చూడు. అది చాల ముఖ్యమైన విషయం. ఆ ఫోటో లేకపోతే శవాన్ని ఆమెకు అప్పగించరు. ఆమెను ఈ విషయం అడగలేము కదా" శ్యామలను తొందరపెట్టాడు రాధాకృష్ణ.

ముంతాజ్ పరోక్షంలో ఆమె పెట్టెలో వెదకటానికి శ్యామలాదేవికి సుతరామూ ఇష్టంలేదు. అలాంటిపని తనింతవరకూ ఎప్పుడూ చేయలేదు. అవతల రాధాకృష్ణ తొందరపెట్టున్నాడు.

ముంతాజ్ పెట్టెలో రవి ముంతాజ్‌ల పెళ్ళినాటి ఫోటో దొరికింది. అది తీసుకొని హాలులోనికి వచ్చింది. అప్పటికి ముంతాజ్ తేరుకుంది. ఆమెకు కప్పుకాఫీ ఇచ్చింది శ్యామలాదేవి. నిస్సత్తువగా బెంబేలుపడి కూర్చున్నది ముంతాజ్.

రాధాకృష్ణ ఆటో తెచ్చాడు. రాధాకృష్ణ, శ్యామలాదేవి ముంతాజ్ లు ఆస్పత్రికి చేరుకున్నారు. ఆస్పత్రికి అనుబంధంగా ఇటీవల ఏర్పరచిన పోలీసు స్టేషనుకు వెళ్ళారు. రాధాకృష్ణ అన్ని విషయాలు పోలీసు ఇనస్పెక్టరుతో మాట్లాడాడు. ఫోటో చూపించాడు ముంతాజ్ చేత డిక్లరేషను ఇప్పించాడు. ఆమె యాంత్రికంగా ఆ కాగితంపై దస్కతు చేసింది. శవాన్ని స్వాధీనం చెయ్యమనే ఉత్తరువును ఇనస్పెక్టరువద్ద పొందాడు.

వ్యాను మాట్లాడివచ్చాడు. రవి శవాన్ని వ్యానులో చేర్పించాడు. ముంతాజ్ ను పట్టుకొని కూర్చుంది శ్యామలాదేవి. అంబరుపేటలో విద్యుచ్ఛక్తి సాయంతోనడిచే శవదహనాలయంలో రవి అంత్యక్రియ పూర్తి అయింది.

నిస్తేజంగా, అచేతనంగా ఉన్న ముంతాజ్ ను ఇంటికి చేర్చారు రాధాకృష్ణ దంపతులు.

## 29

దుర్గకు రవి మరణవార్తే తెలియదు. ప్రొద్దుటినుండి యాంత్రికంగా పనులు జరిగిపోతున్నాయి చకచకా. ఆమెకు కబురు పెట్టటానికికూడ వ్యవధిలేదు రాధాకృష్ణకు.

మామూలుగా ఆ రోజు రాత్రి ఆఫీసునుండి ఇంటికిపోతూ శ్యామలాదేవి ఇంటికివచ్చింది దుర్గ.

ఆ ఇంట్లోవున్న భయంకర నిశ్శబ్దవాతావరణాన్ని చూచి భయపడింది. శ్యామలాదేవి కూతురు బిక్కుబిక్కుమంటూ ఒకమూల కూర్చున్నది. ముంతాజ్ వెర్రిచూపులుచూస్తూ హాలులో ఒకమూల

కుర్చీలో ఉన్నది. శ్యామలాదేవి రాధాకృష్ణ ప్రతిమల్లాగా ఎవరి స్థానాలలో వారు వున్నారు. ఇల్లంతా కళా విహీనంగా వున్నది. నవ్వులు కేరింతలతో నిండివుండే ఆ గృహం ఆ రోజు స్మశాన వాటికలా తోచింది దుర్గకు.

'ఏం జరిగిందో? ఎవరిని ఎలా పలకరించాలో' తెలియక ఆమె మనస్సు కొట్టుమిట్టాడింది. చివరికి ధైర్యంచేసి అలా వున్నారేం? ఏం జరిగింది "ఆంటీ!" అని శ్యామలాదేవిని పలకరించింది. బదులు పలకకుండా శ్యామలా ముంతాజ్ వైపు చూచింది. అచ్చట రవి లేడు. ముంతాజ్ శూన్యదృక్కులుచూచి గ్రహించింది పరిస్థితిని దుర్గ. రవికేదో అపాయం కలిగివుంటుందని ఊహించింది.

"ఆంటీ!" అని ముంతాజ్‌ను కౌగలించుకుంది. అంతవరకూ మాటాపలుకూ లేని ముంతాజ్ ఒక్కసారిగా భళ్ళుమన్నది.

"దుర్గా! నా రవి నాకు మిగలలేదమ్మా! అని ఎలుగెత్తి ఏడ్చింది. హృదయ విదారకమైన ఆమె దుఃఖాన్ని చూచి తనకన్న పెద్దదయిన ముంతాజ్‌ను ఏమని ఆశ్వాశించాలో తెలియక దుర్గ ముంతాజ్‌ను కౌగలించుకుని కూర్చుంది. ముంతాజ్ దుఃఖము పొంగిపొరలి కట్టలుత్రెంచుకుంది. ఆమె భోరునఏడ్చింది.

'ఇక ముంతాజ్ జీవితానికి ప్రమాదం లేదన్నట్లు' రాధాకృష్ణ శ్యామల ముఖంలోకి చూచాడు.

శ్యామలకు నిబ్బరం చిక్కింది.

రవీ తనూ చేసిన పరిశోధన, గ్రామంలో కృషి వీటిని గురించి ముంతాజ్ దుర్గకు చెప్పింది.

"పిల్లలు కలిగితే పరిశోధనకు అడ్డువస్తుందని కనకుండా శరణాలయపు పిల్లలందరూ మా పిల్లలేనని భావించామమ్మా!" అన్నప్పుడు దుర్గకు అర్థమయింది వారు శరణాలయానికి ఎందుకు వచ్చేవారో. ఎంతటి త్యాగధనులో మరెంతటివట్టుదల ఆత్మస్థయిర్యం గలవారో!!

మోహన్ ఇంటిని పోలీసులు సోదా చేశారని, అతని కొద్ది సామానులు తమ ఇంట్లో పెట్టి ఇంటివారు ఆ వాటాను ఖాళీ చేయించారని, మోహన్ జాడ ఎవరికీ తెలియదనీ శ్యామల దుర్గతో చెప్పింది. వెంకటాద్రి మరణానంతరనం లలిత చనిపోయిన తరువాత ఒక్కత్తే మధ్య భాగంలో ఉండేదానికన్న మోహన్ వాటాలోకి దుర్గ వస్తానంటే ఇంటివారితో చెప్పి వారిని అంగీకరింపచేస్తానని శ్యామల దుర్గకు హామీ ఇచ్చింది. ఈ ప్రతిపాదన దుర్గకు నచ్చింది. అదీగాక ప్రక్కవాటాలో ఉంటే రాధాకృష్ణ దంపతులకు, ముంతాజ్‌కు కూడ తను చేతనయినంతవరకు సాయ పడవచ్చునని తలపోసింది.

"సరే! అలాగే ఏర్పాటు చేయించండి" అని తన ఆమోదం తెలిపింది దుర్గ.

మరునాడు సాయంత్రం మోహన్ మునుపు ఉన్న వాటాలోకి చేరింది దుర్గ.

## 30

రాధాకృష్ణ శ్యామలాదేవులు పనిచేసే ఊరు పేరు షాద్‌నగర్. పేరుకు తగ్గట్టుగా ఆఊరిలో ముసల్మానులూ హిందువులూ చెరిసగం ఉన్నారు. రాధాకృష్ణ స్థాపించిన వయోజన విద్యాకేంద్రానికి కుల

మత వివక్ష లేకుండా అందరూ వస్తున్నారు. నిరక్షరాస్యతా నిర్మూలనే కాకుండా గ్రామీణ ప్రజానీకానికి అవసరమైన అన్ని విషయాలమీద అచ్చట ప్రసంగాలు ఏర్పాటు చేస్తాడు రాధాకృష్ణ. ఉపన్యాసం ఇవ్వడం శ్రోతలు వినడం మాత్రమేకాక కేంద్రంలోకి వచ్చే విద్యార్థులు చర్చలలో పాల్గొనేటట్లు అలవాటుచేశాడు రాధాకృష్ణ. ఏదో ఎంగిలి మాటలు మాట్లాడి గొప్ప ఉపన్యాసకుడనే పేరు సంపాదించుకోడానికి వీలులేదు ఆకేంద్రంలో. శ్రోతలుగా వచ్చే విద్యార్థులు వివిధ వృత్తులు చేపట్టి సాగిస్తున్న వయోజనులు వారు అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పలేక ఉపన్యాసకులు ఒక్కొక్కపుడు తబ్బిబ్బు అయ్యేవారు.

వ్యవసాయం, గ్రామపరిశ్రమలు, ఆరోగ్యం, పారిశుధ్యం, కుటుంబసంక్షేమం, పోషకాహారం, శిశుపోషణ ఇలా ఒకటేమిటి, అనేక విషయాలపై ప్రసంగాలుండేవి. రాజకీయ ఆర్థిక, సామాజిక విషయాలపై చర్చలుసాగేవి. మానవాళి సంక్షేమానికి సంబంధించిన ఏ విషయాన్ని వదలివేసేప్రశ్నలేదు. రాధాకృష్ణ మీసవుండే గౌరవంకొద్దీ ఆయాశాఖలలో పండితులు ఉచితంగా విద్యాబోధచేసేవారు. ఇంతమంది నిష్ణాతులు ఆ గ్రామవాసులకు విద్యాబోధ చేయుపూవటం ఆ కేంద్రం యొక్క ప్రత్యేకత.

ప్రభుత్వం ఒక్కొక్కపుడు ప్రజాసందోహనికి ఉపకరించే శాసనాలుచేస్తుంది. కాని చాలమందికి ఆశాసనాల విషయం తెలియదు. అలాంటి శాసనాలు ఉన్నట్లే తెలియదు. వీటి జ్ఞానాన్ని గ్రామీణ ప్రజానీకానికి పంచటం కేంద్రం యొక్క విధ్యుక్త ధర్మాలలో ఒకటి. అలాగే ఒకసారి కవులుదారుల హక్కులను గురించి ప్రసంగం

చేయించటం జరిగింది. మరునాడు క్లాసు జరుగుతుండగా వెంకయ్య వరుగెత్తుకుంటూ వచ్చాడు.

"చూడండి ఈ అన్యాయం. నేను రెడ్డియ్యగారిపొలం కవులకు చేస్తున్నానా! ఏ సంవత్సరం మక్త ఆ సంవత్సరం చెల్లిస్తున్నానా! ఏనాడు బకాయి పెట్టలేదే! మరి ఇపుడు రెడ్డియ్యగారు నా కవులు భూమిని నాలుగు అరకలుపెట్టి దున్నిస్తున్నాడు. ఇదేమి న్యాయం! ఇలా చూస్తూ ఊరుకోవలసిందేనా? కూడుకూ గుడ్డకూ కొరగాని ఈ చదువులు ఎందుకయ్యా రాధాకృష్ణయ్యగారు" వెంకయ్య సవాలు అందరినీ ఉత్తేజితులను చేసింది. నిన్ననే హక్కులను గురించిపాఠం విన్నారు. ఈ రోజే ఆ హక్కులకు భంగకరంగా రెడ్డియ్య ప్రవర్తన. అందరం మూకవుమ్మడిగా వెళ్ళి రెడ్డెయ్యను నిలేసి అడుగుదామని నిర్ణయించుకున్నారు. అడగడంలో తప్పులేదన్నాడు రాధాకృష్ణ. కేంద్రంలోని విద్యార్థులు అందరూ కదిలారు. రాధాకృష్ణ వారిని వెంబడించాడు. వెంకయ్య కవులు చేసేపొలం దగ్గరకు పొయ్యారు.

"రాధాకృష్ణయ్యగారూ! మీరు చదువుకున్నవారు అన్నీ తెలిసినవారు. అడగండి పాయింటు" అని జనం హెచ్చరించారు.

"రెడ్డియ్య గారూ! వెంకయ్యకు ఈ పొలం కవులుకు ఇచ్చారుకదా. మీరిప్పుడు దానిని దున్నుకోవటం చట్టానికి విరుద్ధం కాదా?" అడిగాడు రాధాకృష్ణ.

రెడ్డియ్య ఒక విషపునవ్వు నవ్వాడు.

"రాధాకృష్ణయ్యగోరూ! మీరు ఈ పొలిమేరలోకివచ్చి మహా అయితే రెండేళ్ళయింది. మా కుటుంబం ఈ గడ్డ పుట్టినప్పటి

నుంచీ ఉందండీ. మీరు మాకు మంచి చెడ్డలు చెప్తారంటండీ"
ధీమాగా పలికాడు రెడ్డియ్య.

"ప్రభుత్వం అంటూ ఒకటుందంటరా లేదా? ప్రభుత్వం కవులుదారులకు రక్షణకల్పిస్తూ శాసనాలు చేసింది. మక్తా చెల్లించినంత కాలం వెంకయ్యను చేలోనుంచి వెళ్ళగొట్టరాదు." గట్టిగాచెప్పాడు రాధాకృష్ణ.

"ఏంటంటీ! ప్రభుత్వం శాసించిందీ, ఏందండీ మీరనేది? ఈ ఉళ్ళో రెడ్డియ్య చెప్పేదే 'లా'. ఆయన చేసిందే మంచి; తెలియకపోతే తెలుసుకోండి." గదమాయించాడు రెడ్డియ్య.

వ్యవహారం ముదురుతున్నదని రాధాకృష్ణ గ్రహించాడు. కాని ఈ పరిస్థితిలో వెనుదిరిగే ప్రశక్తిలేదు.

"రెడ్డియ్యగారూ! అన్నీ తెలిసి మీరు ఇలా మాట్లాడటం భావ్యంకాదు. కానూన్ ప్రకారం మీరు వెంకయ్య పొలంలో అడుగుబెట్టరాదు. అలాచేస్తే మీరు నష్టపడతారు. ముందుగా మీకు హెచ్చరిస్తున్నా." రాధాకృష్ణ కంఠధ్వని స్పష్టంగా దృఢంగా ఉంది.

అటు రెడ్డియ్య మనుష్యులూ ఇటు వయోజన కేంద్రంలోని విద్యార్థులూ గ్రుడ్లప్పగించిచూస్తున్నారీ దృశ్యాన్ని. వింటున్నారు ఈ మాటలన్నింటినీ. ఎవరూ నోరు మెదపలా. పెద్దలు ఇద్దరు మాట్లాడుతున్నారు తమకెందుకులే ఈ విషయం అని మౌనంగా ఉన్నారు.

"ఎట్లెట్లా! నేను నష్టపడతానా. తాటాకులచప్పుళ్ళకు కుందేళ్ళు బెదరవయ్యో అయ్యవార్లూ" తిరస్కార సూచకంగా మాట్లాడాడు రెడ్డియ్య.

"వెంకయ్యా! ఆ చేలో అరకలువిప్పు." అన్నాడు రాధాకృష్ణయ్య.

"చూస్తారేందిరా? ఇంతవరకూ వచ్చింది యవ్వారం" అని ఊసికొల్పాడు తన మనుషులను. రెడ్డియ్య మనుషులు కర్రలు విసిరారు కేంద్రం విద్యార్థులపై.

అడుగు ముందుకు వెయ్యబోయిన వెంకయ్య చెయ్యి విరిగింది. రాధాకృష్ణ ఎడమకాలు విరిగి కూలబడ్డాడు. కేంద్రం విద్యార్థులు చెల్లాచెదరైనారు. నల్గురు మాత్రం ధైర్యంచేసి వెంకయ్యనూ రాధాకృష్ణనూ కేంద్రపు పాకకు చేర్చారు. తరువాత వెంకయ్యను ఆ ఊళ్ళో ఉన్న ఆసుపత్రికి తీసుకొనివెళ్ళి కట్టు కట్టించారు. రాధాకృష్ణకు తగిలినదెబ్బ గట్టిదయినందువల్ల హైదరాబాద్‌లోని ఉస్మానియా ఆసుపత్రికి చేర్చారు. మత్తుమందిచ్చి ఎముకలు సరిచేసి కట్టుకట్టారు. రెండునెలలు అలా ఉండాలన్నారు. షాద్‌నగరు నుండి రాధాకృష్ణను ఆసుపత్రికి మోసుకొచ్చినవారు ఈ విషయం శ్యామలాదేవికి చెప్పి మరీవెళ్ళారు. ఆమె దిగ్భ్రాంతి చెందింది. దెబ్బమీద దెబ్బ తగులుతున్నది తమ కుటుంబాలకు. ముందు ముంతాజ్‌కు కత్తిపోటు. అది నయమయ్యేటప్పటికి రవి మరణం. అది తట్టుకునేటప్పటికి రాధాకృష్ణకు కాలు విరగడం. ఈ కష్టాలకు అంతంలేదా?

తప్పేదేముంది. ఆసుపత్రికీ ఇంటికీ తిరుగుతోంది. ముంతాజ్ ఇంటిపనుల భారం స్వీకరించింది. వయోజన విద్యాకేంద్ర నిర్వహణను చేపట్టింది.

ఇంతలో దుర్గకు గర్భం పెరగజొచ్చింది. ఇది గమనించిన శరణాలయాధిపతులు ఆమెను ఈ స్థితికి కారణభూతుడయిన

పురుషుని పేరుచెప్పమని పంజాయిషీ అడిగారు. వారి కోరికను ఆమె నిరాకరించింది. దాంతో ఆమెను ఉద్యోగంనుండి తొలగించారు శరణాలయాధికారులు. దుర్గ నిరుద్యోగి అయింది. ముంతాజ్‌కు చేదోడు వాదోడుగా ఉంటున్నది.

## 31

రాధాకృష్ణను ఆస్పత్రి నుండి ఇంటికి తెచ్చారు. నయమయినట్లే ఆస్పత్రి వారి లెక్క. కాని ఆయన నడవలేడు. ఆయనకు శ్యామలే కాళ్ళూ చేతులూను. ఎంతో ఓపికతో, ఓర్మితో ఆమె రాధాకృష్ణకు పరిచర్య చేస్తున్నది. అపుడపుడు ఆమెను చూచి పలకరించి పోవటానికి వచ్చిన విమల శ్యామలను పొగడకుండా ఉండలేకపోయింది.

“శాస్త్రి ప్రకారం తాళి కట్టించుకున్న వాళ్ళు కూడా ఇంతగా భర్తకు చాకిరీ చెయ్యరమ్మా” అభినందించేది విమల.

ఆమె పూర్వకాలపు మాటలకు నవ్వకునేది శ్యామల.

రాధాకృష్ణకు అలా ఉన్నా అతనికీ, శ్యామలకూ ఒకటే బెంగ. అదైనా వయోజన విద్యా కేంద్రాన్ని గురించే. “ఆ బాధ్యత అంతా మేము చేపట్టాం కదా నీవు నిశ్చింతంగా రాధాకృష్ణగారికి సపర్యలుచేసి ఆయనను నడిపించు” అని ఆమెకు ధైర్యం చెప్పేవారు ముంతాజ్ దుర్గలు. చెరో రోజు షాద్‌నగర్ వెళ్ళి పాఠాలు చెప్పి వచ్చేవారు.

రెడ్డియ్యమీద కేసు నడుస్తుంది. రాజీకని రెడ్డియ్య రెండు సార్లు కబురు పెట్టాడు రాధాకృష్ణకు. వెంకయ్య పొలం వదలిపెట్టి,

వెంకయ్యకు తగిలిన దెబ్బకు నష్టపరిహారం చెల్లిస్తే రాజీ కుదురు తుందని రాధాకృష్ణ జవాబు పంపించాడు.

రెడ్డియ్య పరిస్థితి కుడితిలోపడ్డ ఎలుకలా అయింది. ఒకవైపు తన వంశ ప్రతిష్ట. మరోవైపు కేసు రుజువు అయ్యేటట్టుందని తన లాయరుచెప్పే మాటలు. ఎదిరి సాక్ష్యాన్ని ఎంత తిరగతోడినా రాధాకృష్ణ సాక్ష్యాన్ని కోర్టువారు నమ్మేఅవకాశం ఎక్కువగావుందని ఆయన ఒక్క సాక్ష్యంమీదనే రెడ్డియ్యకు శిక్ష వేయవచ్చని రెడ్డియ్య లాయర్ అతనికి స్వయంగా చెప్పాడు. బింకానికిపోతే మరి ప్రమాదం ముంచుకొచ్చేటట్లుంది. రాధాకృష్ణయ్య పీడ విరగడై పోయిందనుకుందామన్నా ఈ ఇద్దరు ఆడవాళ్ళూ ప్రతిరోజూ బడి పెట్టున్నారే! అందులో ఒకామె ముసల్మానట. దాంతో ఊళ్ళో సాయిబులు ప్రయోజన కేంద్రానికి రాకపోకలు సాగించారు. పైగా ఆమె వాళ్ళకు ఎలా పొలం పండించాలో, పొలంలో వేలలో సారం పోతే ఏమీ ఎరువులువాడాలో చెప్తున్నదట. దానివల్ల అందరకీ రాబడి పెరుగుతున్నది. అదీగాక రెండో ఆవిడ — పాతికేళ్ళ అమ్మాయి-వయస్సులో చిన్నదయినా చాకులాంటిదట. తప్పదియ్య ఊళ్ళో మహిళామండలి పెట్టి ఆడోళ్ళందరినీ కూడగట్టిందట. ఆ రాధాకృష్ణయ్యే నయమనిపించాడు. వెంకయ్య పొలం తగాదా వచ్చేదాకా ఊళ్ళో వ్యవహారాల్లో తలదూర్చలేదు. ఇంతకూ ఒకరివని ఏం ప్రయోజనం. చేతులారా చేసుకున్నదానికి. చేసుకున్న వారికి చేసుకున్నంత మహదేవ అన్నారు. ఇక ఆలస్యంచేస్తే ప్రమాదం ముంచుకొస్తుంది. ఇలా ఆలోచించి ఒకరోజు రెడ్డియ్య ఒక్కడే రాధాకృష్ణ ఇంటికి వెళ్ళాడు. ఆయన చేతులు పట్టుకొని "రక్షించండి" అన్నాడు బిక్కచచ్చిన ముఖంతో.

"నాతో మాట్లాడి ఏం లాభం? వెంకయ్యతో మాట్లాడి పరిచేసుకోండి" అన్నాడు రాధాకృష్ణ.

రెడ్డియ్య తల వంచుకొని వెళ్ళిపోయాడు. చదువుకున్న రాధాకృష్ణయ్య కాళ్ళయినా పట్టుకుంటాడు కాని తన కవులుదారు వెంకయ్యను ఎలా అడిగేది. ఇది రెడ్డియ్యకు వచ్చిన సమస్య. అలాచేస్తే ఇక ఆ వూరిలో తన గతేమిటి!!

కొద్దిరోజులకు రెడ్డియ్య ఉరిపోసుకొని చచ్చిపోయాడని రాధాకృష్ణకు వార్తఅందింది. గ్రామనాయకుల మూర్ఖత్వానికి హద్దు లుండవని రాధాకృష్ణకు అవగతమయింది.

శ్యామలాదేవి సాయంతో బజారులో నడుస్తున్నాడు రాధా కృష్ణ. ఆమె అతనిని నడిపిస్తుంటే పార్వతీ పరమేశ్వరులని దోవన పొయ్యే ఆడవారూ మగవారూ నమస్కారాలుచేస్తూ పొయ్యేవారు.

దుర్గకు నెలలు నిండుతున్నాయి. పాద్నగరుకు ఆమె ప్రయాణాన్ని ఆపించింది ముంతాజ్. ఇప్పుడు నయోజన విద్యా కేంద్రం పని, వ్యవసాయ కేంద్రం పనీ రెంటినీ ముంతాజ్ చూస్తున్నది. సమర్థవంతంగా ఆమె రెండు సంస్థలనూనడిపిస్తున్నది.

రవి వదలిపోయిన పనిని సంపూర్ణంగా నెరవేర్చాలనే పట్టు దల ఆమెకు ఎక్కువయింది. ఆమె కృషిఫలిస్తున్న విధానం చూచి పత్రికా విలేఖరులు అశేషంగా రావడం మొదలుపెట్టారు. ముంతాజ్ ట్రస్టు కార్యక్రమాలు బాగా ప్రచారంలోనికి వచ్చాయి. ఇతర రాష్ట్రాలవారు సలహాల కోసం ఆమె దగ్గరకు రావటం మొదలు పెట్టారు. పగలు పనిలో నిమగ్నమయి తన బాధ మరచిపోయేది. తతిమ్మా వేళల్లో ఆమెకు కన్ను తెరిచినా మూసినా రవే కనపడే వాడు చిరునవ్వు నవ్వుతూ. ఆ దృశ్యాన్నే చూస్తూనే, మానవం

చేస్తూనే ఆమె ప్రోద్బలంచ్చేది. అదే ఆమెకు వదివేల ఏనుగుల బలాన్నిచ్చేది.

రాధాకృష్ణ రోజు రోజుకూ కోలుకుంటున్నాడు. శ్యామలా సాయం లేకుండా నడవగల్గుతున్నాడు. మరల శ్యామలాదేవి వయోజన కేంద్రపు పనిని చేపట్టింది. ముంతాజ్ ట్రస్టు పనిని ముంతాజ్ తీసుకున్నది.

# 32

దుర్గ, ముంతాజ్, రాధాకృష్ణ, శ్యామలాదేవి ఏక కుటుంబీకు లయినారు. శ్యామలాదేవి కుమార్తె అందరికీ కనుసన్నలలో మెలగుతూ ఆనందాన్ని చేకూరుస్తుండేది .... .... దుర్గ, రాధా కృష్ణ ఇద్దరూ ఇంటిపట్టున ఉండేవారు. పత్రికల్లోవచ్చే వార్తలు విని తల్లడిల్లేవారు.

'పంకజం అనే అమ్మాయి భర్తచేత వెళ్ళగొట్టబడి, పుట్టింటి వారిచేత తిరస్కరింపబడి చెరువులోపడి ఆత్మహత్య చేసుకున్నది.' ఒకనాటి వార్త — — —

'చామంతి అనే సాతికేండ్ల వడుచు భర్తపెట్టే కష్టాలకు తట్టుకోలేక చీరపై కిరసనాయిలుపోసి నిప్పంటించుకొని చని పోయింది' — — —

మరోనాటి వార్త — — —

'పావని అనే ప్రేమించి పెళ్ళిచేసుకున్న యువతి భర్త దుశ్చర్యలను చూడలేక తిరుపతిలో ఉరిపోసుకొని అసువులు బాసింది' — — —

మూడవరోజు వార్త — — —

'కట్నం ఎంత పుచ్చుకున్నా చాలక ఇంకా కట్నకానుకలు తెమ్మని భార్యను హింసిస్తుంటే, పుట్టింటివారు ఇవ్వరనితెలిసి బాధలు పడలేక ఆ భార్య విషంమింగి చనిపోయింది తెనాలి పట్టణంలో'—

నాలుగోనాడు వార్త — — —

ఇలా రోజూ వార్తలుచదివేవారు దుర్గ రాధాకృష్ణ ఇద్దరూనూ.

దుర్గ మనస్తాపం ఇంతింత కాదు.

ఇవి చదువుతుంటే ఆమె మనస్సు తుకతుక ఉడికిపోయేది.

అమాయకంగా తిరుగుబాటుచేసి అన్యాయంగా బలి అయి పోయి తన వళ్ళో ప్రాణాలువిడిచిన లలిత ఆమెకు జ్ఞాపకంవచ్చేది.

"బాబాయి! స్త్రీల బాధలకు నిష్కృతిలేదా?" అని రాధాకృష్ణను అడిగింది.

"ప్రతి దుర్మార్గం అంతమయ్యే రోజు వస్తుందమ్మా" అని జవాబిచ్చాడు రాధాకృష్ణ.

ఇంతలో రివ్వుమని దూసుకొనివచ్చింది వారి దగ్గరకు ఒక ఇరవై నాలుగేండ్ల అమ్మాయి. పరుగెత్తివచ్చిందేమో రొప్పుతున్నది. దుర్గ వెంటనే ఆమె భుజాలుపట్టుకొని కుర్చీలో కూర్చోబెట్టింది. ఇంట్లోకివెళ్ళి ఫ్లాస్కులోనుంచి కాఫీ ఒక కప్పులోపోసి తెచ్చి ఆమె ముందుంచింది. ఆమె సేదతీరిన తరువాత ఆమె చేత కాఫీ త్రాగించింది.

"నీ పేరేమిటమ్మా!" అడిగాడు రాధాకృష్ణ.

"సునీత అని పిలుస్తారండీ"

"ఏదో పెద్ద కష్టంలో ఉన్నట్లున్నావు?" జవాబుకోసం సాభిప్రాయంగా సునీతవైపు చూచింది దుర్గ. సునీత మారు పల్కలేదు.

"నా పేరు దుర్గ. వీరు నా బాబాయి రాధాకృష్ణగారు" అని పరిచయం చేసింది దుర్గ.

ఇద్దరికీ సునీత నమస్కారాలు చేసింది.

"బాబాయిగారు షాద్‌నగర్‌లో వయోజన విద్యాకేంద్రం నడుపుతున్నారు. నేను మొన్నటిదాకా అనాధ శిశు శరణాలయం ఛీఫ్ వార్డెనును" దుర్గ వివరించింది.

సునీతకు ధైర్యం వచ్చింది. వీరు తనను భర్తకు అప్పగించరని.

"అమ్మా పోయి విశ్రాంతి తీసుకో. చాల డస్సి ఉన్నావు. తరువాత నీ కథ చెప్పవచ్చు. అప్పటికి శ్యామల, ముంతాజ్ ఇద్దరూ వస్తారు.

సునీతకు తన కథముందుగా వారికి చెప్పాలనివుంది.

"బాబుగారూ నా కథ ముందుగా మీరు వినండి. తరువాత సాయంత్రం వారికి మళ్ళీ చెపుతాను" అన్నది సునీత.

"సరే! నీ ఇష్టం" రాధాకృష్ణ సావధానంగా కూర్చున్నాడు.

ఆమె తన కథ ప్రారంభించింది.

"నేను తెలుగు ఎం.ఏ ప్యాసయ్యాను. నాకు కథలంటే ఇష్టం. ప్రపంచ కథలను చాలవరకు చదివాను. ఇంతలో మా నాన్నగారు నాకు పెండ్లిచేశారు. అతడు ఒక ఆఫీసులో సెక్షను

ఆఫీసరు. నేను కాపురానికివెళ్ళాను. కాలక్షేపానికి కథలు రాయటం మొదలుపెట్టాను. పత్రికలకు పంపేదాన్ని. పారితోషికంగా మనియార్డర్లు వస్తూండేవి. రచయితగా నా అసలుపేరే వ్రాసేదాన్ని. కథలు వ్రాస్తున్న విషయం అతనికి తెలియదు. ఒకరోజు ఆఫీసు నుంచి వస్తూనే సాధించటం మొదలుపెట్టాడు. "అందరూ నన్ను సునీత భర్తగారూ అని పిలుస్తున్నారు" అని నిష్ఠూరంగా మాట్లాడాడు. "దానికి సంతోషించాల్సిందిపోయి బాధపడటం దేనికి" అని నేను అతనిని నిక్కచ్చిగా అడిగాను. ఇకనుంచి నీవు కథలు రాయటానికి వీలులేదు' అని ఆర్డరు జారీచేసి రుసరుసా ఇంట్లోనుంచి వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన పదిహేను రోజులకు నా కథ ఒక మాసపత్రికలో అచ్చయింది. పారితోషికం రెండు వందలు ఇచ్చారు. ఈ విషయం ఆయనకు తెలియదు. కాని ఆ పత్రిక మలి సంచికలో నా కథను ప్రశంసిస్తూ అనేకులు ఉత్తరాలు వ్రాశారు. ఇది చూశారు అతని ఆఫీసులో గుమాస్తాలు అధికారులు. ఆ రోజు ఆట పట్టించారు కాబోలు అతడు ఇంటికి రౌద్రాకారంగా వచ్చాడు. తనంటే నేను ఖాతరు చేయుటంలేదని కేకలువేశాడు. మౌనంగా ఉన్నాను ఏమి అంటే ఏం ప్రమాదం ముంచుకొస్తుందోనని. నా మౌనం అతనిని రెచ్చగొట్టింది కాబోలు నా జుట్టు పట్టుకొని వంగదీసి నా వీపుపై దబదబా బాదాడు. రూళ్ళ కర్రతో నా చేతి వ్రేళ్ళమీద, కాళ్ళమీదా కొట్టాడు. నానా రకాలైన దుర్భాషలాడాడు. పళ్ళు కొరికాడు. నా జీవితంలో అదే మొదటిసారి ఇంకొక మనిషిచేత దెబ్బలుతినటం. నన్ను అల్లారు ముద్దుగా పెంచారు నా తల్లిదండ్రులు. క్లాసులో ఫస్టు వచ్చేదాన్ని ; కనుక ఉపాధ్యాయులూ అధ్యాపకులు ఎంతో

వాత్సల్యంతో చూచేవారు. నాకు రోషంవచ్చింది. ఎదురు తిరుగు దామనుకున్నాను కాని అతని భీకరాకారంచూచి వస్తాయించాను. నా గదిలోకివెళ్ళి ఆ రాత్రంతా రోదించాను. అతడు హోటలుకువెళ్ళి భోంచేసి వచ్చాడు. నాకు ఆ రాత్రి భోజనప్రాప్తి లేదు. రాత్రింతా ఆలోచించాను.

ఈ రోజు ఉదయం అతడు ఆఫీసుకు వెళ్ళాడు. నేను ఇల్లు వదలి వెళ్ళిపోతున్నానని నా కోసం వెదికే వృధా ప్రయత్నం మానుకోమని, తనకు అణగి మణిగి వుండే అమ్మాయిని చేసుకొని సుఖపడమనీ ఉత్తరంవ్రాసి పెట్టి తలుపుతాళంవేసి ఇలా వచ్చేశాను. అతనివద్ద మారు తాళపుచేతులు ఉన్నాయి కనుక అతనికి ఏ బాధా ఉండదు నావల్ల" ముగించింది కథ. — — —

రాధాకృష్ణ, దుర్గ మాట్లాడకుండా కూర్చున్నారు.

సునీతకు గుండెలో దడ ప్రారంభమయింది. తను ఇల్లు వదిలిరావడం వారికి నచ్చలేదేమో ! మళ్ళీ తనను భర్త దగ్గరకు పొమ్మంటారేమో !

'చెల్లీ' అనే పిలుపు వినవడ్డది సునీతకు. అది దుర్గ కంఠ ధ్వని.

ఆ కంఠధ్వనిలో మార్దవం తొణికిసలాడుతోంది. ఈ పిలుపుకు సునీత కరిగిపోయింది.

"అక్కా" అంటూ సునీత దుర్గను కౌగలించుకుంది.

"అమ్మాయి సునీతా ! ఇది నీ పుట్టిల్లులాంటిది. ఇక్కడ నీకు ఏ అపాయమూరాదు. నీ భర్త నిన్ను ఏం చెయ్యలేడు. నీవు నిర్భయంగా, ధైర్యంగా ఉండు" హెచ్చరించాడు రాధాకృష్ణ

" బాబుగారూ ! ఒక్క సందేహం. అతడు నన్ను బలవంతాన పోలీసుల సాయంతో ఇంటికి తీసుకొని పోవచ్చునా ?" సునీత ప్రశ్న.

" పిచ్చితల్లీ ! అదా నీ భయం. అలాంటి హక్కు అతనికి లేదు. ఆ మాటకువస్తే నిన్ను నిర్బంధంగా కాపురం చేయమని కోరే హక్కు ఎవ్వరికీలేదు. నేనూ మీ అక్కయ్య దుర్గ నీకు అండగా ఉంటాము. సాయంత్రానికి శ్యామల, ముంతాజ్ వస్తారు. వాళ్ళిద్దరూ నిన్ను కడుపులో పెట్టుకొని చూచుకుంటారు. సరేనా. నీవు వెళ్ళి విశ్రాంతి తీసుకో " అభయం ఇచ్చాడు రాధాకృష్ణ.

దుర్గ సునీతకు చెయ్యి అందించింది.

ఇద్దరూ ఇంట్లోకి వెళ్ళారు.

# 33

సునీత రాధాకృష్ణగారి ఇంటికి చేరిన మరురోజు ఉదయం పల్గురు యువకులు రాధాకృష్ణగారి ఇంటి వాకిట్లో చేరారు. వారు చాల ఉద్రేకంతో ఊగిపోతున్నారు.

" రాధాకృష్ణగారూ ! వాకిట్లోకి రండి " అని గట్టిగా వాకిలి తలుపు బాదుతున్నారు. రాధాకృష్ణ తలుపు తీశాడు.

ఆయనను చూచి ఒక్కఅడుగు వెనక్కువేశారు ఆ యువకులు.

వారిని హాలులోకి ఆహ్వానించారు ఆయన. ఆయన ముఖంలో కన్పించే ప్రశాంతత వారిని అప్రతిభులను చేసింది. వారి జోరు కొంత తగ్గింది.

రాధాకృష్ణే సంభాషణను ప్రారంభించాడు.

" ఏమిటి విషయం. ఒక్కసారి అందరూ వచ్చేశారు" అన్నాడు రాధాకృష్ణ.

ఒక యువకుడు జబాబిచ్చాడు.

" ఇదిగో ఈయన పేరు దుర్యోధనరాజు. మా ఆఫీసులో సెక్షను ఆఫీసరు. మేమంతా ఎల్. ఐ. సి. లో పని చేస్తుంటాము."

అలాగా అని నమస్కారం చేశాడు రాధాకృష్ణ.

అందరూ ప్రతి నమస్కారాలు చేశారు.

" ఈయన భార్య సునీత మీ ఇంట్లో ఉన్నదని విన్నాము. ఇంటికి తీసుకొని వెళ్ళటానికి వచ్చాం." అన్నాడు మొదట మాట్లాడిన యువకుడు.

" సునీత మా ఇంట్లోనే ఉన్నది. ఆమెకు ఇష్టమయితే దుర్యోధనరాజుగారు ఆమెను వెంట తీసుకొని పోవచ్చును. నాకు అభ్యంతరం లేదు" అన్నాడు రాధాకృష్ణ.

దీంతో రెచ్చిపోయాడు దుర్యోధనరాజు.

"మీ బోంటి పెద్దలు అలా మాట్లాడటం భావ్యం కాదు. భార్య భర్తఇంట్లో ఉండాలి. ఇది ఆమె ఇష్టాఇష్టాలపై ఆధార పడే అంశం కాదు."

" కాదు బాబూ! నీవు ఆవేశంలో మాట్లాడుతున్నావు. ఏ ఒక వ్యక్తీ మరొక వ్యక్తిని నిర్బంధించరాదు; నిర్బంధించలేము. పైగా ఆమె మేజరు. ఆమె ఇష్టాయిష్టాల ప్రమేయం లేకుండా ఆమెను ఈడ్చుకుపోవడానికి ఆమె గొడ్డుకాదు. మనిషి నాయనా!"

ఇంతకూ ఆమె ఏమంటుందో పిలిపించండన్నాడు దుర్యోధన రాజు.

"అమ్మా! సునీతా! ఒకసారి హాలులోకి రా. నీ భర్త రాజుగారు వచ్చారు" అని కేకేశాడు రాధాకృష్ణ.

హాలులో జరిగేదంతా తలుపుచాటు నుండి చూస్తున్న సునీత సంభాషణంతా విన్నది. ఈ కేకవిని గతుక్కుమన్నది.

"అక్కా! నీవుకూడ నా వెంట రా" అని దుర్గతో సహా హాలులోకి వచ్చింది సునీత.

"కూర్చోండమ్మా" అన్నాడు రాధాకృష్ణ. దుర్గా సునీతలు ఆశీనులయినారు. తన భార్య తన ఎదుట పరాయి పురుషులున్న హాలులో ఠింగురంగా అని కుర్చీలో కూర్చుంటే మహచెడ్డ చిరాకు వచ్చేసింది రాజుకు. ఉద్రేకంకూడా వచ్చింది. ఇదే తన ఇల్లు అయితే వాలుగు తన్నులు తన్నే వాడినని అనుకున్నాడు. తను భర్తననే మాట జ్ఞాపకం చేసుకొని

"సునీతా! ఇంటికి పోదాము పద" అన్నాడు.

"మీ ఇల్లు నా ఇల్లు కాదు" అని ముక్తసరిగా సమాధాన మిచ్చింది సునీత.

"భార్యకు భర్త ఇల్లుగాక మరోఇల్లు ఉంటుందా చోద్యమే ఈ విషయం" అన్నాడు రాజు.

రాధాకృష్ణ కలుగజేసుకున్నాడు.

"చూడు బాబూ! నీవు యువకుడివి. పాలపొంగులాంటి వయసు నీది. ఉద్రేకం నీసొత్తు. కాని ఒక విషయం జ్ఞాపక ముంచుకో! కాలు జారితే తీసుకోవచ్చు కాని నోరు జారితే ప్రమాదం. విరిగిన పాలు తోడుకోవు. ఎంతబాధపడి, పాపం,

ఆ నిర్ణయానికొచ్చిందో సునీత. ఆమెకూ మానాభిమానాలున్నాయి, ఆలోచించే బుర్ర వుంది."

"మర్యాదగా రాకపోతే బలవంతాన తీసుకెళ్తాను. నా భార్య మీద నాకాపాటి హక్కు లేకపోలేదు. అసలు భార్యాభర్తల మధ్య మాట్లాడే హక్కు నీకెవరిచ్చారో! "

"చూడు బాబూ! నీవీ రోజు వస్తావని, అఘాయిత్యానికి తల పడ్తావని నేను ముందుగానే ఊహించాను. నీవు, నీ స్నేహితులు తలుపు కొట్టిన పద్ధతి నా అనుమానాన్ని ధృఢపరిచింది. పోలీసు స్టేషనుకు ఫోనుచేసి మరీ తలుపుతీశాను. వారీపాటికి వస్తుంటారు" తాపీగా పలికాడు రాధాకృష్ణ.

రాజుకు కైపు తగ్గింది. వెంబడి వచ్చిన యువకులకేసి చూచాడు. వారూ యుద్ధం అనవసరమన్నట్లుగా తల పంకించారు. రాజీకి వచ్చాడు రాజు.

"అయితే రాధాకృష్ణ గారూ! ఆమె ఇష్టం వచ్చినచోట ఆమెను ఉండనివ్వండి. కాని నాకూ ఆమెకూ బంధం ఇక కొన సాగటానికి వీల్లేదు"

"ఆలా దారికి రా. బాబూ! నీవు కోరింది సహేతుకం. విడా కులు కావాలని నీవు కోర్టులో పిటీషను పెట్టు. ఆమె అంగీకారం తెలుపుతుంది. తరువాత ఎవరి మానాన వారు బ్రతకవచ్చు. ఏమమ్మా! నీవేమంటావు" అని సునీత వైపు చూచాడు రాధాకృష్ణ.

"అంగీకారమే" అన్నది సునీత.

షాక్ తిన్నాడు రాజు.

సునీత ఇంత ధైర్యం చేస్తుందని, ఇలాంటి జవాబులు ఇస్తుందని అతడు ఏనాడు ఊహించలేదు. తన స్నేహితులముందు తన ప్రతాపాన్ని ప్రదర్శిస్తామని వస్తే ఇలా శృంగభంగ మయింది. వెంటనే తన స్నేహితులతో కూడా వెళ్ళిపోయాడు.

దుర్గ పకపకా నవ్వింది. రాధాకృష్ణ మందహాసం చేశాడు.

"అక్కా నీవు నాకెంతో వత్తాసు ఇచ్చావు ఈవేళ" దుర్గకు కృతజ్ఞత చెప్పింది సునీత.

"నేనేమీ మాట్లాడందే?" మాట సాగదీసింది దుర్గ.

"అక్కా! నీవు ఒప్పుకోవు గాని నిన్ను చూచి వాళ్ళు డంగయిపోయారనుకో. నీ ప్రక్కన కూచుంటే నాకు కొండంత ధైర్యం వచ్చింది. లేకపోతే నేను ఆ మాటలను అనగల్గేదాన్నా?" సునీత తన మనో భావాన్ని ప్రకటించింది.

భోజనాలకు లేచారు అందరూ.

# 34

ఆపదలోనున్న స్త్రీలను, ఆశ్రయం కావాల్సిన సునీతలాంటి యువతులను ఆదుకోవటానికి ఒక శరణాలయం స్థాపించాలని దుర్గకు ఆలోచన వచ్చింది. ఈ విషయాన్ని ఇంట్లో అందరికీ చెప్పింది. అందరూ దుర్గ ప్రతిపాదనను ఆమోదించారు. పూర్తిగా సహాయ సహకారాలందిస్తామన్నారు. దాని ఆఫీసు వ్యవహారాలన్నీ తను చూచుకుంటానన్నది ముంతాజ్. నిర్వహణ బాధ్యతను స్వీకరిస్తానని శ్యామలాదేవి హామీ ఇచ్చింది. అనుమతిస్తే తను వార్డెనుగా ఉంటానని సునీత చెప్పింది. పైగా తన నగలలో

సగం వాటాను శరణాలయానికి విరాళంగా ఇస్తానన్నది. దుర్గ పులకితురాలయింది సునీత దాతృత్వానికి, మంచితనానికి.

"నా చెల్లి నన్ను బలపరుస్తుందని నాకు మొదటి నుంచీ తెలుసు" అంటూ సునీత చెక్కిలి ముద్దాడింది దుర్గ.

శరణాలయానికి తను ఛీఫ్ వార్డెనుగా ఉంటానన్నది దుర్గ.

తన అండదండలు ఎప్పుడూ ఉంటాయన్నాడు రాధాకృష్ణ.

నగరంలో ఎంతో మంది వదాన్యులు దుర్గకు తెలుసు. వీరంతా ఆమె అనాధశిశు శరణాలయంలో పని చేసినప్పుడు పరిచయమైనారు. వారి దగ్గరకువెళ్ళి ఈ పథకం విషయంచెప్పి వేలకువేలు వసూలుచేసింది దుర్గ.

శరణాలయం ప్రారంభోత్సవానికి తేదీనిర్ణయించారు. దుర్గకు పురుడు అప్పటికి వెళ్ళిపోతుందనుకున్నారు.

అందరికీ ఆహ్వానాలు పంపారు.

శరణాలయం షాద్‌నగర్‌లోనే నెలకొల్పాలని నిర్ణయం జరిగింది.

స్థల నిర్దేశం జరిగింది. పాకలు, పందిళ్ళు వేశారు. ఏర్పాట్లు చురుకుగా సాగుతున్నాయి. ముంతాజ్, శ్యామలలు వాటిని పర్యవేక్షణచేస్తున్నారు. రాధాకృష్ణ పైఎత్తున పలహాలిస్తున్నాడు. నగరంలోని ప్రముఖులు చాల మంది వస్తారని ఆశిస్తున్నారు. శరణాలయ నిర్మాణ విషయంలో సునీత తల మున్కలైపోతున్నది. ఎక్కడ చూచినా ఆమే కన్పడుతున్నది. కాగితాల తోరణాలుకట్టించటం గోడల అలంకరణ, ఫర్నిచరును అర్డరివ్వటం,

దానిని లారీలమండి దింపించుకోవటం, వాటిని పొందికగా అమర్చ టం, ఒకటేమిటి అన్ని పనులు తనే చూసుకుంటున్నది. ఆమెకు ఇపుడు నూతనోత్తేజం వచ్చింది. ఇన్నాళ్ళకు తన ఇష్టం వచ్చినట్లు తను స్వేచ్ఛగా కథారచన సాగించవచ్చు. తనప్రతిభ లోకానికి చాట వచ్చు. తనసంస్కారాన్ని ప్రజలకు పంచిఇవ్వవచ్చు. తనజీవితానికి ఒకలక్ష్యం ఏర్పడింది. తనకొక జీవితదృక్పథం కలిగింది. వ్యక్తిత్వ వికాసదోహదమే తన కర్తవ్యం. ఏ వ్యక్తిలోని ప్రతిభా వ్యుత్పత్తులు నలిగి పసివాడిపోరాదు. స్త్రీ జాతికి జాగృతి కల్గజేయుటమే తన ధ్యేయం. దుర్గ అక్కలాంటి యువతీలలామలు సమాజంలో తయారు కావాలి. ఈ పనికి తనవంతు విధ్యుక్త ధర్మాన్ని తను నిర్వర్తి స్తుంది. ఇలాంటి ఆలోచనలతో సునీత పరవశించి పోతున్నది. శరణాలయం వేరు ఆమె వేరు కాదు. ఆమే శరణాలయం ; శరణాలయమే ఆమె.

ప్రారంభోత్సవానికి ముందు రోజు ఉదయం అందరూ షాద్‌నగర్ వెళ్ళారు. ఏర్పాట్లకు తుది మెరుగులు దిద్దారు. ముంతాజ్ ట్రస్టువారి వ్యవసాయ కేంద్రాన్ని, శ్యామలా దేవి ఆధ్వర్యం వహించే వయోజన కేంద్రాన్ని కూడా అలంక రించారు. ఇక శరణాలయం సంగతి సరేసరి. జ్వాజ్యల్య మానంగా వెలిగిపోతున్నది.

రాధాకృష్ణ ఒకసారి కలయజూచాడు. దుర్గ, ముంతాజ్, శ్యామలాదేవి, సునీతలు ఆయన దృష్టి పథంలో పడ్డారు. అందరూ ప్రతిభావంతులే; అందరూ దీక్షాపరులే. ఒకామె అవివాహిత, మరియొకామె భర్తృవిహీన. మూడవ ఆమె మగని సహకార

భాగ్యం పొందగల్గిన మగనాలు. నాల్గవ ఆమె భర్తను పరిత్య జించిన యువతి. అందుకే వారు తమ శక్తియుక్తులను వికసన చేసుకోగల్గారు. మరొకరికి అది సాధ్యం కాదేమో ఈ అకుంఠిత కార్య తత్పరత. నల్గురు స్త్రీలను దగ్గరకు పిలిచాడు. అందరూ వచ్చారు ఆయన వద్దకు. ఆయన హృదయం ఆర్ద్రమయింది. కన్నులు బాష్పపూరితాలయినాయి. వారి తలలను నిమిరాడు. "మతస్తుల భాషలో మీరు ఆదిశక్తి ప్రతిరూపాలు" అన్నాడు కన్నులు మూసుకొని.

దుర్గ పురుటు రోజు రోజుకూ వెనక్కు పోతుంది. ప్రారంభోత్స వానికి అడ్డువస్తుందేమోనని శ్యామలాదేవి, ముంతాజ్ తల్లడిల్లి పోతున్నారు. సునీతకు ఏం చెయ్యాలో తోచడంలేదు. పుట్ట బోయే పాపకు ఇద్దరమ్మమ్మలు, ఒక తాతయ్య, ఒక పిన్ని రెడీగా వున్నారు; మరో అమ్మమ్మా తాతయ్యా రిజర్వులో వున్నారు. అంతా పాపకోసం ఆదుర్దాగా ఎదురు చూస్తున్నారు; తహతహలాడి పోతున్నారు. ఉత్సవం రేపనగా ఈ రోజు సాయంత్రం దుర్గకు నొప్పులు వచ్చాయి. అప్పుడందరూ వేయికళ్ళతో అతి జాగ్రత్తగా పర్యవేక్షిస్తున్నారు.

శరణాలయం ప్రారంభోత్సవం నాటి ఉదయాన దుర్గ ఒక ఆడపిల్లను ప్రసవించింది. ఆ పిల్ల ముగ్ధ మోహనమూర్తి; జ్వాజ్వల్య దీప సుందరి. మనోహరాకారి. చక్కని చుక్క. నల్లని జుట్టు,సన్నని పెదాలు, నిటారైన ముక్కుతో పొత్తిళ్ళలో మెరిసి పోతుంది. బిడ్డను చూచుకున్న దుర్గలో మాతృత్వం తొణికిస లాడింది. బిడ్డతల నిమిరింది. తనివితీర పాపను ముద్దాడింది. అవ్యాజానుభూతితో బిడ్డపై తన వాత్సల్యాన్ని చూపింది. తల్లి

ప్రేమవాహినికి హద్దులు వున్నాయా? మాతృత్వాన్ని ఎవరు నిర్వచించగలరు! ఏమని వర్ణించగలరు! ఆ పిల్ల దుర్గా మోహన్‌ల సంవేశవ ఫలం. సంస్కరణనూ, విప్లవాన్ని సమ్మిశ్రితం చేశిఐ ఫలితమే ఆ పాప పుట్టుక. అందుకే ఆ పాపను "నవజ్యోతి" అని పిలిచింది దుర్గ. నవ శకానికి నాంది పలికిన ఆ పాపను "నవ కాంతి" అని పిలుస్తూ పాప బుగ్గలను చిదిపింది ముంతాజ్. ఈ "నవీన" జన్మ పాత రుగ్మతలను, సంప్రదాయాలను అధిగమించి నవయుగానికి సూత్రధారి అయింది. "స్త్రీలు అసమర్థత, అజ్ఞానులూ కారు అని నిరూపించింది" అంటూ ఆ చిరు పాపను ఎత్తుకొని తల నిమిరాడు రాధాకృష్ణ. "స్త్రీ జనాభ్యుదయానికి బాటలు వేసిన పాప పుట్టుక సమాజానికే ఒక అభ్యుదయం. భావి తరాలకు ఒక నవోదయం. అందుకే మన శరణాలయం పేరు నవోదయం" అంటూ నామకరణం చేసింది శ్యామలాదేవి. దుర్గ ఆనంద బాష్పాలు బిడ్డమీదికి జాలువారాయి.



# అవలోకనం

తనకున్న సామాజిక అవగాహనతో, కొన్ని జీవితసత్యాలను రంగరించి మల్లాది సుబ్బమ్మ వ్రాసిన ఈ నవలలో ఇతివృత్తం, ఒక దృక్పథంతో గమనిస్తే, వివాహ వ్యవస్థ కాగా మరొకదృష్టితో చూస్తే సంస్కరణకు విప్లవానికి ఉన్న సంబంధం. "వివాహ వ్యవస్థ అవసరమా ?", అవును అని జవాబు యివ్వతలిస్తే "ఎలాంటి వివాహం అనుసరణీయము ?", అసలు ఆ మాటకువస్తే "వివాహంయొక్క ముఖ్యోద్దేశము ఏమిటి ?" అనే ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి. ఈ నవలను ఆసాంతం చదివిన పాఠకునికి ఈ ప్రశ్నలకు తగిన సమాధానాలు దొరుకుతాయి.

"వివాహ వ్యవస్థ అవసరమా ?" అనేది వేయరాని ప్రశ్న అని కొందరు పెద్దలు భావిస్తున్నారు. మనం కావాలనుకున్నా, వద్దనుకున్నా చలించేది కాదు వివాహ వ్యవస్థ- సామాజిక పరిణామ క్రమంలో అది ఏర్పడింది. ప్రజానీకపు ఇష్టాయిష్టాలపై ఆధారపడి మనుగడ సాగించడంలేదు ఆ వ్యవస్థ. ఇదీ వారి వాదన. ఒకనాడు వివాహ వ్యవస్థ లేనేలేదని తదుపరి ఏర్పడిందని, సామాజిక పరిణామ క్రమంలో అది ఉద్భవించిందని అందరం అంగీకరిస్తాం. కాగా సమాజంలోని సభ్యుల అభిప్రాయాలను ఖాతరుచేయకుండా అది పరిణామం చెందుతుందని అంగీకరించలేము. సమాజం వ్యక్తుల కూటమి. వ్యక్తులు ప్రాణమూ చైతన్యమూ, ఆలోచనా, వివేచనాకల జీవులు. ఏ వ్యవస్థ అయినా వారికోసం పుట్టిదే

అయినప్పుడు వారు దానినిసవరించలేరనటం, వారిని నిష్క్రియా పరులుగా, సృజనాత్మక శక్తిలేనివారినిగా ఊహించటమేఅవుతుంది. వాస్తవ జీవితం అలా ఉండటంలేదు. సామాజిక పరిణామం మనుష్యుల సంకల్పాలపై, ప్రయత్నాలపై ఆధారపడుతుంది. కాగా సామాజిక పరిణామం అడ్డదిడ్డంగా జరగదు, జరగటానికి వీలులేదు. దానికి ఒక క్రమం ఉంటుంది. ఒక నియమం ఉంటుంది. దానికి ఒక పరిధి ఉంటుంది. కొన్ని పరిమితులు కూడా ఉండటం సంభవం. ఈ వాస్తవిక సత్యాలను విస్మరించక ఉండా ఉన్నంతకాలము సామాజిక పరిణామాన్ని యాంత్రికంగా చూడటం మానివేస్తాం. మానవుని స్వేచ్ఛనూ, సంకల్పబలాన్ని గుర్తించిన వారమవుతాం.

పితృదేవతల ఋణము తీర్చుకోవటానికి పురుషసంతానం కావాలి. కనుక ప్రతి స్త్రీ, పురుషుడూ కుమారుని కనే నిమిత్తం వివాహమాడాలని హిందూమతం ఘోషిస్తున్నది. కేవలం సంతానము కోసమే వివాహమాడనవసరంలేదు. వివాహబంధంలో ఇరుక్కోకుండా స్త్రీ పురుషులు సంతానాన్ని బడయవచ్చును. కాని ఇక్కడ వంశం అనే భావం ప్రవేశించింది. ఫలాని పురుషుని కుమారుడు ఫలానివాడు అనిగుర్తించడం అవసరమయింది వంశోద్ధారణకోసం. కనుక తను ఏ స్త్రీ ద్వారా నయితే సంతానాన్ని పొందగోరుతున్నాడో ఆ స్త్రీని తన అధీనంలో ఉంచుకోవాలనే తాపత్రయం పురుషుడిలో కలిగింది. అదే వివాహబంధానికి దారి తీసింది.

స్త్రీ పురుషుల సాంగత్యాన్ని, సాహచర్యాన్ని, సన్నిహితత్వాన్ని పొంఛిస్తారు. అది వారి ప్రకృతి. అందుకే వారు

జంటలుగా జీవిస్తారు. తత్ఫలితంగా సంతానం ఉదయిస్తుంది. వారికి కలిగిన పిల్లపాపలను పెంచడంలో, పోషించడంలో, విద్యా బుద్ధులు చెప్పించడంలో ఇద్దరూ భాగస్వాములు కావాలని కోరుకుంటారు. సంతానం వారిద్దరి కృషి ఫలితం కనుక, వారలా కోరుకోవటంలో విడ్డూరం ఏమీలేదు. కనుక సంతానం పెరిగి పెద్దయి వారిపై వారు ఆధారపడగలిగిన వయస్సు వచ్చేవరకు తల్లిదండ్రులిద్దరూ కలసి కాపురం చేయటం ఆవశ్యకమవుతుంది. ఎక్కువ కాలం కలసి ఉండటం అంటే దానికొక శాశ్వతత్వం యేర్పడిందన్నమాట. తాత్కాలికం కానిది శాశ్వతం. ఇలా వివాహవ్యవస్థ పుట్టి ఉంటుందని కొందరి ఊహ.

మానవ నైజంలో 'నేను, నాది' అనే భావాలు ప్రోదిచేసుకున్నాయి. జతకట్టిన ఈ స్త్రీ నాది, ఈ పురుషుడు నావాడు అనే భావం సహజంగా పుట్టింది. ఏనాడయితే మానవుడు జంతుదశను దాటాడో, వాసనాప్రేరితుడుగా మాత్రమే కాకుండా ఆలోచనకూ, వివేచనకూ తన జీవితంలో చోటుపెట్టాడో ఆనాడే కేవలం లైంగిక కామభూతికోసం ప్రాకులాడటం మానుకున్నాడు. అభిమానం, ఆప్యాయత, ఆత్మీయత, అనురాగం, ప్రేమలాంటి భావాలు అతని మస్తిష్కంలో మెదిలాయి. వాటికోసం అర్రులు చాచాడు. దాంతో ఒక పురుషుడు ఒక స్త్రీని లేక కొద్దిమంది స్త్రీలను, ఒక స్త్రీ కొలది సంఖ్యకల పురుషులను లేక ఒక పురుషుని అభిమానించటం, ప్రేమించటం జరుగుతుంది. కాగా ఆనాటి సమాజంలో ఎక్కువగా వేటలో, యుద్ధాలలో పాల్గొంటూ ఆరితేరిన పురుషుడు తన ఆధిక్యతను ఆసాంకరంగా తీసుకొని స్త్రీలను లొంగతీసుకున్నాడు. వారిని తన భార్యలుగా స్వీకరించాడు. ఇలా బహుభార్యాత్వం

స్థిరపడిపోయింది. భర్తతోతప్ప యితర పురుషులతో సాంగత్యం నెరపే అవకాశం స్త్రీలకు పోయింది. ఇదంతా "పురుషప్రతాప" ఫలితం. తరువాత స్త్రీజాతి కృషి, ఆందోళనల మూలాన బహు భార్యాత్వం చాల దేశాలలో నశించింది. ఏకపత్నీత్వం ఏక భర్తృత్వం అమలులోకి వచ్చింది. కొన్ని సందర్భాలలో ఇలాంటి వివాహబంధం దుఃఖభాజనమయింది. దాంతో విడాకుల అవసరం కలిగింది. సాధించుకున్నారు ఆ హక్కును మహిళలు పశ్చ్య ప్రమాజాల్లో.

ఈ నవలలో అనేక జంటలు గోచరిస్తాయి మనకు. సంప్ర దాయంగా వివాహమాడిన జంట ఒకటి. అందులో పురుషుడి సర్వం సహాధికారాన్ని కాదనలేదు భార్య. ఆమె గృహిణి. ఆమె కార్యక్రమాలు ఇంటికే పరిమితం. ఆమె ఇల్లాలు. పరిమితమయిన గృహప్రపంచానికి ఆమె సామ్రాజ్ఞి. ఇతర విషయాలతో భర్తను ప్రశ్నించే హక్కు ఆమెకు లేదు. ఇంటి వెలుపలి ప్రపంచంలో ఎలా సంచరించాలో అతడు నిర్ణయిస్తాడు. ఈ భావం హిందూ మతంలో, ఇస్లాంలో, రోమను కాథలికు క్రైస్తవంలో రాజ్యం చేస్తున్నాయి.

రెండవ జంట ప్రేమించి వివాహమాడి అత్తమానమూ తగవులాడుకుంటుంది. జీవితం దుర్భరం చేసుకుంటారు వారు. వారు నిజంగా ప్రేమించుకుని వివాహమాడారా ? లేక తాత్కాలిక ఆకర్షణకు, మోహానికి లొంగిపోయి వివాహబంధంలో ఇరుక్కు న్నారా అనే ప్రశ్న మనముందుకు వస్తున్నది. కామం, మోహం, ప్రేమ వేరు వేరుకదా ! మనిషికి ప్రకృతిసిద్ధమయిన లైంగిక

వాంఛను ప్రతిబింబించేదే కామం అనే భావం. అవతలి మనిషి చక్కని దుస్తులు వేసుకుని నీటుగా ఉంటాడనో, లేక సంభాషణా చతురుడనో, అందచందాలుకల వ్యక్తి అనో, ప్రశంసించటం చూస్తున్నాం. మరోవ్యక్తియొక్క మాటతీరు, నడక హొయలు, ఇతరులతో వ్యవహరించే సరళి, సంతోషాన్ని వెదజల్లే మందహాసం నిబ్బరాన్ని నిశ్చలతను ప్రతిబింబించే ముఖవర్చస్సు, జీవితాన్ని సాగించటంలో దైనందిన కార్యక్రమాలలో నేర్పు, నిపుణత, చాక చక్యం ఇలాంటివి ఎన్నో ఆకర్షణీయాలు. ఈ ఆకర్షణలకు స్త్రీలూ, పురుషులూ ఇద్దరూ లోనవుతారు. ఇది నిత్యానుభవం. పైచెప్పిన అన్ని అంశాలు ఒకచోట ఒక మనిషిలో పోగుచేసుకోనక్కరలేదు. అభిమానించే వ్యక్తికి ఇష్టమైన ఏ ఒక్క అంశమో ఉంటే చాలు. ఆమె లేక అతడు మోహంలో పడిపోతారు. దానిని ప్రేమగా భ్రమిస్తారు. వెన్వెంటనే వివాహం చేసుకుంటారు. తదుపరిజీవితం బహుముఖమని తెలుసుకుంటారు. ఇతర విషయాలలో ఒకరి పద్ధతులు మరొకరికినచ్చవు. అంతటితోఆగవు కొన్నిసందర్భాలలో. అవి అసహ్యకరంగా కన్పిస్తాయి. ఒకరిని మరొకరు రోతగా చూస్తుంటారు. అది అచిరకాలంలో ద్వేషంగా మారుతుంది. దాంతో ఆ వివాహబంధం పుటుక్కుమంటుంది.

మూడవ జంట ప్రేమించి వివాహం చేసుకున్నది. వారి మధ్య సదవగాహన ఉన్నది. వారి లక్ష్యాలలో, ఆదర్శాలలో సామీప్యం కన్పిస్తుంది. వారి ధ్యేయం శాస్త్రపరిశోధన; తద్వారా మానవ సంక్షేమం. ఈ కృషికి సంతానం అవరోధం. కనుక సంతానం కనకూడదని నిశ్చయించుకున్నారు. అవసరమైన ఆప రేషనులు చేయించుకున్నారు. పైగా వేరు వివిధ మతాలకుచెందిన

కుటుంబాలలో జన్మించారు. వారి దృష్టిలో కులాలు, మతాలు, జాతులు, తెగలు, భాషలు మానవనిర్మితాలు. అవి మానవాళి మధ్య అడ్డుగోడలు కాకూడదు. కాలేదు వారి విషయంగా. వారిది ఆదర్శ కుటుంబం. వారిలో ఒకరు మతోన్మాదానికి బలి అవుతారు. అంత టితో రెక్కలు తెగిన పక్షిపలె పడిఉండలేదు రెండవవారు. తమ విద్యుక్త ధర్మాన్ని కొనసాగించ నిశ్చయించారు; అలాజీవించారు.

నాల్గవ జంట ప్రేమికులు. వారు కలసి కాపురంచేస్తున్నారు. సంతానాన్ని పొందారు. ఇద్దరూ కలసికట్టుగా సంఘసంస్కరణకు అంకితమయిన వ్యక్తులు. వారికి ఆస్తులూ అంతస్తులపై మోజు లేదు. ఇతరుల గుర్తింపుకోసం తాపత్రియపడరు. వారికి వివాహ బంధం అనావశ్యకం ఇరువురికి వారి మనస్సులే సాక్షీభూతాలు. ఒకరకంగా వారు వివాహ వ్యవస్థను త్రోసిరాజన్నారు.

ఇక నవలలో పెద్దగా జంటలు కన్పడవు. రచనావ్యాసంగం చేసి పేరు ప్రఖ్యాతులు తెచ్చుకుంటున్న భార్యపై ఈర్ష్యాద్వేషాలు పెంచుకుని ఆమెపై ఆంక్షలు విధించపూనిన భర్త లీలగా గోచరి స్తాడు. కాని ఆమె పాత్ర ప్రస్ఫుటంగా ప్రకటితమవుతుంది. ఆమె అతనిని విడనాడుతుంది.

ఒక అమ్మాయి విద్యావతి. చుట్టూ ఉన్న సమాజ పరిస్థి తిని చూచి సంఘసంస్కరణకు పూనుకుంటుంది. ఆమె ఊరివాడే ఒకతను విప్లవదీక్షగా పయనిస్తాడు. ఇద్దరూ సమాజంకోసం, దేశం కోసం బ్రహ్మచారులుగా ఉండిపోదలిచారు. ఒక సందర్భంగా అతడు నిస్సహాయస్థితిలో ఉంటాడు. ఆ వార్త అందిన ఆమె కారుణ్యభావంతో అతనికి సేవచేస్తుంది. అతడు కోలుకుంటాడు.

ఆ సాన్నిహిత్యంలో వారు కలుసుకోవడం సంభవిస్తుంది. అది కేవలం యాదృచ్ఛికం. దేహవాసనా ప్రేరితం. ఆమె గర్భం ధరిస్తుంది. ఆమె అతనిని వీడి తన సంస్కరణోద్యమాన్ని సాగిస్తుంది. అతడు ఆమెను వదలిపోయి విప్లవమార్గాన ప్రయాణం కడతాడు. తరువాత ఆమె శుభోదయాన ఒక ఆడపిల్లను కంటుంది. ఆ పిల్ల పేరు నవోదయం. వీరికి ఆశ్రయమిస్తారు వివాహ బంధాన్ని వద్దనుకుని సంఘసంస్కరణచేసే జంట. వారి దగ్గరకే చేరుతుంది హింసపెట్టే భర్తను వదలి వచ్చిన రచయిత్రి. వీరిదంతా ఒక సమష్టి కుటుంబం. అది ఆదర్శసమాజానికి నమూనా.

ACC NO. 2860

సంఘ సంస్కరణకు జీవితం అంకితం చేద్దామనుకున్న స్త్రీ. విప్లవానికి బలి అవడానికి సిద్ధపడిన పురుషుడూ కలసి ఒక జంట కాదు. వారి లక్ష్యాలు వేరు; ఆదర్శాలు విభిన్నం. మార్గాలలో వైవిధ్యం; మనస్తత్వాలలో తేడా. కాని ఒక సన్నివేశంలో కలిశారు, సంస్కరణ ఒక సన్నివేశంలో విప్లవంతో సంబంధం పెట్టుకుంటుందని, అలాగే విప్లవం సంస్కరణను పూర్తిగా తోసి వేయలేదని రచయిత్రి భావంగా స్ఫురిస్తుంది.

OU. 12200

"కాంతికిరణాలు" పుస్తకం పేరు. నవల పూర్తిగా ఒక గుక్కలో చదివిన పాఠకులకు ఎవరు కాంతికిరణాలో వేరే చెప్ప నక్కరలేదు.

894.8133

SUB ఎం. వి. రామమూర్తి

# రచయిత ఇతర గ్రంథాలు

## వ్యాస సంకలనాలు

| | |
|---|---|
| ఓ మహిళా! ముందుకు సాగిపో | 7-00 |
| మారుతున్న సమాజం-మహిళలు | 5-00 |
| మహిళాదర్శం | 7-50 |
| స్త్రీ విమోచన | 7-50 |
| మహిళాభ్యుదయం | 15-00 |
| భావ వాహిని | 5-50 |
| మనం దేనికి బానిసలం? | 3-50 |
| తల్లే పిల్లను చంపితే? | 3-50 |
| విముక్తి ఉద్యమాలు: మహనీయులు | 8-50 |
| ఆధునిక స్త్రీ | 12-00 |
| ఆంధ్రప్రదేశ్‌లో హేతువాద ఉద్యమ చరిత్ర | 2-00 |
| ఇస్లాం: స్త్రీలు | 15-00 |

## న వ ల లు

| | |
|---|---|
| కాంతి కిరణాలు | 12-00 |
| వెలిగిన జ్యోతి | 12-00 |
| చీకటి వెలుగులు | 10-00 |
| ప్రేమ+సెక్స్ = నీతి | 17-00 |
| "ఈ దేశం నాదేనా?" | 5-00 |

## స ం క ల న ం

| | |
|---|---|
| వివాహం: నేడు, రేపు | 20-00 |

## క థ లు

| | |
|---|---|
| మాతృత్వానికి మరోముడి | 20-00 |

## అ చ్చు లో

సామ్రాజ్ఞి రుద్రమదేవి (బాలల నవల)
క్రైస్తవం: స్త్రీలు (విమర్శనాత్మక గ్రంథం)
హిందూమతం: స్త్రీలు (పరిశీలనాత్మక గ్రంథం)
ఆం. ప్ర. లో మహిళోద్యమం: మహిళా సంఘాలు
Women, Tradition & Culture
Women' s Movement & Associations in A. P.
Women in Revolt Saga of Struggle